# శ్రీ రామానుజ కీర్తి కౌముది

తిరుమల తిరుపతి దేవస్థానముల వారిచే సంభావింపబడిన

శ్రీ వైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వము

పవిత్రము

రెండవ భాగము



సంపాదకుడు :

[illegible]

ఉపన్యాసక రత్న - కవితా విశారద

[illegible]



ప్రకాశకులు :

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ గ్రంథమాల

శ్రీ లక్ష్మీ నారాయణ పురము

[illegible]

సుజ కీర్తి కౌముది

## సమాలోచన సమితి

మహా కవి - వాచస్పతి – కళా ప్రపూర్ణ
డాక్టర్ వానమామలై వరదాచార్యులు

కవి - సరస్వతీ పుత్ర - కళా ప్రపూర్ణ – పద్మ శ్రీ
డాక్టర్ పుట్టపర్తి నారాయణాచార్యులు

కవి తావతంస – గాన కళా నిపుణ
శ్రీమాన్ కరి నారాయణాచార్యులు

వ్యాకరణ విద్యా ప్రవీణ - భాషా ప్రవీణ
మాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు, **M A**

సాహిత్య రత్న - భాషా ప్రవీణ
శ్రీమాన్ కె టి. యల్. నరసింహాచార్యులు

సంగీత సాహిత్య కళా నిధి
మాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు

బాల విద్వత్కవి
కె. వి వి. యల్. నరసింహాచార్యులు, **M A, B L**

చతుర్విధ కవితా చతురానన - మహా కవి
శ్రీమాన్ విక్రాల శేషాచార్యులు

భాషా ప్రవీణ-విద్వాన్-లలిత కవి
మాన్ కోమాండూరు రామానుజాచార్యులు

# ప్రశంసలు

ధన శైల కులార్ణ వేందునా
పరదేవ ప్రస్మృతేయ మాతనోతు
సకలా మపి మేదినీం సితాం
గురు రామానుజ కీర్తి కౌముదీ

— నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు

శ్రీ రామానుజ కీర్తి కౌముది శుభ శ్రీ హేతు లీలా జయ
ప్రారంభ ప్రతిపాదకంబు - నవ సౌభాగ్య ప్రధానంబు - వి
ద్యా రాజీవ విలాస కారణము - దివ్య జ్ఞాన సంధాయక
శ్రీ రామానుజ కీర్తి కౌముది వెలార్చెన్ చిత్ర చిత్ర ప్రభల్

— కొమాండూరు రామానుజాచార్యులు

శ్రీ రామానుజ కీర్తి కౌముది జగ జ్జేగీయమాన ప్రభా
పూరంబున్ వెలయించి, భక్తి విభవంబున్ ప్రతిష్ఠించి, ల
క్ష్మీ రాజీవ దళాయతాక్ష కరుణార్ద్రీభూత చేత స్సుధా
ధారా ప్లావిత సల్ప్ర ప్రోవృత ధరా తన్వంగి సక్రాంతమున్.

— వంగవోలు ఆదిశేషశాస్త్రి



శ్రీ నివాసాయ నమః

శ్రీమతే రామానుజాయ నమః

# నివేదనము

శ్రీ వైష్ణవ వాఙ్మయము సంస్కృతము నందును, ద్రవిడము ...దును అపారముగ నున్నది. ఇతర భాష లందును కొంత ...ాన ...న్నను అట్టి వాఙ్మయము నందలి విశేషములను సులభ సుందర ...న తెలుగు భాషలో వెలయించి, ఆంధ్ర మహా జనులకు ఆత్మ ...తర్పణము గావింపవలెనని మా సంకల్పము అందులకే 'శ్రీ రామానుజ కీర్తి కౌముది' ఆవిర్భవించినది ఇయ్యది - పదునారు భాగ ...ములలో - పదునారు కళలుగా వెలయగలదు ఇట్లు పొడసె ... ...పూర్ణమగు ఈ కౌముది - శ్రీ వైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వముగా ... పొంది, ఆంధ్ర మహా జనులకు బ్రహ్మానంద సంధాయకము ...గలదు.

శ్రీ రామానుజ కీర్తి కౌముది - మొదటి భాగము - తిరుమల ...పతి దేవస్థానముల సహాయమున, మా పర్యవేక్షణముతో - 'ప్రతి ...' కళగా వెలువడి, టి టి డి. సమాచార కేంద్రములలో ...టికివి లభించుచునే యున్నది అయ్యది - పండితులచే గా, స... ...ములు - రసజ్ఞులు నగు పాఠక మహాశయు లెల్లరకు సంతృప్తిని ...ంచినట్లు గుర్తించి, మే మెంతయు సంతసించుచున్నాము

ఇప్పు డిది విదియ ఈ రెండవ కళలో - సుప్రసిద్ధులైన కవి ...డితులచే సంతరింపబడిన ఆలు విశిష్ట రచనలు పొందు ... ...నవి కావున, ఇదియు - చతుర పాఠక చకోరములకు తుష్టిని, ...ష్టిని చేకూర్చ గలదనియే సంభావింతుము

ఈ గ్రంథ ముద్రణమునకు సముచిత సహాయ మొందించిన ...మల తిరుపతి దేవస్థానముల వారికెంతయు కృతజ్ఞులము

— ప్రకాశకులు

# విషయానుక్రమణిక


౧. శ్రీ వేంకటేశ్వర స్తవ రాజము 1-16

డాక్టర్ వానమామలై వరదాచార్యులు

౨ భాగవత మత వైభవము 17-32

శ్రీమాన్ ని కం గో శ్రీభాష్యకారాచార్యులు

భగవంతుడు – భాగవతులు
భాగవత లక్షణము
భగవద్భక్తి విహీనుల లక్షణము
మత శబ్దార్థము
పాంచరాత్ర మతమే భాగవత మతము
భాగవత మత వైశిష్ట్యము
భాగవతులు - భక్తి మార్గములు
భాగవతుల వైశిష్ట్యము

3. మోక్ష సాధనములు - ప్రపత్తి దర్శనము 33-69

శ్రీమాన్ చెలమచెర్ల రంగాచార్యులు

పురుషార్థ చతుష్టయము
కర్మ యోగము
జ్ఞాన యోగము
భక్తి యోగము
ప్రపత్తి యోగము
ప్రపత్తి - అర్చావతారము

౪. పన్నిద్దరాళ్వారులు - నాలాయిర దివ్య ప్రబంధము 70-97

శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు

ప్రణామాంజలి
ఆళ్వారులు - పరమార్థము

ఆళ్వారుల వైశిష్ట్యము
ఆళ్వారుల రచనా వ్యాసంగము

౫. ఆళ్వారుల భక్తి సిద్ధాంత ప్రాశస్త్యము 98-120

డాక్టర్ జి. బి. గోపాల కృష్ణ నాయుడు

ఆళ్వారుల తత్త్వ పరిశీలనము
శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంత బీజములు
ఆళ్వారుల తత్త్వ సిద్ధాంతము
ఆళ్వారులు — తత్త్వ శాస్త్రము
ఆళ్వారుల శ్రీసూక్తులు
నిగమనము

౬. శ్రీ విష్ణు చిత్తుల కవితా వైశిష్ట్యము 121-156

డాక్టర్ పుట్టపర్తి నారాయణాచార్యులు

పరిచయము
విష్ణు చిత్తుల వైశిష్ట్యము
పెద్ద తనము
అవతారము
కాల నిర్ణయము
స్వామి సేవా కైంకర్యము
విశేషణములు - విశేషములు
శెం దమిళము
సెల్వ నంబి యభిమానము
భగవ దనుగ్రహము
తిరుమంత్ర ద్వయ చరమములు
విష్ణు సహస్ర నామము

సుగుణములు
పక్షపాతము
విశిష్ట విశేషము
వాత్సల్య భావములు
భాషా సౌందర్యము
అలంకారములు
శృంగారము
ముక్తకములు
వర్ణన విశేషములు
పుణ్య భూమి
భక్త్యావేశము
ప్రేమ భక్తి
యశోదమ్మ భావనలు
గోపికలు - గోపకులు
గోపాల కృష్ణుడు
వేణు గానము
ఉపదేశములు - సందేశములు
వేణు గాన మాధుర్యము - కవితా గాన మాధుర్యము



# శ్రీ వేంకటేశ్వర స్తవరాజము

మహా కవి
వాచస్పతి - కళా ప్రపూర్ణ
డాక్టర్ వానమామలై వరదాచార్యులు

శ్రీకర శేషశైల వర శృంగ తటోద్భవ భక్త కల్పనా
నోకహ! సుస్మితాంచిత మనోజ్ఞ ప్రసన్న కృపావలోక నా
నేక సుమాభిరామ! యఘ నిర్హర సాభయ హస్త పద్మ! ది
వ్యాకృతి! దాస వాంఛిత నిజాంఘ్రి ఫల ప్రద! వేంకటేశ్వరా!

శ్రీ లక్ష్మి రుచిరాననోత్పల శశీ! శ్రీవత్స చిహ్నాంకితా!
నీలాంభోధి మనోజ్ఞ గాత్ర విలసన్నీరేజ పత్రేక్షణా!
బాలార్క ప్రతిభా సమాన వద నాపద్ధ్వాంత నిర్వాపణా!
త్రైలోక్యాభయ దాన భద్ర కర ముద్రా! వేంకటాద్రి ప్రభో!

శ్రీ రమణీ మణి ప్రణయ చిత్త సరోరుహ భృంగ! మార వి
స్ఫార ఘను ర్విముక్త శత పత్ర ప్రవర్ష దపాంగ! భక్తి భా
వార నిమగ్న చిత్త నిజ భక్త పరీక్షణ చాతకోల్లస
న్నీరద సుందరాంగ! రమణీయ కళాంగజ! వేంకటేశ్వరా!

శ్రీ దయితా మనోహర! విశిష్ట గతి న్నిను కాదు నా చతు
ర్వేద నినాదముల్ విపుల విశ్రుత దార్శనిక ప్రమాణ సం
పాదములున్ చతుర్ముఖ శివ ప్రముఖామల భక్తకోటి మీ
పాదములే శరణ్య మని పల్కుచు నున్నవి వేంకటేశ్వరా!

నీదు పదమ్ములుం గడుగు నీరము లౌటనె కాదె గంగ బ్ర
హ్మాది సురల్ నుతింప, గరళాశనుఁ డౌదలఁ దాల్పఁ, గల్మష
చ్ఛేదకమై, భగీరథ విశిష్ట తపః ఫల సారమై, ప్రజా
మోదకరంబునై, సగర ముక్తిదమై మను వేంకటేశ్వరా!

శ్రీ ధరణీ మనోభవ ! యశేషత నిన్గొనియాడ నోదరే !
వేద పురాణ శాస్త్ర స్మృతి వీథుల శర్వ పితామహాదులం
చే దిగు లందనేల ? జల మెల్లియుఁ ద్రావక నీదు పాద గం
గోదక మాత్మ తర్షమును నోసరఁ జేయదె వేంకటేశ్వరా !

పాద యుగంబు కల్ప తరు పల్లవ పుష్ప ఫలంబు - స్వచ్ఛ గం
గోదక సన్మరంద కృత యోగి జనేక్షణ భృంగ సమ్మదో
త్పాద కరంబు - నిత్య నిజ భక్త మహోగ్ర భవాబ్ధి తారక
శ్రీదపవిత్ర యుగ్మ మనఁ జెల్వమరున్ ధర వేంకటేశ్వరా !

సుందర రూప ! నీదు పద శోభల గ్రోలెడి కంటి పాప లిం
కెంద రవేఱు జెప్పినను నెందును గాంచవు ! తల్లి చన్నులన్
విందులు గ్రోలు పాప లవి వీడు మటన్నను నేడ్వకుండగా
నుందురె ! తావకాంఘ్రి విడ నొప్పదు నా మది వేంకటేశ్వరా !

దివి భువులం బద ద్వయి మితిం దగ గొల్చు త్రివిక్రమాకృతీ !
భవ దమలాంఘ్రి యుగ్మమును బాయక కొల్చెడి భక్త కోటి, వై
భవ యుత భుక్తి ముక్తు లన పాణితలామలకంబులై చనున్
రవి శశి దివ్య దీధితుల రాజిల కుండుని వేంకటేశ్వరా !

నవ సంధ్యారుణ శోభలం బదము క్రిందం ద్రొక్కు - సుస్నిగ్ధ కై
రవ నీలాంబుజముల్ పదాల బడుచున్ రాజేయు - నక్షత్ర వై
భవ సర్వస్వము గోట మీటు నని మీ భవ్యాంఘ్రికిన్ దృష్టి దో
ష విముక్తి కిడు న్నివాళి ఏణ భూపల్ వేంకటాద్రి ప్రభో !

హారి ఘుమ్మ స్నృపదు గుల్భ యుగ్మ రమణీయాకార రేఖాద్యుతుల్
హరియించున్ హరి నీల సన్మణి మనోహారి ప్రభా పూరమున్
తొలిపించున్ సుమరాళి మంజుల గుణామోఘ ప్రశంతుల్, చారు నూ
పుర మంజీర విభూషణ ధ్వనుల నెష్టన్ వేంకటాద్రి ప్రభో !

ఉరముపైన మంథర నగ మ్మటు జంఘిక లంఘ్రము లంటుచున్
మ గతి మంథన మ్మొలయగా జనియించు సుధా రసమ్ము నా
సుర ఝరిన్ సృజింప కిసశాంబర డంబర చారుతాబ్ధిలో
మ శర ముద్గరమ్ము లన శోభిలుచున్నవి వేంకటేశ్వరా !

పతి తావకీన మృదు శ్రీపద సేవ లొనర్ప నేర్పుపై
నరకిన్ బదాబ్జముల నొత్తగ జంఘులపై మనోజ్ఞతన్
సిలు త త్సతీ పరమ పావన దివ్య కరారుణాంగుళుల్
సుర మేఘ సంగతులఁ బర్వు తటి ద్గతి వేంకటేశ్వరా !

మల గూఢ జత్రువులకున్ బయి నొప్పెసలారు నూరువుల్
గుహితంబులై మఱియు శ్రీ లలనా సహితంబులున్ స్ఫుర
ద్ఘ మహిమా యుతం బయి విభూతులు రెంటికి నీ కొకండవే
స్వామి వటంచు ని భ్భువిని చాటుచు నుండెను వేంకటేశ్వరా !

ర్వాశి తావకీన రుచిరోరు తటమ్మున బుట్టుటంగదా
ర్వ జగంబులున్ బొగడు ! చక్కని చుక్క యనన్ వెలింగె ! సు
ర్వము దూర రంభ తను కాళులకున్ సరిరా దలంచి యీ
ర్వి శిరమ్ము క్రిం దగుచు నొప్పగ నిల్చెను వేంకటేశ్వరా !

హావృ ట్కల విలీల నిరత శరీరా ! తార్క్ష్య పృష్ఠోపరిన్
వాహా మణి సంకమం దిడి సభ స్సీమం బ్రయాణించుచోన్
వర్ణాభరణా ప్తహీర సవిధాంచ న్నీల రత్నాకృతిన్
వింతున్ మహనీయ విగ్రహు నినున్ శ్రీ వేంకటాద్రి ప్రభూ !

ష్ణు కళా ! త్వదీయ కటి విశ్వ విహార సమస్త భూత వ
ష్ణము - జీవకోటి పరివేష్టిత రాజ దజాండ పిండ సం
ష్ణ కరంబు - హాటక సముజ్జ్వల వర్ణ దుకూల కాంతి ప్రభా
ఘ్న మటంచు స్వాంతమున జింతన సేసెద వేంకటేశ్వరా !

హరి నీలాభ మృదూదరావని గభీరావర్త నాభి ప్రదాం
తర సంజాత మనోహరాబ్జ సుఖ సద్మం బంధు వాగ్భర్తృ బం
భరమై వేద మరందపాన రతి నన్మత్తుండునై సేయు సు
స్వర సామ శ్రుతులం దృప్తిగాంతువె పరేశా! వేంకటాద్రి ప్రభో!

కౌస్తుభ రత్న చంద్ర సువికాసితమై, సరస ప్రపూర్ణమై,
నిస్తుల హీర మౌక్తిక వినిర్మిత నిర్మల హార పూరమై
శస్త నవాంబుద ద్యుతి విసారి భవ ద్గురు వక్ష సీమ నా
విస్తృతి వెల్గనర్థి యని వీడదు నిన్ రమ వేంకటేశ్వరా!

అతులిత రామణీయక మహార్ణవమందున బుట్టి, రత్న సం
తతులను జుట్టి, లక్ష్మి కియ్యెడందల సంతగ నుండ, వేద సం
గతి గొను నీ గళంబు వర కంబువుకే సతతంబు సద్గుణ
ప్రతతులఁ జెప్పుచుం బ్రణవ పాఠము నేర్పదె వేంకటేశ్వరా!

శ్రీప! స్వభక్త షట్పద సుసేవ్య భవ ద్వదనారవింద సం
దీపిత మంజులాధరము - నిస్తుల భోగ రమానురాగ ని
క్షేపము - దంత పంక్తులు విశిష్ట శుచిస్మిత కుంద కుట్మలా
క్షేపక కాంతి నాశ్రితు లసిల్ గుటిరుల్ దునుముక్ రమాధవా!

భాసుర భ్రూ యుగమ్ము సుమ బాణుని దివ్య శరాసనమ్ముగా
నాసికయున్ దరస్మితము నాట్య దపాంగము లయ్యనంగ బా
ణాసన ముక్త చంపక సుహార కృతార్జున మల్లికాంబుజ
ప్రాసములై జగన్నయన పర్వములై మను వేంకటేశ్వరా!

నీ టగు పద్మరాగ హరి నీల హరిన్మణి హీర తార సత్
కోటి మహోజ్జ్వలార్క మణి గుంఫితమై, పదియారు వన్నె మేలి
హాటక రత్నదీప్తిఁ దనరారు కిరీటము ప్రాజ్ఞ నగాగ్ర స
ద్వ్యాప్తి జనించు భాస్కరుని భాతి వెలుంగును వేంకటేశ్వరా!

నిం డగు చెల్వొప్పుం గొలది నీరజ శోభల నొప్పు నేత్రముల్
మండిత రత్న దర్పణ సమద్యుతి గ్రాలు కపోల పాలి నీ
రెండలు గాయు, కర్ణ భృత హీర మసార రుచి ప్రపూర స
త్కుండల యుగ్మ మర్యము విధు ప్రభ లీనెడి వేంకటేశ్వరా !

నీల కళా విలాస ముఖ నీరజ ! చందన మార్గ బిందు శో
భా లలితోర్ధ్వపుండ్ర యుత ఫాల మపార కృపా రసాబ్ధిలో
గా ల శశాంకుడై యొసగెఁ బల్మరు నాట్యములాడు ముంగురుల్
మేలము లాడు చంద్ర రత మేఘ చయమ్మును వేంకటేశ్వరా !

మానుగ శేష పీఠమున మా సతి, భూ సతి చేరి కొల్వగా
జానువు లంటు హస్తములు చారు మదేభ కరాభ శోభలన్
గానబడన్ ద్వదీయ సువికాస విలాస వరావతారముల్
మానస గోచరమ్ము లగు మార్గము జూపవె వేంకటేశ్వరా !

బాహువు లొప్పు దేవరకు పంచ శిరోరగ దివ్య శోభలన్
దోహదమై, వినీల మృదు దోర్యుగమందున శంఖ చక్రముల్
మోహన శ్రీ కరాంగుళుల ముద్రికలు జానువు లంట వ్రేలు మీ
బాహు యుగమ్మునం దమరుఁ బద్మ గదాదులు వేంకటేశ్వరా !

సురుచిర దృక్సరోజముల సూన శరుం బ్రసవించు మించు శ్రీ
హరి యగు శ్రీనివాసు ప్రణయామృత పూర్ణ మనస్సరోవర
స్ఫురిత తరంగ డోలికల నూపుగ మోగదు రాజ హంసి నీ
దరి యలిమేలు మంగఁ గని దర్శన మీయవె వేంకటేశ్వరా !

చరణ పదమ్మునం దఖిల భక్త జనాళికి దర్శనమ్మొ ద
ష్కర మగు భారుశిన్ వసతిగాఁ గొన చిన్నిపాపి సూరగా
సుర నర తిర్యగాళి దయఁ జూడగ నెంచిన నింకు బాటులోఁ
దిరుపుల నంచు నీ కొలువు దీర్చితివా యట వేంకటేశ్వరా !

తావక దివ్య మంగళ సుధామయ విగ్రహ దర్శనమ్మునన్
పావనమయ్యె జన్మ, భవ బంధము వీడె, మహాఘవార్ధి కి
నావ లభించె, ఘోర యగు నారక బాధ నశించె, ముక్తికిన్
త్రోవ జనించె, నిన్ను గను దొన్నెలఁ ద్రావెద వేంకటేశ్వరా !

నలువ శయింప సోమకుఁడు నాలుగు వేదములన్ హరించి, యా
జలనిధిలోన దాగిన ఝష మ్మయి వానిని బట్టి చంపి మి
న్నుల నజున కిచ్చినా వటులె కోల్పడు జ్ఞానము నా కొసంగి, సం
సరణ మహాబ్ధి నిస్తరణ శక్తి నొసంగవె వేంకటేశ్వరా !

అమర జనావనార్థము మహామృతపాన మొసంగ వార్ధిలో
కమఠము వౌచు మందర నగమ్మును మూపున దాల్చినాడ వీ
కుమతియు నాది కర్మ కుల గోత్ర భరమ్ము కరమ్ము నోర్చి స
న్నుతుని జేసి బ్రోవ బరువా ! కరుణామయ వేంకటేశ్వరా !

ఆది వరాహ రూపమున నబ్ధిని మున్గి కలంగునట్టి యి
మ్మేదిని ముస్తె చందమున మీగుర దంష్ట్రిక నుద్ధరించినా
వే ! దురితాబ్ధిలో మునిగి గొంతిరయు వందురుచుంటి నన్ను నో
శ్రీదయితా ! సముద్ధరణం జేయవె పాయక వేంకటేశ్వరా !

నరసింహాకృతితో హిరణ్యకశిపుని నాశంబు గావించి, శ్రీ
వర ప్రహ్లాదుని తావకీన పద సద్భక్తాగ్ర గణ్యున్ దయా
పరతన్ బ్రోచితి, వాసుకీ ప్రకృతి తద్భంగిన్ క్రమ ల్వ్యోమ్నిఁ త్వ
చ్ఛరణాహ్లాదుని నన్ను బ్రోవ వడె శ్రీశా ! వేంకటాద్రి ప్రభో !

అల బలి చక్రవర్తి త్రిపదావని నీయఁ ద్రివిష్టపమ్ములన్
గొలిచి త్రివిక్రమాకృతి నకుంఠ గతిన్ దద హంకృతిన్ రసా
తల నుడుగార ద్రొక్కితివి తద్గతి మానుక దుష్ట గర్వమున్
బలిగొని నీ పద మ్మొసగి పావను జేయవె వేంకటేశ్వరా !

ధన గర్వంబున కొన్ని నాళ్ళు, యువతీ తారుణ్య భోగాఢ్య యౌ
వన గర్వంబున కొన్ని నాళ్లు, పదవీ ప్రాశస్త్య గర్వాహతిన్
ఘన విద్యా కుల పుత్ర మిత్ర వసుధా గర్వాంధతన్ మిమ్ము సే
గనులం గానక యుంట నస్థిర సుఖానుప్రాప్తి శేషాద్రిపా !

బాల్యము స్వప్న సమ్మిత జపా కలికాకృతి సేగఁ, జిత్త చాం
చల్యముఁ గొల్పి యౌవన వసంతమునున్ మధుపాన మత్తతా
తుల్యత సేగ, వార్ధకము దోచె, నొక క్షణ మాత్ర పుష్ప ని
ర్మాల్యము రీతి నిన్గొలుచు మా తరుణ మ్మది వేంకటేశ్వరా !

కలిలో నీ సరి దైవతం బెచటనుం గానంగ రాదంచు భూ
వలయం బంతట చప్పు గట్టుకొని రేనం జాటగా నేల ? తి
ర్మల సర్వోన్నత పీఠ మీ యనతి ప్రేమనున్ భక్త లోకంబు ని
చరణాబ్జమ్ముల స్వర్ణ వృష్టి గురిపించన్ వేంకటాద్రి ప్రభో !

కొమ్మలపై రమించు పెను కోతి మన స్మృతి చంచలమ్ము, గే
హమ్మరిషట్క వర్గమున కౌరి దశేంద్రియ సంతతుల్ లులా
యమ్ములు పల్వ లాభ విఘ్నాల్వ సుఖమ్మున మున్గ సేగిఁ మా
ర్గమ్మును దప్పు నెప్పగిది గమ్యము జేర్తువొ వేంకటేశ్వరా !

ఘనస్త్రిక మంటు శబ్దముఁ బోలిన భూతము లొప్ప శబ్ద వి
న్యస్తములైన యర్థము లనన్ సకలాత్మలు వెల్గ నర్థ భా
స్విత్తుల మొదట శౌనిక విచిర్మల మూర సరూప మొందు త
త్స్వస్తిక సార మీవె యని బుద్ధి గ్రహింతును వేంకటేశ్వరా !

ఏ నొక ప్రశ్న నా దనెడి దేల్లయు నిర కొక ప్రశ్నమంతు సే
దైన వరింపు మీ వనట లబ్ధనుఁ గెంతో వివేక దృష్టితో
చేసను నీవె నాకు వరణీయుఁడ వంచు జయమ్ము గాంచె న
న్నెనును నిన్నె కోరి వరియింతు జయమ్మునను వేంకటేశ్వరా !

లీల యశోద త్రాళ్ళకు బలెం దమి పోతన వ్రేళ్ళకున్ ప్రబం
ధాలకు భక్తి కట్టుబడినాడవు, త్యాగయ భావ రాగ తా
నాలకునున్ వశుండ వయినాడవు, తద్గతి నాకు సాహితీ
లీలలు గాన డోలలును లే వెటు మెచ్చెదొ వేంకటేశ్వరా !

కృపణుఁడగు క్రూర చిత్తుఁడు నికృష్ట చరిత్రుఁడు దుష్ట మిత్రుఁడున్
శ్వపచ క్రియా శీలపుఁ డెటు స త్కృప గాంచుట లంచు నెంచదే
యపుడె జనించు వత్స మలినాదిక మాన్పులు పొట్టఁ బెట్టి స
త్కృపఁ గని క్షీర వర్షములఁ దృప్తి నొసంగనె వేంకటేశ్వరా !

అణు గత శక్తి యే యిటు లజాండమునం బరిణామ శీలమై
బొనరుచు వస్తు జాలమును బొందికగా నణువుల్ వికేంద్రితన్
దనర పదార్థ నాశ మగు తత్కృతి కర్తయె లేఁడటందు చే
తన గత సర్వ నామ పర తత్త్వ మెఱుంగను వేంకటేశ్వరా !

చిలుకకు వన్నె లందముల జిందెడి కన్నులు లేడి కౌర ! కో
కిలలకు గాన మాధురి, శిఖి ప్రకరమ్ముల నాట్య భంగిమల్,
పులికి మనోజ్ఞ చర్మ మిడి పొందిక నందములున్ వివేకమున్
గలిపి మనుష్య జాతి కిడ గాంచరు నిన్ను దలంచ రచ్యుతా !

ప్రకట మృగేక్షణాచల దపాంగ దరస్మిత వాగ్విలాస కృత్
సకల సుఖాలి మచ్చు లిడి సంస్కృతి బాఁటములైన మానవ
మొమ్మిక విహంగమ్ముగా భ్రమల నొంది వలం దగఁ జిక్కి యేడ్చు వ
ర్షుక మృగయావ ధీరితుఁడ, పాహి కృపార్ణవ ! వేంకటేశ్వరా !

నిను నీలాంబుద దేహధారు వికస న్నీరేజ పత్రేక్షణున్
వనమాలాధరు శంఖ చక్ర కరు శ్రీవత్సాంకు పీతాంబరున్
ముని హృద్గోచరు మా మనోహరు కృపా పూర్ణావతారున్ సదా
కనులన్ మూసిన విప్పినన్ గనబడంగా నిమ్ము శేషాద్రిపా !

క్షణ సంసార సుఖమ్ము నెంచ నొక మేఘ చ్ఛాయ, ఆద్యంత శ్రీ
వనమో ఛిద్ర ఘటాంబుపూర, మిక నిర్ధ స్వల్ప సంతృప్తిశో
ఘన వహ్నిం బడ ద్రేల్చు, నాజ్యసాహుతి దుర్గర్వాళిం ద్రెస్సె యౌ
వనమో స్వప్నము, వార్థకి ప్పరుచి, దేవా! వేంకటాద్రి ప్రభో!

తావక పాద వారి రుహ దాస్య విరోధులు తల్లి దండ్రులున్
భావనుతా గురూత్తములు భ్రాతలు బంధువులేని త్యాజ్యులే
సూ వె యటం చనున్ భరత సూరి - సురారి కుమారుఁడున్ - బలి
క్ష్మావిభుఁడున్ - విభీషణుఁడు సారె వచింతురు వేంకటేశ్వరా!

ధరణీ జనాలి సేన కపతార సుటుల్ ప్రథముండు పొల్పుఁ దా
బరుల స్వలాభ సిద్ధికి సపర్యల దేల్చు ద్వితీయుఁ డన్యులన్
జెరిచి సగున్ తృతీయుఁ డోరు జెందు సహాయగుఁడై తురీయుఁడేఁ
బరులను నొంచి నేఁ జెడెడి పంచముఁడన్ హరి! వేంకటేశ్వరా!

భ్రాంతా పాంగ విలాస హాస సుమమై, భామా రత స్వల్ప సౌ
ఖ్యాంతాపత్య ఫలాన్వితం బలు, యురోజాద్రి ద్వయో పేతమౌ
కాంతా మోహన రూప పావన లతా కాంతార మధ్యంబునన్
భ్రాంతిం జెందె మనః ప్లవంగ మెటు లప్పా! వేంకటాద్రి ప్రభూ!

సకల క్రియా కలాపముల సాక్షివి నీ వది కొంద రందు రే
యొక తృణ మేనియుం గదల నోపదు కర్తవు నీవు గాక యం
చాకరు వచింత్రు సాక్షి వయి కొప్పెదొ కర్తవొ! నీరు వార్ధినుం
డి కదలకుండ, నాపగల నిత్యము పారును వేంకటేశ్వరా!

క్షీరము లోని నీర మటు జేరి వసింతును నేను తావకా
కారము లోన దుగ్ధములఁ గన్పడకుండఁగ వెల్గు వెన్నవై
వారక మామకాత్మ నొగి వర్తిలుచుండగ నీవునుం దిటుల్
శ్రీ రమణా! సమైక్య గతిఁ జేరి వసింతము వేంకటేశ్వరా!

నిను గనకున్న నా మనసు నిల్వదు - నా మది నిల్వనప్పు నిన్
గనుట సు దుర్లభం బగును - కావున, పెండిలి గాని పిచ్చి బో
దన నిక పిచ్చి పోని యెటు లౌ నొక పెండిలినాఁ జెలంగె ని
కనికర మి ద్దహేతుకముగా వెలయింపుము వేంకటేశ్వరా !

నన్ను దురాత్మునిం దగ నొసర్చెడి ఐహిక భోగ భాగ్య వి
శోన్నతి తావకీన కరుణోల్లసితంబె యటంచు నెంతు నో
యన్న ! త్వదీయ త్వ త్కృప నెదం బరికించిన నన్య హానికై
నిన్ను బ్రవించునట్టి యతి వృష్టిగ నెంచను వేంకటేశ్వరా !

నిను గని పారవశ్యమున నిస్తుల మోహ సుఖానుభూతితో
మని యజరామరంబుగ నమ స్థితి నుండెడి యాత్మ యిట్టి లీ
తనువును గూడి తాను భవ తాపము నొందిన యట్లు నొచ్చెడిన్
ఇనుమును గూడి అగ్ని భరియించును ఘాతల వేంకటేశ్వరా !

నా తాపత్రయ మార్చు మేఘమవొ ? యన్నా ! నాదు కన్దోయికిన్
శీతా నీల కలా ప్రకాశ మిదు స చ్చిద్రత్న దీపమ్మవో ?
చేతోమోద మొసంగు దైవ ప్రకృతి శ్రీ ల్మెలోకన స్థైయు వి
స్ఫీతా గుర్వసితాభ్ర ధూపమవా ? దీప్తిన్ వేంకటాద్రి ప్రభో !

లల సదస ద్వివేక సువిలాస మతిన్ హృదయస్థ భావనల్
బలుకఁగఁ బూర్ణ శక్తి గల వాక్కును నాత్మ ప్రయోజనాలి నిం
పొలయఁగఁ బూర్ప నింద్రియ సమున్నతి నిచ్చినసేని నే నినున్
దలఁప నుతింప నర్చన మొనర్పను శ్రీకర ! వేంకటేశ్వరా !

త్రుపుఁ కరోర లోహమును రూపర జేసెడినట్లు తా నిలన్
తపుఁ మనుష్య దేహమును తప్పక నాశము నొందజేయు నీ
ముప్పులు దప్ప నీ దగు సమూల్య కృపా నిన వార్ధిఁ దేల్చి న
న్నెప్పుడు తపం త్రోవలకు నేగఁగ నీయకు వేంకటేశ్వరా !

పెక్కుర నన్యదైవముల వేమరు వేడిన లాభ మేమయా ?
నిక్కపు బంధ ముక్తి నిడు నిస్తుల దైవము నీవ యంచు నే
మ్రొక్కెద నీకె, నీరు తరుమూలమునం దిడకుండ మూర్ఖతన్
దక్కున కొమ్మలం దగుడ దాన ఫల మ్మది వెంకటేశ్వరా !

అక్కర రాని లోభి ధన మిట్టులు జ్ఞాన ధనమ్ము గల్గియున్
జక్కని సువ్రతాచరణ సాధనకై వినియోగ పెట్టమిన్
లెక్కకు వచ్చునే ప్రజలు సేర్చు ననాగా, తిలల్ ధరించు పూల్
ముక్కలు శారభాంబు నిధి ము॥ సుఖించును వేంకటేశ్వరా !

గోవిందా ! హరి ! వడ్డికాసుల దొరా ! కోటర్క సంకాశ ! ఓ
గోవిందా ! హరి ! నిత్య మానవ మ్రొక్కుల్ కొంప వెంకన్న ! ఓ
గోవిందా ! హరి ! యేడు కొండల దొరా ! కోట్యర్క దండమ్ములో
మా వింద హరి ! శ్రీనివాస ! యలమేల్మంగేశ ! శేషాద్రిపా !

స్వామి ! త్వదీయ దర్శనము సల్పుటకై ప్రజ లక్షలాది వి
శ్రామము లేక, యాలయపు ప్రాంగణ వీథుల రేబవళ్ళ నో
కామిత దాత ! మా కనులు కాచెను కానరావె మా
నోముల పంట యంచు నిను నోరరుగన్ నుతి సేయు వేంకటా !

మేదిని వెల్ల వేల్పులకు మీరున్న పూజ్యపు నీవె మాట నే
నీదు బలమ్ము జూచుకొని నీ చెంతలిన్ లయ కాలునికే మదో
న్మాదుని దుర్విధిన్ బిలుకు మార్చ్రంగ నెంచెద, నీదు దాసుపై
కా దనబోక, సుంత యనుకంప వహింపవె వేంకటేశ్వరా !

రవ్వయు నేను నా మెంతవ రాజలుచున్న యభీప్సి తార్థమాలి
మవ్వపు భక్తి మీ మను సమ్మర్పణ నేయక ముందె సర్వమున్
జవ్వగ నే నెరింగితిని నీవు వచింపంగ నేల యంచిటుల్
నవ్వుచు నున్న యట్లు వదన మ్మగపించును వేంకటేశ్వరా !

ఉదయమునన్ గ్రుధారుణత నర్పి ప్రజావళి సూర్య దృష్టులన్
గొనకొని కర్మ పీరతను నూల్కొనఁ జేయఁగఁ జూచి యట్టులే
సదమల శీత దృష్టులను చంద్ర కళాత్ములఁ గాంచి నిద్దురన్
బొదవఁగఁజేసి నీ ప్రజలఁ బ్రోచుచు నుంటివి వేంకటేశ్వరా !

మనికి యశాశ్వత మ్మతి ప్రమాద కరంబులు నింద్రియమ్ములున్
మన మతి చంచలంబు, మతి మాన్య వివేక విహీన, మల్లె చే
తనము యనాది కర్మ సముదాయ నిబద్ధము స్వామి ! నీ వినా
యనితర సాధ్య మీ జన జనావన కార్యము వేంకటేశ్వరా !

ధర నొక కల్ప మేగిన సుధా రస పాన నివృత్త చిత్తులై
సరసిజ గర్భ శక్ర త్రిదశ ప్రభృతుల్ నశియింత్రుగాని, నీ
చరణ సరోరుహస్మృతి రసాయన మత్తు లనన్య చిత్తుల
ప్పరమ పదంబునం దెపుడు భద్రత నుందురు వేంకటేశ్వరా !

'యస్య శరీర మాత్మ' యని, 'యస్య మహీ చ శరీర' మంచు శ్రు
త్యాస్యమునన్ వచించిన మహా వచనమ్ము లవన్నియున్ వృథా
హాస్యము లౌనె ? పృథ్వి భవ దంగమె యైన మను, దానవే శిలా
దాస్యము జేయు నీకును ముదావహ మౌఁ గదె వేంకటేశ్వరా !

నే నిను గాంచినంతటనె, నీవు ననుం గృప జూచినంతనే
నేను త్వదీయ నేత్రముల నిల్చితి, నీవును నాదు నేత్రమై
కానఁగనైతి నీ యతుల కారుణి కామృత మాను మత్తులో
నే నను మాట లే దగుడు నీవె సమస్తము వేంకటేశ్వరా !

ధనముల నెట్టి వస్తు సముదాయమునుం గొనవచ్చు, ప్రేమ సా
ధనమున సుందరీ ప్రణయ ధాత్రిని నేలఁగవచ్చు, గో ఘృతేం
ధనముల యజ్ఞ వహ్ని మదిఁ దన్పఁగ వచ్చునుగాని భక్తి, బం
ధనమునఁ దక్క నీవు వసుధన్ వశ మొందవు వేంకటేశ్వరా !

లి భవదీయ సత్కృపకు లక్ష్యములై రహియించు యాత్మలున్
వెలుఁగునె సంస్మృతిన్ మమత మేకొన, తిర్గి భవాబ్ధి ముగ్గునే?
వెలి యయి నట్టి వెన్న పదివేల ప్రయత్నము లాచరించినన్
లియునె మజ్జిగన్ మునిఁగి కప్పడబుండగ వేంకటేశ్వరా!

సుర నర తిర్యగాదులు వసుంధరపై నిను జూడ నెంచి యో
గారి! నిజ సత్త్వ జన్మ సముపార్జిత పుణ్యము లేరి రాశి బో
యా? వరుసం ఫలాకృతిగ శ్రీపతి! నిన్ దులఁదూఁచ, సర్వ్యగో
చరులయి నివాసముగ కీర్తి వహించెనో? వేంకటేశ్వరా!

ను గని నేను నా తృషిత నేత్ర సరోజ్మల వ్రాన్ని వేశముం
చౌనరగ ధ్యాన పీఠమున నుంచి నరించి మ దాత్మనే సమ
ర్పణ మొనరించినాఁడ, నెడఁబాయఁగ న్యాయమె? మూర మైత్రి పీ
కసులకు గుండె పీడి చనఁగల్గుదు వెట్టులు? వేంకటేశ్వరా!

సర్వ పితామహా ద్యమర సంతతకిన్ ప్రియమౌ రసాయన
మ్మూర్వి సుధా రసాభ మయి యుగ్ర జరామయ జన్మ మృత్యు దు
ర్గర్వ మడంచు భేషజము గవ్వయు వెచ్చము లేక తీయనై
సర్వులకుఁ గూర్చు నౌషధము నీ శుభ నామమె వేంకటేశ్వరా!

కలువల చిన్నబుచ్చు మొలుగౌ కను దమ్ములఁ జూడ వేలనో?
జలజములన్ హసించు ముఖ చంద్రుని వాక్సుధ జిల్కవేల? యా
నెలఁతలఁ దన్ని దాఁకి పసు నీ పద తీర్థము నీయ వేల? నా
తలఁపుల నెప్డు నీ చరణ ధారణ నీయవె వేంకటేశ్వరా!

పాప కలాప సంసరణ పంకి ముఖమ్మున బుట్టి వచ్చి, పు
ణ్యాపగలోని కేగి, విమలాంగములన్ దగ వీడి, కాంతి సం
దీపిత శూన్య సంగతి రతిన్ రవి గాంచి హసించు తమ్మినై
పాపము పుణ్యమున్ గడిగి భక్తి నరించెద వేంకటేశ్వరా!

కోపములో వివేకమును గోల్పడనీక, భయావహమ్ములౌ
యాపదలందు నోపికను నంచిత ధైర్యము వీడనీక, సం
దీపిత సర్వ సంపదల నీ పద భక్తి దొలంగనీక, నా
ప్రాపువు నీవయై యెపుడు పాలన సేయవె వేంకటేశ్వరా!

నిత్యము తావకీన పద నీరజ దాస్యము భాస్యమంచు నే
భృత్యుఁ డొనర్చునో యతని భృత్యుల భృత్యుల భృత్య భృత్య త
ద్భృత్యుల శ్రేణి నంతిమపు భృత్యుఁడ నై తరు యాలమున్ ఫల
మ్మత్యనురాగ దృష్టి విటపాంతములం దిడు వేంకటేశ్వరా!

ఆరయ నద్వికార మయమైన శరీరమె నే ననుచున్
దార సుతాప్త మిత్ర వసుధా పశు వర్గము నాది యంచు సం
సారము సార యుక్తి యని శాశ్వత మంచు దలంచు, నజ్ఞతా
భార ముడించి జ్ఞాన పరిపాక మొసంగవె వేంకటేశ్వరా!

నీ కరుణార్ద్రతన్ గనిన నిక్కపు భక్తియె కాక వేరె యా
వ్యాకరణాది శాస్త్రములు లభ్యము లేల? సుమన స్సుధా రుచుల్
లేకయు నీడ నీయక ఫలించని యున్ దులసీ మహీ రుహ
మ్ముకులతో నె సౌరభము లర్పణ సేయదె వేంకటేశ్వరా!

* * *

ఘోరాజ్ఞాన తమోంధకార మడగన్, గోపాల భక్త్యుత్కట
క్షీరాంభోనిధి పొంగ, షోడశ కళా శ్రీన్ మేలొ్కనన్, జ్ఞాన శా
సారావాస ప్రసన్న నేత్ర సుమన స్సౌగంధికా మోదమై
శ్రీ రామానుజ కీర్తి కౌముది దలిర్చెన్ వేంకటాద్రి ప్రభూ!



ులి భవదీయ సత్కృపకు లక్ష్యములై రహియించు యాత్మలున్
మెలఁగునె సంసృతిన్ మమత మేకొన, తిర్గి భవాబ్ధి మున్గునే?
వెలి యయి నట్టి వెన్న పదివేల ప్రయత్నము లాచరించినన్
ులియునె మజ్జిగన్ మునిఁగి కప్పడకుండగ వేంకటేశ్వరా!

సుర నర తిర్యగాదులు వసుంధరపై నిను జూడ నెంచి యో
ారి! నిజ సత్తు జన్మ సముపార్జిత పుణ్యము లేరి రాశి బో
ుగా? వరుసం ఫలాకృతిగ శ్రీపతి! నిన్ దులఁదూఁచు, సర్వదే
ులయు నివాసముగ కీర్తి వహించెనో? వేంకటేశ్వరా!

ును గని నేను నా తృషిత నేత్ర చకోరముల వ్యాప్తి వేళయిం
సౌసరగ ధ్యాన పీఠమున నుంచి నరించి మ దాత్మనే సమ
ర్పణ మొనరించినాఁడ, నెడఁబాయఁగ న్యాయమె? మార మైత్రి వీ
కసులకు గుండె పీడి చనఁగల్గుదు వెట్టులు? వేంకటేశ్వరా!

శర్వ పితామహా ద్యమర సంతతకిన్ బ్రియమౌ రసాయన
మ్మూర్వి సుధా రసాభ మయి యుగ్ర జరామయ జన్మ మృత్యు దు
ర్గర్వ మడంచు భేషజము గవ్వయు వెచ్చము లేక తీయనై
సర్వులకుఁ గూర్చు నౌషధము నీ శుభ నామమె వేంకటేశ్వరా!

కలువల చిన్నబుచ్చు మెఱుఁగౌ కను దమ్ములఁ జూడ వేలనో?
జలజములన్ హసించు ముఖ చంద్రుని వాక్సుధ జిల్కవేల? యో
నెలఁతలఁ దన్ని దూకి పసు నీ పద తీర్థము నీయ వేల? నా
తలఁపుల నెప్డు నీ చరణ ధారణ నీయవె వేంకటేశ్వరా!

పాప కలాప సంసరణ పంకి ముఖమ్మున బుట్టి వచ్చి, పు
ణ్యాపగలోని కేగి, విమలాంబువులన్ దగ పీడి, కాంతి సం
దీపిత శూన్య సంగతి రతిన్ రవి గాంచి హసించు తమ్మినై
పాపము పుణ్యమున్ గడిగి భక్తి నరించె వేంకటేశ్వరా!

కాఁగా — షడ్గుణైశ్వర్య సంపన్నుఁడు, సకల భూతాధారభూతుఁడు పరబ్రహ్మయు నగు వాసుదేవునకు — 'భగవాన్' అను శబ్దము వాచ్యము. భగవములు కలవాఁడు భగవానుఁడు. భ, గ, వ, అను అక్షరములకు అర్థ పర్యంతము శక్తి భగవంతునియందు ముఖ్య వృత్తిచే అర్థబోధక మగు ఈ శబ్దము — పరావర జ్ఞాన సంపన్నులగు మహాత్ముల యెడ గూడ ఉపచార వృత్తిగ ప్రయోగింపఁబడుచున్నది. భగవానుఁ డనఁగా — జ్ఞాన శక్తి బల ఐశ్వర్య వీర తేజస్సు లను ఆరు గుణములు కలిగి హేయ గుణములు లేనివాఁడు. అట్టి నిఖిల హేయ ప్రత్యనీకుఁడు — సమస్త కల్యాణ గుణ విశిష్టుఁడు నగు పరమాత్మయందు భక్తి గలవారు భాగవతులు.

'యద్వా, భగవతా ప్రోక్తం భాగవతం వచః, తత్ స్మృతం భాగవత మతమ్' అనఁగా — భగవంతునిచే ప్రతిపాదింపఁబడు జ్ఞానము, శ్రీ పాంచరాత్ర శాస్త్రోదిత భగవత్స్వరూపారాధనాత్మకము, తద్వైభవము భాగవత మత మని నిర్వచింపవచ్చు నని తాత్పర్యము.

'భగవతి భక్తాః భాగవతాః, తేషాం మతం భాగవత మతమ్

---

* ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః
జ్ఞాన వైరాగ్యయో శ్చైవ షణ్ణాం భగ ఇతీరణా
వసంతి సర్వ భూతాని భూతాత్మ న్యఖిలాత్మని
సర్వ భూతే ష్వశేషేషు వకారోఽర్థ స్తతోఽవ్యయః
ఏవ మేష మహా శబ్దో మైత్రేయ భగవా నితి
పరమ బ్రహ్మ భూతస్య వాసుదేవస్య నాన్యగః
తత్ర పూజ్య పదార్థోక్తి పరిభాషా సమన్వితః
శబ్దోఽయం నోపచారేణ అన్యత్ర హ్యుపచారతః
జ్ఞాన శక్తి బలైశ్వర్య వీర్య తేజాం స్యశేషతః
భగవ చ్ఛబ్ద వాచ్యాని వినా హేయై ర్గుణాదిభిః ''
— (విష్ణు పురాణము 6-5-74 శ్లో॥ మొదలు 79 శ్లో॥ వఱకు

లి భవదీయ సత్కృపకు లక్ష్యములై రహియించు యాత్రలున్
వెలఁగునె సంస్కృతిన్ మమత మేకొన, తిర్గి భవాబ్ధి ముగ్గునే ?
వెలి యయి నట్టి వెన్న పదివేల ప్రయత్నము లాచరించినన్
లియునె మజ్జిగన్ మునిఁగి కప్పడకుండగ వేంకటేశ్వరా !

సుర నర తిర్యగాదులు వసుంధరపై నిను జూడ వెంచి యో
గారి ! నిజ సత్త్వ జన్మ సముపార్జిత పుణ్యము లేరి రాశి బో
సో ? వరుసం ఫలాకృతిగ శ్రీపతి ! నిన్ దులఁదూఁచు, నవ్విగ్రహ
రులయి ని వాసముగ కీర్తి వహించెనో ? వేంకటేశ్వరా !

ను గని నేను నా తృషిత నేత్ర సఫెమ్ముల వ్వా న్ని వేశముం
గానరగ ధ్యాన పీఠమున నుంచి నరించి మ దాత్మనే సమ
ర్పణ మొనరించినాఁడ, సెడఁబాయఁగ న్యాయమె ? మూఢ మైత్రి పీ
కసులకు గుండె పీడి చనఁగల్గుదు వెట్టులు ! వేంకటేశ్వరా !

సర్వ పితామహా ద్యమర సంతతకిన్ బ్రియమౌ రసాయన
మ్మూర్వి సుధా రసాభ మయి యుగ్ర జరామయ జన్మ మృత్యు దు
ర్గర్వ మడంచు భేషజము గన్గాయు వెచ్చము లేక తీయనై
సర్వ్రతిఁ గూర్చు సౌషధము నీ శుభ నామమె వేంకటేశ్వరా !

కలువల చిన్నబుచ్చు మొలకగా కను దమ్ములఁ జూడ వేలనో ?
జలజములన్ హసించు ముఖ చంద్రుని వాక్సుధ జిల్కు వేల ? యీ
నెలఁతలఁ వన్ని దాకి పసు నీ పద తీర్థము నీయ వేల ? నా
తలఁపుల నెప్డు నీ చరణ ధారణ నీయవె వేంకటేశ్వరా !

పాప కలాప సంసరణ పంకి ముఖమ్మున బుట్టి వచ్చి, పు
ణ్యాపగలోని కేగి, విమలాంగములన్ దగ పీడి, కాంతి సం
దీపిత శూన్య సంగతి రతిన్ రవి గాంచి హసించు తమ్మినై
పాపము పుణ్యమున్ గడిగి భక్తి వరించె వేంకటేశ్వరా !

" విమల మతి రమత్సరః ప్రశాంత
శ్శుచి చరితో ఽఖిల సత్త్వ మిత్రభూతః
ప్రియ హిత వచనో ఽ స్తమాన మాయో
వసతి సదా హృది తస్య వాసుదేవః "

ఎవఁడు నిర్మలమైన మనస్సు గలిగి, మాత్సర్య రహితుఁడై శాంతుఁడై, పవిత్ర చరిత్ర గలవాఁడై, సత్త్వవర్తన గలిగి, సమస్త భూత మిత్రుఁడై, ప్రియ హిత వాక్కులు గలిగి, అహంకారము మాయయు లేనివాఁడై యుండునో – వానియందు భగవంతుఁడు ఎల్లప్పుడును వసించుచుండును

" వసతి హృది సనాతనే చ తస్మిన్
భవతి పుమాన్ జగతో ఽస్య సౌమ్య రూపః
క్షితి రస మతి రమ్య మాత్మనో ఽతః
కథయతి చారుతయైవ సాల పోతః "

ఎవని హృదయమున సనాతనుఁ డగు భగవంతుఁడు వసించు చుండునో, అతఁడు రమ్య మగు భూతల పుష్టమైన తియ్య మామిఁ గున్న వలె సౌమ్య రూపుఁ డగును.

" యమ నియమ విధూత కల్మషాణా
మను దిన మచ్యుత సక్త మానసానామ్
అప గత మద మాన మత్సరాణాం
వ్రజ భట దూరతరేణ మానసానామ్ "

యమ నియమాది అష్టాంగ యోగములద్వారా కల్మషములను తొలగించుకొనినవాఁడును, నిరంతరము భగవంతునియందు లగింపఁజేయఁబడిన మనస్సు గలవాఁడును, మద మాన మత్సరములను విసర్జించినవాఁడును అగు నతఁడు భాగవతుఁడు.

లి భవదీయ సత్కృపకు లక్ష్యములై రహియించు యాత్మలున్
మెలఁగుచు సంస్మృతిన్ మమత మేకొన, తిర్గి భవాబ్ధి మున్గనే ?
వెలి యయి నట్టి వెన్న పదివేల ప్రయత్నము లాచరించినన్
లియుచు మజ్జిగన్ మునిఁగి కప్పడుచుండగ వేంకటేశ్వరా !

సుర నర తిర్యగాదులు వసుంధరపై నిను జూడ నెంచి యో
గారి ! నిజ సత్త్వ జన్మ సముపార్జిత పుణ్యము లేరి రాశి జో
డా ? వరుసం ఫలాకృతిగ శ్రీపతి ! నిన్ దులఁదూఁచ, సర్వసౌ
ఖ్యులయి నివాసముగ కీర్తి వహించెనో ? వేంకటేశ్వరా !

నిను గని నేను నా తృషిత నేత్ర చకోరముల వ్వా న్నివేశముం
బౌనరగ ధ్యాన పీఠమున నుంచి వరించి మ దాత్మనే సమ
ర్పణ మొనరించినాఁడ, నెడఁబాయఁగ న్యాయమె ? మారు మైత్రి నీ
కనులకు గుండె పీడి చనఁగల్గుదు వెట్టులు ? వేంకటేశ్వరా !

సర్వ పితామహా ద్యమర సంతతకిన్ ప్రియమౌ రసాయన
మ్మూర్వి సుధా రసాభ మయి యుగ్ర జరామయ జన్మ మృత్యు దు
ర్గర్వ మడంచు భేషజము గవ్వయు వెచ్చము లేక తీయనై
సర్వులకుఁ గూర్చు నౌషధము నీ శుభ నామమె వేంకటేశ్వరా !

కలువల చిన్నబుచ్చు మెఱుగౌ కను దమ్ములఁ జూడ వేలనో ?
జలజములన్ హసించు ముఖ చంద్రుని వాక్సుధ జిల్కవేల ? యీ
నెలఁతలఁ వన్ని దాఁకి పసు నీ పద తీర్థము నీయ వేల ? నా
తలఁపుల నెప్డు నీ చరణ ధారణ నీయవె వేంకటేశ్వరా !

పాప కలాప సంసరణ కంటక ముఖమ్మున బుట్టి వచ్చి, పు
ణ్యాపగలోని కేగి, విమలాంబువులన్ దగ పీచి, కాంతి సం
దీపిత శూన్య సంగతి రతిన్ రవి గాంచి హసించు తమ్మివై
పాపము పుణ్యమున్ గడిగి భక్తి ఖరించెం వేంకటేశ్వరా !

భగవత్ స్వరూపులైన అట్టి భాగవతుల మతమే భాగవత మతము. ఇక, ఆ మత మన నేమో - విచారింతము

## మత శబ్దార్థము

మత మనఁగా - జ్ఞానము జ్ఞాన మన, తత్త్వ త్రయ జ్ఞానము, అర్థ పంచక జ్ఞానము అని చెప్ప నొప్పును తత్త్వ త్రయ మనఁగా -

'భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా
జుష్ట స్తత స్తే నామృతత్వ మేతి.'

అను ఉపనిష ద్వాక్యములో ప్రతిపాదితము లగు చిదచి దీశ్వర తత్త్వములు ఆ తత్త్వములను శ్రోత్రియుఁడు, బ్రహ్మనిష్ఠుఁడు నగు ఆచార్యుని మూలమున అవికలముగా తెలియుట అర్థ పంచక మనఁగా - స్వ స్వరూప, పర స్వరూప, ఉపాయ స్వరూప, పురుషార్థ స్వరూప, విరోధి స్వరూపములు

"ప్రాప్యస్య బ్రహ్మణో రూపం
ప్రాప్తుశ్చ ప్రత్యగాత్మనః
ప్రాప్త్యుపాయం ఫల ప్రాప్తే
స్తథా ప్రాప్తి విరోధి చ '

అను సకల వేద ఇతిహాస పురాణాలు చెందిత మగు జ్ఞానమే అర్థ పంచక జ్ఞానము ఇట్టి జ్ఞానమే ముముక్షువునకు పరమావశ్యకము ఇట్టి తత్త్వ త్రయ సిద్ధాంత నిష్ఠుల జ్ఞానమే భాగవత మతము.

"అథవా - భగవతా ప్రోక్తం భాగవతమ్ భాగవతం సమ్మతం చ భాగవత మతమ్ - తస్య వైభవమ్ భాగవత మత వైభవమ్" అనియు నిర్వచింపవచ్చును.

## పాంచరాత్ర మతమే భాగవత మతము

శ్రీ పాంచరాత్ర శాస్త్రము భగవ న్ముఖోదితము, శాండిల్యాది మహర్షి - ప్రజాపత్యాది దేవ ప్రవర్తితము పర వ్యూహ విభ వాంతర్యా మ్యర్చా రూప మగు భగవ త్స్వరూప పంచక వివరణమునకు ప్రవృత్తమై, త దారాధనా రూప మగు క్రియలను విధించునదియై, పరమ విలక్షణముగ మహా భారతేతిహాసమున ప్రశంసింపబడినది ఇట్టి మత నిష్ఠులే ముముక్షువులకు మార్గ దర్శకులు వారి వైభవములు అతి విలక్షణములు ఈ మతమే మన ప్రాచీనులగు శఠకోపాది సూరి వరేణ్యులచే దివ్య ప్రబంధములలో ప్రపంచితమైనది నాథ, యామున, రామానుజ, వరవరాది ఆచార్య వర్యులచే అనుష్ఠిత మగు ఈ మతమే లోకమునకు తారక మైనది యామునాచార్యుల 'ఆగమ ప్రామాణ్యము', భగవ ద్రామానుజుల శ్రీభాష్యము నందలి 'ఉత్పత్త్య సంభవాధికరణము', వేదాంత దేశికుల 'పాంచ రాత్ర రక్ష' మున్నగు గ్రంథములు - శ్రీ పాంచరాత్ర శాస్త్రమునందు ప్రతిపాదింపబడిన ఈ భాగవత మతమునే వే నోళ్ళ గొనియాడుచున్నవి.

" ఇదం శత సహస్రాద్ధి భారతాఖ్యాన విస్తరాత్
ఆవిధ్య మతి మంథానం దధ్నో ఘృత మి వోద్ధృతమ్
నవనీతం యథా దధ్నః ద్విపదాం బ్రాహ్మణో వరః
ఆరణ్యకం చ వేదేభ్యః ఓషధీభ్యో యథా ఽమృతమ్
ఇదం మహోపనిషదం పంచ వేద సమన్వితమ్
సాంఖ్య యోగ కృతాంతేన పంచరాత్రానుశబ్దితమ్
వేదాంతేషు యథా సారం సంగృహ్య భగవాన్ హరిః
భక్తానుకంపయా విద్వాన్ సంచిక్షేప యథా సుఖమ్."

సకల వేదాంత వేద్యుం డగు భగవాన్ వాసుదేవుండు, పర బ్రహ్మ శబ్ద వాచ్యుండు, నిఖిల హేయ ప్రత్యనీక కల్యాణైకతా

నంత జ్ఞానానందా ద్యపరిమిత గుణోదార సముద్రుఁడు, సత్య సంక ల్పుఁడు అగు స్వామి - వర్ణాశ్రమ ధర్మ వ్యవస్థలను చెంది యుండు నట్టియు, చతుర్విధ పురుషార్థ నిష్ఠులై యుండునట్టియు భక్తులను చూచి, అపరిమిత మగు దయ గలవాఁడై, భగవత్స్వరూప రూప గుణ విభూతి భగవ దారాధన భగవత్ప్రాప్తి ఫల యాథార్థ్యావ బోధు లగు ఋ గ్యజు స్సామాది విధ్యర్థ వాద మంత్ర రూపము లగు వేదములను బోధించియు, వాని యర్థ నిర్ణయమును తాను తప్ప, ఇతరు లెవ్వరును చేయఁజాల రని నిశ్చయించి, వేదములలో ప్రతిపాదింపఁబడిన యర్థమును సుబోధక మొనరించుటకై, శ్రీ పాంచ రాత్ర శాస్త్రమును లోకమునకు ప్రసాదించెను కనుకనే, ఈ శాస్త్ర మునకు - 'భగవ చ్ఛాస్త్రము' అను పేరు ప్రసిద్ధ మైనది.

## భాగవత మత వైశిష్ట్యము

'భగవతి భక్తాః భాగవతాః' అను వ్యుత్పత్తిచే సిద్ధమైన 'భాగవత' పదములో - 'భక్తాః' అనునది - 'భక్తి రేషా మస్తీతి భక్తాః' అను వ్యుత్పత్తిచే సిద్ధమైనది భక్తి యనఁగా - పూజ్యే ష్వనురాగో భక్తిః' అను సూత్రమునుఁ బట్టి, తన కంటెను విశిష్టు లగు మహనీయులపై గల భావ విశేషము కావున, ఇచట - నిరస్త నిఖిల దోషుఁడును, అనంత కల్యాణ గుణ గణ పరిపూర్ణుఁడును అగు పరబ్రహ్మ విషయకముగా నేర్పడు భావ విశేష మని చెప్ప నగును. ఇట్టి భావ విశేషము - భక్తి శాస్త్రములలో కొన్ని తావుల యందు ఎనిమిది విధములుగను, మఱికొన్ని తావుల యందు తొమ్మిది విధము లుగను చెప్పఁబడినది.

"మ ద్భక్త జన వాత్సల్యం పూజాయాం చానుమోదనమ్
మ త్కథా శ్రవణే సక్తిః మ దర్థే దంభ వర్జనమ్

స్వయ మభ్యర్చనం చైవ స్వర నేత్రాంగ విక్రియా
మమాను స్మరణం నిత్యం యచ్చ మాం నోపజీవతి
భక్తి రష్ట విధా హ్యేషా యస్మిన్ మ్లేచ్ఛేఽపి వర్తతే
స విప్రేంద్రో ముని శ్రేష్ఠః స యతి స్స చ పండిత
తస్మై దేయం తతో గ్రాహ్యం స చ పూజ్యో యథా హ్యహమ్."

అను ప్రమాణముచే, అష్ట విధ భక్తులు సూచితములు

"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాద సేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మ నివేదనమ్."

అను ప్రమాణముచే, నవ విధ భక్తులు సూచితములు. ఇట్టి భక్తి నిష్ఠులే భాగవతులు భాగవతుల వైభవము పురాణములలో బహు భంగులుగా వర్ణింపఁబడి యున్నది ఒక్కొక్క భక్తి మార్గమున ఒక్కొక్కరు పయనించి తరించినట్లు, ప్రాచీన చరిత్రలు మనకు బోధించుచున్నవి.

## భాగవతులు - భక్తి మార్గములు

"శ్రీకృష్ణ శ్రవణే పరీక్షి దభవ ద్వైయాసకిః కీర్తనే
ప్రహ్లాద స్స్మరణే త దంఘ్రి భజనే లక్ష్మీః పృథుః పూజనే
అక్రూర స్త్వభినందనే కపి పతి ర్దాస్యే చ సఖ్యే ఉర్జునః
దేవ స్యాత్మ నివేదనే బలి రభూ త్సర్వస్య సంపూజనే."

| | |
|---|---|
| శ్రవణముచే | పరీక్షి న్మహారాజు |
| కీర్తనముచే | శుక మహర్షి |
| స్మరణముచే | ప్రహ్లాదుఁడు |
| పాద సేవనముచే | లక్ష్మీ దేవి |
| అర్చనముచే | పృథు చక్రవర్తి |

| | |
|---|---|
| వందనముచే | అక్రూరుఁడు |
| దాస్యముచే | హనుమంతుఁడు |
| సఖ్యముచే | అర్జునుఁడు |
| ఆత్మ నివేదనముచే | బలి చక్రవర్తి |

కరించినట్లు, ఇందుమూలమున స్పష్ట మగుచున్నది.

## భా గ వ తు ల వై శి ష్ట్య ము

'న శూద్రా భగవద్భక్తాః విప్రాభాగవతాః స్మృతాః
సర్వవర్ణేషు తే శూద్రా యేహ్యభక్తా జనార్దనే "

శూద్రులైనను - భగవద్భక్తులు శూద్రులు కారు వారే
- భాగవతులుగా చెప్పఁబడుచున్నారు జనార్దనునియందు
నివారలు ఏ వర్ణమునకుఁ జెందిన వారైనను, శూద్రులుగనే
పఁబడుదురు

'మద్భక్తం శ్వపచం వా౽పి నిందాం కుర్వన్తి యే నరాః
పద్మకోటి శతే నాపి న క్షమామి వసుంధరే "

ఎట్టి నికృష్ట జన్ముఁడైనను, భగవద్భక్తుఁడు గౌరవింపఁ దగిన
అట్టివానిని నిందించినచో నేను సహింపఁజాలను' అని,
స్వామి వక్కాణించి యుండుటను బట్టి, భగవద్భక్తు లగు
కుల వైశిష్ట్యము సుస్పష్టము.

'విష్ణు ప్రాప్తి యనెడి ఫలమును గోరు వైష్ణవుఁడు, భక్తియే
పాయముగ గలవాఁడుగాని భక్తిని సాధనముగా స్వీకరించడు
శ్రీహరికి తాను దాసుఁ డను బుద్ధి చూపుచు, స్వామి సేవ
ను, భగవత్పాద పద్మ ప్రవణుఁ డగుచు కాలమును, భగవ

"బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే
వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః'

అని భగవద్గీత నక్కాణించునట్లు, భాగవతులకు ధారక పోషక భోగ్యము లన్నియు వాసుదేవుఁడే

"ఉణ్ణుం శోర్ పరుకునీర్ తిన్నుమ్ వెత్తిలైయుం ఎల్లాం కణ్ణన్"

అను దివ్య ప్రబంధ వ్యాఖ్యానుసారము - ప్రహ్లాద, లక్ష్మణ భరతాదులతో సామ్యము గల ప్రపన్న జన కూటస్థుల వంటి సాధు పుంగవులు భాగవతులు

'ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుక శౌనక భీష్మ దాల్భ్యాన్
రుక్మాంగదార్జున వశిష్ట విభీషణాదీన్
పుణ్యా నిమాన్ పరమ భాగవతాన్ స్మరామి

అను అభియుక్తోక్తి యందలి భాగవతు లగు పరాశర - పారాశర్యాది మహర్షులు - పురాణ సూత్రాది ముఖమున వేనోళ్ళ చాటిన -

"సత్యం సత్యం పున స్సత్య ముద్ధృత్య భుజ ముచ్యతే
వేద శాస్త్రాత్పరం నాస్తి న దైవం కేశవాత్పరమ్."

అను శ్రుతి స్మృతి ఇతిహాస పురాణాదులు ప్రతిపాదించు మతము భాగవత మతము

"వ్యాళాలయద్రుమా హ్యేతే హ్యతిరిక్తాఽఖిల సంపదః
యే గృహా స్తీర్థ పాదీయ పాద తీర్థ వివర్జితాః
సర్వేషా మేవ పాపానాం ప్రాయశ్చిత్తం మనీషిభిః
నిర్ణీతం భగవద్భక్త పాదోదక నిషేవణమ్

త త్తీర్థం శిరసా ధార్యం త దంఘ్రి స్పృష్టరాదిభిః
పేయ మంత ర్యధా సోఽపి తత్ర నావమన క్రియాః ”

అను వచనానుసారము సకల పాప ప్రాయశ్చిత్త భూత పాద తీర్థ ప్రభావము గలవారు భాగవతులు భగవ దతిరిక్త వస్తు వైతృష్ణ్యము, భగవ త్ప్రాప్తి కలిగి, కర్మణా - మనసా వాచా సకల జగ చ్ఛ్రేయః కాములై, సకల సద్గుణ సంపన్నులై, తమ్ము చూచు వారియొక్కయు - తమతో భాషించువారియొక్కయు - తమ నను సరించువారియొక్కయు ఏ రీతిగ నైన తమతో సంబంధము గల వారి నెల్ల తరింపఁజేయఁగల్గిన మహిమాన్వితులు భాగవతులు.

“ఆస్ఫోటయంతి పితరః ప్రనృత్యంతి పితామహాః
వైష్ణవో నః కులే జాత స్సదన స్తారయిష్యతి ”
“పశు ర్మనుష్యః పక్షీ వా యే చ వైష్ణవ సంశ్రయాః
తే నైవ తే ప్రయాస్యన్తి త ద్విష్ణోః పరమం పదమ్
“య త్రాష్టాక్షర సంసిద్ధో మహా భాగో మహీయతే
న తత్ర సంచరిష్యంతి వ్యాధి దుర్భిక్ష తస్కరాః ”

ఇత్యాది వచనములచే, భాగవతుల మహిమ ప్రతిపాదింపఁబడినది ఇట్టి వారికి ఈ మహిమ కలుగుటకు కారణము - వీరి సిద్ధాంత ప్రాశస్త్యమే నారద, శాండిల్య, పులస్త్య, శౌనక, పరాశర, పారాశర్య, శుక, వసిష్ఠాది మహర్షులు - భరద్వాజాదులు బహు భంగులుగ శ్రీమ న్నారాయణ పరత్వమును నిరూపించుచు, చేతనులు భగవ చ్ఛేషభూతు లనియు, శ్రీమన్నారాయణుఁడు శేషి యనియు, అతఁ డనన్య లభ్యుఁ డనియు, స్వస్యాపి సదస్య ప్రదాత యనియు బోధించిన పరమ విలక్షణము - శ్రుతి ప్రతిపాద్యము - సకల స్మృతీతిహాస పురాణా ద్యుపబృంహితము నగు అర్థము నాశ్రయించుటచే, భగవ త్స్వరూప గుణ విభవైశ్వర్య జ్ఞానులు - పరమ కారుణికులు నగు పరాంకుశ, పరకాల, భట్టనాథాది మన్నిద్దరాళ్వారులు. తమ

దివ్య ప్రబంధములందు పలు తావులలో ఈ యర్థమును ప్రతిపాదించుటచే, వారి యందలి ప్రావణ్య మూలకముగ, పూర్వాచార్యులగు నాథ, యామున, రామానుజ, వరవరాదులు తమ యాచరణ ముఖమునను — గ్రంథముఖమునను ఈ యంశములను మనకు బోధించుటచేతను, ఇట్టి పరమ విలక్షణుల శ్రీ సూక్తులే తమ్ము తరింపఁజేయఁగల సాధనములని సంభావించి, ఆచార్య పరంపరాగత మగు అర్థముల నెల్ల వేళల ననుసంధించు పరమ ప్రామాణికులు - సాత్త్వికులు నగు వారి యనుష్ఠాన విశేషమే భాగవత మతము ఇట్టి భాగవత మత వైభవము వర్ణనాతీతమై, సహృదయు లందఱిచేతను పలు విధములుగా ప్రశంసింపఁబడుచున్నది



# మోక్ష సాధనములు - ప్రపత్తి దర్శనము

శిరోమణి - విద్వాన్
ఆంధ్ర విద్యానాథ - బ్రాహ్మీ భూషణ
శ్రీమాన్ చెలమచెర్ల రంగాచార్యులు

★

## పురుషార్థ చతుష్టయము

మానవు లభిలషించునవి పురుషార్థములు అవి ధర్మార్థకామ మోక్షములు నాలుగు వీనిలో మోక్షము పరమ పురుషార్థము ప్పుడు జన్మ మృత్యువులు, జరా వ్యాధులు మొదలైన బహు క్లేశములతో నిండి యున్న యీ సంసార చక్రమునుండి తప్పించుకొని రమ పదమున సర్వేశ్వరుని సాయుజ్యమును పొంది, తద్దివ్య ంగళ విగ్రహమును సేవించుచు, ఆనందించుటయే మోక్షము దియే బ్రహ్మ ప్రాప్తి. దీనివలన కలుగు ఆనందమే బ్రహ్మానందము. ాణు లనుభవించు లౌకికానందము లన్నియు సాతిశయములు అవి శ్వరములు. ఇది శాశ్వతము. ఈ బ్రహ్మానంద ప్రమాణ మెట్టిదో రూపించుచు వేదము - నడి వయస్సు, మంచి ఆరోగ్యము, గొప్ప శ్వర్యము, సత్సంతానము, అడ్డు లేని అధికారము మున్నైనవి లిగిన చక్రవర్తికి కలుగు ఆనందమును ఒక మానుషానందమునకు ల బద్దగా పెట్టుకొనినచో - అట్టి నూరు మానుషానందములు ఒక మనుష్య గంధర్వానంద మగు ననుచు, క్రమముగా దేవ గంధర్వా నందము, పితృదేవతానందము, ఆజాన దేవతానందము, కర్మదే తానందము, దేవతానందము, ఇంద్రదేవతానందము, బృహస్ప

త్యానందము, ప్రజాపత్యానందము, హిరణ్యగర్భానందములను పేర్కొని, ఇవి పూర్వముకంటె ఉత్తరోత్తరము నూరేసి రెట్లు అధిక ప్రమాణము కల వగు నని చెప్పి, అట్టి హిరణ్యగర్భానందముకూడ అఖండ బ్రహ్మానందములో అల్పాల్పమైన యొక యంశము మాత్రమే యగు నని తెల్పెను ఇట్టి సర్వోత్కృష్టమైన బ్రహ్మానందమును బడయుటకు, జ్ఞానులగు జీవులు తహ తహ పడుట యుక్తమే కదా !

మోక్ష పురుషార్థమును సాధించుటకు కర్మ యోగము, జ్ఞాన యోగము, భక్తి యోగము అనునవి సాధనములుగా సాధారణ పద్ధతిలో నిర్దిష్టము లగుచున్నవి వీని సంగ్రహాపాది వివేచన మిది

## కర్మ యోగము

సత్కర్మానుష్ఠానము ప్రతి వ్యక్తికిని ఆవశ్యకముగా కర్తవ్యమైనది. విధి విహితములైన కర్మలను శ్రద్ధతో అనుష్ఠింపవలసినదిగా శాస్త్ర మాజ్ఞాపించుచున్నది

"నియతం కురు కర్మ త్వం కర్మజ్యాయో హ్యకర్మణః "
— (భగవద్గీత 3 — 8

"తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి "
— (భగవద్గీత 16 — 24

ఈ ద్వివిధ ఉపదేశానుష్ఠానములచేతను, శ్రుతి స్మృతి మీమాంసాది రూపమైన శాస్త్రముచేతను కర్తవ్య మేదియో అకర్తవ్య మేదియో తెలిసికొని, కర్తవ్యములైన నిత్య నైమిత్తిక కర్మములను మానవుడు కామ క్రోధాదులను దరి చేరకుండగన నిష్ఠతోను ఆచరింపవలయును. అట్టి కర్మ యోగి - మోక్షమును పొందును.

# మోక్ష సాధనములు - ప్రపత్తి దర్శనము

శిరోమణి - విద్వాన్
ఆంధ్ర విద్యానాథ - బ్రాహ్మీ భూషణ
శ్రీమాన్ చెలమచెర్ల రంగాచార్యులు

★

## పురుషార్థ చతుష్టయము

మానవు లభిలషించునవి పురుషార్థములు అవి ధర్మార్థ కామ
మోక్షములు నాలుగు వీనిలో మోక్షము పరమ పురుషార్థము
పుడు జన్మ మృత్యువులు, జరా వ్యాధులు మొదలైన బహు
క్లేశములతో నిండి యున్న యీ సంసార చక్రమునుండి తప్పించుకొని
రమ పదమున సర్వేశ్వరుని సాయుజ్యమును పొంది, తద్దివ్య
ఁంగళ విగ్రహమును సేవించుచు, ఆనందించుటయే మోక్షము
దియే బ్రహ్మ ప్రాప్తి. దీనివలన కలుగు ఆనందమే బ్రహ్మానందము.
ణు లనుభవించు లౌకికానందము లన్నియు సాతిశయములు అవి
శ్వరములు. ఇది శాశ్వతము. ఈ బ్రహ్మానంద ప్రమాణ మెట్టిదో
రూపించుచు వేదము - నడి వయస్సు, మంచి ఆరోగ్యము, గొప్ప
ఐశ్వర్యము, సత్సంతానము, అడ్డు లేని అధికారము మున్నైనవి
లిగిన చక్రవర్తికి కలుగు ఆనందమును ఒక మానుషానందమునకు
ల గజ్జగా పెట్టుకొనినచో - అట్టి నూరు మానుషానందములు ఒక
మనుష్య గంధర్వానంద మగు ననుచు, క్రమముగా దేవ గంధర్వా
నందము, పితృదేవతానందము, ఆజాన దేవతానందము, కర్మదే
తానందము, దేవతానందము, ఇంద్రదేవతానందము, బృహస్

"యజ్ఞార్థా త్కర్మణో ఽన్యత్ర లోకో ఽయం కర్మ బంధనః
త దర్థం కర్మ కౌంతేయ ! ముక్త సంగ స్సమాచర"
—(భగవద్గీత 3 - 9

భగవ దర్పణ బుద్ధితో నిష్కామముగా ఆచరించు సత్కర్మ మెల్లయు యజ్ఞ మనఁబడును అట్టి యజ్ఞ రూపములైన కర్మలు బంధ హేతువులు కావు - ' అని సమాధానము ఫల తృష్ణతో కర్మల నాచరించు వానిని గీత - ' కృపణాః ఫల హేతవః' అని దీనులనుగా చిత్రించి గర్హించినది ఫలాపేక్ష విడిచి, సత్కర్మానుష్ఠానము చేయు వారిని ప్రశంసించి, వారు మోక్ష ఫలమును పొందుదు రనియు వెల్లడించినది

"కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః
జన్మబంధ వినిర్ముక్తాః పదం గచ్ఛం త్యనామయమ్"
—(భగవద్గీత : 2 - 51.

## జ్ఞాన యోగము

"న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే
తత్ స్వయం యోగ సంసిద్ధః కాలే నాత్మని విందతి"
—(భగవద్గీత . 4 - 38

జ్ఞానముతో సాటి వచ్చు పావనమైన సాధనము వేఱే లేదు నిష్కాంకర్మయోగి కాల క్రమమున ఆ జ్ఞానమును తాను బడయును అని జ్ఞానయోగ ముగ్గడింపఁ బడినది

దేనివలన వస్తు తత్త్వము తెలియునో - అది జ్ఞానము 'జీవుడు ప్రకృతి, పరమాత్మ' - అను తత్త్వముల స్వరూప స్వభావ జ్ఞానము లెస్సగాఁ గల జ్ఞానికి స్వ కర్తవ్యము సుబోధ మగును జీవుని పరమ కర్తవ్యము పరమాత్మానుగ్రహ సంపాదనము ఆ జ్ఞానము లేనివారికి దేహమందు ఆత్మ బుద్ధి, అల్పజ్ఞుఁ డగు తనయం

# మోక్ష సాధనములు - ప్రపత్తి దర్శనము

శిరోమణి - విద్వాన్

ఆంధ్ర విద్యానాథ - బ్రాహ్మీ భూషణ

శ్రీమాన్ చెలమచెర్ల రంగాచార్యులు

★

## పురుషార్థ చతుష్టయము

మానవు లభిలషించునవి పురుషార్థములు అవి ధర్మార్థ కామ
మోక్షములు నాలుగు వీనిలో మోక్షము పరమ పురుషార్థము
నుడు జన్మ మృత్యువులు, జరా వ్యాధులు మొదలైన బహు
క్లేశములతో నిండి యున్న యీ సంసార చక్రమునుండి తప్పించుకొని
రమ పదమున సర్వేశ్వరుని సాయుజ్యమును పొంది, తద్దివ్య
ంగళ విగ్రహమును సేవించుచు, ఆనందించుటయే మోక్షము
దియే బ్రహ్మ ప్రాప్తి. దీనివలన కలుగు ఆనందమే బ్రహ్మానందము.
ాణు లనుభవించు లౌకికానందము లన్నియు సాతిశయములు అవి
శ్వరములు. ఇది శాశ్వతము. ఈ బ్రహ్మానంద ప్రమాణ మెట్టిదో
రూపించుచు వేదము - నడి వయస్సు, మంచి ఆరోగ్యము, గొప్ప
ైశ్వర్యము, సత్సంతానము, అడ్డు లేని అధికారము మున్నైనవి
లిగిన చక్రవర్తికి కలుగు ఆనందమును ఒక మానుషానందమునకు
ొల గజ్జగా పెట్టుకొనినచో - అట్టి నూరు మానుషానందములు ఒక
మనుష్య గంధర్వానంద మగు ననుచు, క్రమముగా దేవ గంధర్వా
నందము, పితృదేవతానందము, ఆజాన దేవతానందము, కర్మదే
తానందము, దేవతానందము, ఇంద్రదేవతానందము, బృహస్ప

ఈ జ్ఞానమనునది కేవలము ఆ యా తత్త్వ స్వరూప నిరూపణ పరములగు వేద వేదాంత దర్శన పురాణాదులందు ప్రోక్తములైన ఆధ్యాత్మిక వాక్యముల తాత్పర్యావబోధ పర్యవసన్నమైనంత మాత్రముననే చాలదు. ఆ వాక్య జ్ఞానము ముముక్షువైన యా సాధకునకు ప్రబోధకమై, భగవదుపాసనా రూపముగ పరిణమించు మహోనిష్ఠ కావలెను. ఈ విషయమును తత్త్వవిదులు పలువురు వక్కాణించిరి. భగవద్రామానుజ పూజ్యపాదులు వివరించిన యీ క్రింది వాక్యములు ఈ ప్రకరణమున గమనింపదగి యున్నవి.

"అతో వాక్యార్థ జ్ఞానా దన్య దేవ ధ్యానోపాసనాది శబ్దవాచ్యం జ్ఞానం వేదాంత వాక్యై ర్విధిత్సితమ్ ''

'తస్మా దనాది కర్మ ప్రవాహ రూపాజ్ఞానమూలస్య బన్ధస్య తన్నిబర్హణ ముక్తి లక్షణ జ్ఞానా దేవ.''

—(శ్రీ భాష్యము)

ధ్యానము, ఉపాసన మొదలైన పదములచే చెప్పబడినట్టిదే ఉపనిషత్తులలో ప్రతిపాదింపబడిన జ్ఞానము. వట్టి వాక్యార్థ జ్ఞానము కాదు. అట్టి జ్ఞానమువలననే అజ్ఞానము నశించి, సంసార బంధము విచ్ఛిన్నమగును.' అని తాత్పర్యము 'ఉక్తి లక్షణ జ్ఞానా దేవ' అను శ్రీభాష్య పంక్తిని శ్రుతప్రకాశికాకారులు. 'ఉపాసనాత్మకా దేవ – ఉపాసనా రూపమైన జ్ఞానముచేతనే' అని వివరించిరి.

ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని – అనువారు తన్ను భజింతురనియు, అట్టివారిలో జ్ఞాని సర్వశ్రేష్ఠుడనియు భగవద్గీత యిట్లు ప్రశంసించినది.

"చతుర్విధా భజంతే మాం జనా స్సుకృతినో ఽర్జున !
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ !"

—(భగవద్గీత : 7 – 16)

# మోక్ష సాధనములు - ప్రపత్తి దర్శనము

శిరోమణి - విద్వాన్

ఆంధ్ర విద్యానాథ - బ్రాహ్మీ భూషణ

శ్రీమాన్ చెలమచెర్ల రంగాచార్యులు

★

## పురుషార్థ చతుష్టయము

మానవు లభిలషించునవి పురుషార్థములు అవి ధర్మార్థకామ మోక్షములు నాలుగు వీనిలో మోక్షము పరమ పురుషార్థము జీవుఁడు జన్మ మృత్యువులు, జరా వ్యాధులు మొదలైన బహు క్లేశములతో నిండి యున్న యీ సంసార చక్రమునుండి తప్పించుకొని పరమ పదమున సర్వేశ్వరుని సాయుజ్యమును పొంది, తద్దివ్య మంగళ విగ్రహమును సేవించుచు, ఆనందించుటయే మోక్షము అదియే బ్రహ్మప్రాప్తి. దీనివలన కలుగు ఆనందమే బ్రహ్మానందము. ప్రాణు లనుభవించు లౌకికానందము లన్నియు సాతిశయములు అవి నశ్వరములు. ఇది శాశ్వతము. ఈ బ్రహ్మానంద ప్రమాణ మెట్టిదో నిరూపించుచు వేదము - నడి వయస్సు, మంచి ఆరోగ్యము, గొప్ప ఐశ్వర్యము, సత్సంతానము, అడ్డులేని అధికారము మున్నైనవి కలిగిన చక్రవర్తికి కలుగు ఆనందమును ఒక మానుషానందమునకు కొలగఱ్ఱగా పెట్టుకొనినచో - అట్టి నూరు మానుషానందములు ఒక మనుష్య గంధర్వానంద మగు ననుచు, క్రమముగా దేవ గంధర్వానందము, పితృదేవతానందము, అజాన దేవతానందము, కర్మదేవతానందము, దేవతానందము, ఇంద్రదేవతానందము, బృహస్ప

నాశ్రయించినవాడే ఆధ్యాత్మిక విద్యా రహస్యము
సమర్థుడగును.

"తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః"

— (భగవద్గీత 4 34)

వాక్యానుసారముగా, గురు శుశ్రూషాదుల మూలముననే ఆత్మ
పొందవలెనని యుపదేశించుచున్నది

ప్రస్తావనలో గుర్తింపవలసిన యొక విశేషమిది -

"లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ"

జ్ఞాన నిష్ఠలు రెండును వేరు వేరుగా చెప్పబడినట్లు
టికి కనపించినను, యదార్థముగను ఈ రెండు యోగ
ఫలితాంశమున ఒక్కటే వీనిలో ఏ యొక్క యోగము
చినను, వేత్త అయిన పని విద్వాంసులనరు అపరిణత
వారే యివి భిన్నములని తలంతురు. గీతలోనే యీ
ట్లు స్పష్టము చేయబడినది -

సాంఖ్య యోగౌ పృథగ్బాలాః ప్రవదంతి న పండితాః
ఏక మప్యాస్థిత స్సమ్య గుభయో ర్విన్దతే ఫలమ్

— (భగవద్గీత 5-4)

యుగా ఆచరించుచూ కర్మయోగము - జ్ఞాన యోగములోనే
ననని తాత్పర్యము

## భక్తి యోగము

నార్థకమైన భజ ధాతువువలన నిష్పన్నమైన భక్తి పదము
కరమైన భగవత్సేవ యని వివక్షితార్థము. ప్రకరణాను

# మోక్ష సాధనములు - ప్రపత్తి దర్శనము

శిరోమణి - విద్వాన్

ఆంధ్ర విద్యానాథ - బ్రాహ్మీ భూషణ

శ్రీమాన్ చెలమచెర్ల రంగాచార్యులు

★

## పురుషార్థ చతుష్టయము

మానవు లభిలషించునవి పురుషార్థములు అవి ధర్మార్థ కామ
మోక్షములు నాలుగు వీనిలో మోక్షము పరమ పురుషార్థము
ప్పుడు జన్మ మృత్యువులు, జరా వ్యాధులు మొదలైన బహు
క్లేశములతో నిండి యున్న యీ సంసార చక్రమునుండి తప్పించుకొని
రమ పదమున సర్వేశ్వరుని సాయుజ్యమును పొంది, తద్దివ్య
ంగళ విగ్రహమును సేవించుచు, ఆనందించుటయే మోక్షము
దియే బ్రహ్మ ప్రాప్తి. దీనివలన కలుగు ఆనందమే బ్రహ్మానందము.
ాణు లనుభవించు లౌకికానందము లన్నియు సాతిశయములు అవి
శ్వరములు. ఇది శాశ్వతము. ఈ బ్రహ్మానంద ప్రమాణ మెట్టిదో
రూపించుచు వేదము - నడి వయస్సు, మంచి ఆరోగ్యము, గొప్ప
ైశ్వర్యము, సత్సంతానము, అడ్డు లేని అధికారము మున్నగునవి
లిగిన చక్రవర్తికి కలుగు ఆనందమును ఒక మానుషానందమునకు
ొల గజ్జగా పెట్టుకొనినచో - అట్టి నూరు మానుషానందములు ఒక
నుష్య గంధర్వానంద మగు ననుచు, క్రమముగా దేవ గంధర్వా
ందము, పితృదేవతానందము, అజాన దేవతానందము, కర్మదేవ
తానందము, దేవతానందము, ఇంద్రదేవతానందము, బృహస్ప

నిశ్చలముగ నేను నీవాఁడనే యని గుర్తించితిని ఓ దేవ దేవా! దయతో స్వయం ప్రసన్న భోగ్య మగు భక్తి నీయెడ కలుగజేయుమా' అనియు, ఆచార్య శేఖరు లగు భగవ ద్రామానుజులు -

' అఖిల భువన జన్మ స్థేమ భంగాది లీలే
వినత వివిధ భూత వ్రాత రక్షైక దీక్షే
శ్రుతి శిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే
భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తి రూపా "

— (శ్రీ భాష్యారంభ మంగళాచరణము)

జగముల కెల్ల సృష్టి స్థితి లయ కారుఁడును - ప్రపన్నుల కేడుగడయు - ప్రాబల్యాల తలపూవై వెలయువాఁడును - పరబ్రహ్మయు అగు శ్రీనివాసునియందు నాకు భక్తి కుదురుగాక! అనియు విన్నవించుకున్నారు

ఆ భక్తి తొమ్మిది విధములై యుండు ననియు, ఈ నవ విధ భక్తితోను పురుషోత్తము నారాధించి సాధకుఁడు ముక్తి నొందవలె ననియు, ఇదియే సమస్త విజ్ఞాన సార మనియు తత్త్వ విదులు వక్కాణింతురు. భక్తాగ్రేసరుఁ డగు ప్రహ్లాదుఁడు - 'గురువుల వలన ని వేమి నేర్చితి?' వని యడిగిన తండ్రి కిట్లు చెప్పెను

"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాద సేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మ నివేదనమ్
ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తి శ్చే న్నవ లక్షణా
క్రియతే భగవ త్యద్ధా తన్మన్యే ఽధీత ముత్తమమ్ '

— (భాగవతము 7 - 5 - 23, 24)

శ్రవణాదు లగు తొమ్మిది ప్రకారములతో శ్రీహరిని సేవించుట సమస్త విద్యల సారము ఇదియే నేను నేర్చినది.

## ప్రపత్తి యోగము

మోక్ష ప్రాప్తికి ప్రపత్తికి మించిన సాధనము లే దని పరమ సిద్ధాంతము సాధకుడు సర్వాత్మనా తనను సర్వేశ్వరునకు పుకొనుటయే ప్రపత్తి యోగము ఇదియే ఆత్మ నివేదన భక్తి ప్రకారము దీనికి శరణాగతి యని ప్రసిద్ధ నామము.
, సన్న్యాసము, భర న్యాసము, సాధ్య భక్తి, త్యాగము నవి దీనికే పర్యాయ పదములు భాగవత ధర్మమైన యీ పర్శనము వేదము, ఉపనిషత్తులు, పురాణములు, భగవద్గీత స్తోత్ర మనబడు పాంచరాత్రాగమము మున్నైన ప్రామా ణము లన్నింటిలోను ప్రతిపాదితమైనది బ్రహ్మ, నారద కపిలాచార్యులు వంటి పలువురిచే అనుష్ఠింపబడినది చే, ఆచార్యులచే ఆదరముతో ఆచరింపబడినది

, :

ప్రపత్తి ధర్మము వేద ప్రతిపాదితము -

'తం పత్నీభి రనుగచ్ఛేమ దేవాః
పుత్రై ర్భ్రాతృభి రుతవా హిరణ్యైః
నాకం గృహ్ణానాః సుకృతస్య లోకే
తృతీయే పృష్ఠే అధిరోచనే చ ''

— (యజుర్వేదము 16 - 60)

రాజసు లగు మహా భక్తులకే ప్రవేశింప నలవి యైనదియు - లోకముల కెల్లపైన దివ్య కాంతులతో విలసిల్లుచు - త్రిపా యనబరగుచుండు నీ సన్నిధిని, పరమ పదమును పొందు స్వామీ! మా స్త్రీలతోను, మా సంతానముతోను, సర్వ సంపదలతోను నిన్నే శరణు వేడుచున్నాము' అను ప్పు ఈ వేద వాక్యములో - ముముక్షు వగు మానవుడు

తన సర్వస్వమును భగవదర్పణము గావించి, శరణాగతి చేయవలె నను ఉపాయ ముపదిష్టమైనది

**తైత్తిరీయారణ్యకము**

బ్రహ్మ విద్య, పురుష విద్య అను పేళ్ళతో ప్రసిద్ధి కెక్కిన ఆత్మార్పణ రూపమైన ఈ న్యాస విద్య - తైత్తిరీయారణ్యకములో మిక్కిలి స్పష్టముగా నిరూపింపబడినది -

ప్రజాపతి పుత్రుడైన ఆరుణి యను తత్త్వ జిజ్ఞాసువు - 'ఆత్మోద్ధరణమునకు సాధనము లెవ్వి ?' యని తన తండ్రిని ప్రశ్నించెను అంగులకు అతని తండ్రి ప్రజాపతి - సత్యము, తపము, దమము, శమము, దానము, ధర్మము, ప్రజోత్పత్తి అగ్నిపూజ, అగ్నిహోత్రము, యజ్ఞము, మానసోపాసనము, న్యాసము అనునవి ఆత్మోద్ధరణమునకు సాధనములు అని చెప్పెను ఆ మాట విని ఆరుణి - 'పంన్రెండు సాధనములలోను శ్రేష్ఠమైన దేది ? అని తిరిగి యడిగెను అంత ప్రజాపతి -

" తాని వా ఏతా న్యవరాణి పరాంసి న్యాస ఏ వాదరేత్. '

—(తైత్తిరీయోపనిషత్తు 10.78

'నాయనా ! ఈ చెప్పిన సత్యము మొదలు మానసోపానము వఱకు గల పదునొకండు సాధనములును సహకార సాధనములే. న్యాసమనెడు భగవచ్ఛరణాగతియే ముక్తికి ముఖ్యోపాయముగా గుర్తింపుము' అని తత్త్వార్థమును బోధించెను

తైత్తిరీయముననే మఱియొకచో ఈ న్యాస విద్య యిట్లు చెప్పబడినది .-

" ఓం వసురణ్యో విభూ రసి ప్రాణే త్వమసి సంధాతా బ్రహ్మన్ త్వమసి విశ్వ ధృక్ తేజోదా స్త్వ మసి వర్చోదా స్త్వ మసి చంద్రమన ఉపయామ గృహీతోఽసి బ్రహ్మణే త్వా మహసే "

## ప్రపత్తి యోగము

మోక్ష ప్రాప్తికి ప్రపత్తికి మించిన సాధనము లేదని పరమ సిద్ధాంతము సాధకుడు సర్వాత్మనా తనను సర్వేశ్వరునకు పుకొనుటయే ప్రపత్తి యోగము ఇదియే ఆత్మ నివేదన భక్తి ప్రకారము దీనికి శరణాగతి యని ప్రసిద్ధ నామము. ౦, సన్న్యాసము, భర న్యాసము, సాధ్య భక్తి, త్యాగము నవి దీనికే పర్యాయ పదములు భాగవత ధర్మమైన యీ పర్శనము వేదము, ఉపనిషత్తులు, పురాణములు, భగవద్గీత స్తోత్ర మనబడు పాంచరాత్రాగమము మున్నైన ప్రామాణ ము లన్నింటిలోను ప్రతిపాదితమైనది బ్రహ్మ, నారద కపిలాచార్యులు వంటి పలువురిచే అనుష్ఠింపబడినది చే, ఆచార్యులచే ఆదరముతో ఆచరింపబడినది

, :

ప్రపత్తి ధర్మము వేద ప్రతిపాదితము -

'తం పత్నీభి రనుగచ్ఛేమ దేవాః
పుత్రై ర్భ్రాతృభి రుతవా హిరణ్యైః
నాకం గృహ్ణానాః సుకృతస్య లోకే
తృతీయే పృష్ఠే అధిరోచనే చ ''

— (యజుర్వేదము 16 - 60)

ాజసు లగు మహా భక్తులకే ప్రవేశింప నలవి యైనదియు - లోకముల కెల్ల పైన దివ్య కాంతులతో విలసిల్లుచు - త్రిపా యనబరగుచుండు నీ సన్నిధిని, పరమ పదమును పొందు స్వామీ ! మా స్త్రీలతోను, మా సంతానముతోను, ౨ సర్వ సంపదలతోను నిన్నే శరణు వేడుచున్నాము' అను ప్పు ఈ వేద వాక్యములో - ముముక్షు వగు మానవుడు

కర్మ జ్ఞానాదు లగు పెక్కు సాధనములచే క్లేశ పడి, యేది సాధించునో - అది యంతయు భక్తిపరుఁడు అనాయాసముగాను, శీఘ్రముగాను బొందఁగలుగును' అని భావము. సర్వ పాపములను భగ్నము చేసి, సాధకు నుద్ధరించు మహిమ భక్తికే కల దను మాట వ్యాస ప్రోక్తమే

"యథాగ్నిః సుసమిద్ధార్చిః కరోత్యేధాంసి భస్మసాత్
తథా మద్విషయా భక్తి రుద్ధవైనాంసి కృత్స్నశః"

— (భాగవతము 11 - 14 - 19)

ఉద్ధవా! నిప్పు కట్టెలను కాల్చివేయునట్లు, భక్తి - పాపముల నెల్ల దహించివేయును' - భక్తియే భగవంతుని వశపఱచుకొనఁ గలిగినది 'భక్తి వశః పురుషః' 'భక్తిరేవైనం గమయతి' పరమాత్మ భక్తికే లభించువాఁడు. భక్తియే భగవానుని బొందించునది' మొదలైన వాక్యములు నిత్య సత్యములు

భక్తి శూన్యములైనచో - తపస్సు, జ్ఞానము, ధర్మము ఏవియు పవిత్రుని చేయఁజాలవు, ఉద్ధరింపను లేవు

"ధర్మః సత్య దయోపేతః విద్యావా తపసాన్వితా
మద్భక్త్యపేత మాత్మానం న సమ్యక్ ప్రపునాతిహి"

— (భాగవతము 11 14 - 22)

అను శ్రీమద్భాగవత సూక్తి ఇచట స్మరింపఁ దగినది

దృఢమైన భక్తి - కర్మచే ఎట్టి పాపి నైనను, జాతిచే ఎట్టి నికృష్టు నైనను పవిత్రునిఁ జేసి ఉద్ధరించును.

"భక్త్యాహ మేకయా గ్రాహ్యః శ్రద్ధయాత్మా ప్రియ స్సతామ్
భక్తిః పునాతి మన్నిష్ఠా శ్వపాకా నపి సంభవాత్"

— (భాగవతము 11 - 14 - 21)

ఉద్ధవునితో శ్రీకృష్ణ భగవానుఁడు నుడివిన యీ మాట
ంత యథార్థమో - భక్తి చరితము లెఱిఁగినవారికి వేఱుగా
ప్పనక్కఱలేదుగదా!

అద్భుత శక్తి సంపన్నమైన యీ భక్తి కలుగుట యెట్లు?
కి సాధనము లెవ్వి? అన్నచో - భక్తి తత్త్వ విదగ్రేసరు లగు
మద్రామానుజాచార్యవర్యు లిట్లు సాధక సప్తకమును తెలిపిరి -

'తల్లబ్ధిః వివేక విమోకాభ్యాస క్రియా కల్యాణా నవసాదా నుద్ధర్షేభ్యః
సంభవా న్నిర్వచనా చ్చ'

— (శ్రీభాష్యము)

భక్తి కలుగుటకు - వివేకము, విమోకము, అభ్యాసము,
ము, కల్యాణము, అనవసాదము, అనుద్ధర్షము అను ఏడును సాధన
లు. వీని వివరణ మిది -

**వివేకము :-**

"ఆహార శుద్ధౌ సత్త్వ శుద్ధిః సత్త్వ శుద్ధౌ ధ్రువాస్మృతిః"
అను ఛాందోగ్య వాక్యానుసారము - సాత్త్వికాహార సేవనము
ద్ధలైన వానిచే శరీరమును పరిశుద్ధమైన దానినిగా చేసికొనుట

**విమోకము -**

ప్రాణికోటియందు ప్రేమయు, ఆర్తులయందు కనికరమును,
స్య కార్యాచరణము చేయుటయందు సంమోదమును, దుర్జనుల
ందు ఉపేక్షా భావమును అలవఱచుకొనుచు, కామ క్రోధములను
నీయక, హృదయమును నిర్మలమైనదిగా నుంచుకొనుట.

**అభ్యాసము :-**

ఆచార్యోపదిష్టమైన మార్గమును భగవ దనుగ్రహ ప్రాప్తికి
నములైన మంత్ర జపాదులను నిరంతరముగా కావించుచుండుట

౪ క్రియ -

ఆశ్రమ విహితములైన కర్మలను ఫలాపేక్ష లేకుండ, భగవదారాధన బుద్ధితో - శ్రద్ధాళువై యాచరించుట

౫ కల్యాణము -

సత్యము, దానము, దయ, అహింస మున్నగు లోకకల్యాణ హేతువులైన ధర్మములను సర్వదా పాటించుచుండుట

౬. అనవసాదము -

ఉపక్రమించిన సాధన కార్యమునుండి విరమింపకుండట 'శ్రేయాంసి బహు విఘ్నాని' అను నట్లు - మంచి పనికి పలు విఘ్నములు ఎదురగుట సహజమే అనారోగ్యము, కుటుంబ కష్టములు, దారిద్ర్యము - మొదలైనవానిచే, సాధకుని సాధనకు ఆటంకము లేర్పడుచుండును అయినను - సాధకుడు చలింపక, ఓర్పు సడలనీయక, పట్టుదలతో సాధనను సాగించుట

౭. అనుద్ధర్షము :-

సాధన ప్రభావమువలన సాధకునకు ఏవియో కొన్ని సామాన్య జనులకు లేని శక్తులు కలుగవచ్చు పలువురు తన చుట్టును చేరవచ్చును. మహాత్ముడని కీర్తింపవచ్చును ఉత్సవములు, పాదపూజలు సలుపవచ్చును ఇట్టివానివలన, సాధకుని హృదయములో - నే నెంత గొప్పవాడను ! అను ఒక అహంకారము పొడముటకు అవకాశము కలదు అట్టి స్వాతిశయ భావమే ఉద్ధర్ష మనబడును, ఇది పతన హేతువు కాబట్టి, యీ భావమును దరి జేరనీయక సాధకుడు 'తద్దాస దాస చరమావధి దాస దాసః' అనునట్లు - వినయ సంపన్నుడై మెలగుటయే అనుద్ధర్ష మని నిష్కృష్టార్థము ఈ సాధన సప్తకముచే కలిగిన భక్తి వలన మానవుడు భగవదనుగ్రహ పాత్రుండై, ముక్తిని బడయును.

౨౮ - ప్రపత్తి దర్శనము

" యే యథా మాం ప్రపద్యంతే
తాం స్తథైవ భజా మ్యహమ్ "

నన్ను పాసింతురో - వారికి నే నట్లే ఫల ప్రాపకుడ నగు

"మా మేవ యే ప్రపద్యంతే
మాయా మేతాం తరంతి తే "

— (7-14)

త్తితో కొల్చినవారు ఈ సంసార సంబంధి యగు
'టిని, ముక్తి నొందుదురు '

ం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాప యోనయః
ౖశ్యా స్తథా శూద్రా స్తేఽపి యాంతి పరాంగతిమ్ "
ం బొందినవా రెవ్వరైనను ముక్తిని బడయుదురు.'

" తతః పదం త త్పరిమార్గితవ్యం
యస్మిన్ గతా న నివ ర్తంతి భూయః
త మేవ చాద్యం పురుషం ప్రపద్యే
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ "

— (15-4.)

> మాయా శక్తి ఏ పరమాత్మనుండి బయలు వెడలినదో,
చు శరణు బొందెదను - అను భావములో, పున
తమైన ముక్తి పదమును వెదుకవలెను '

" త మేవ శరణం గచ్ఛ సర్వ భావేన భారత !
త త్ప్రసాదా త్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ "

— (18-62)

'మనో వాక్కాయ కర్మలతో ఆ పరమాత్మనే శరణు పొందుము ఆ సర్వేశ్వరుని యనుగ్రహమున నీవు ముక్తి నొందుదువు.'

ఇట్లు గీతాచార్యులు ప్రపత్తి ధర్మమునే ఉపదేశించిరి

"సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః"
— 18.66

'సకల కర్మ ఫల త్యాగము చేసి, నన్నే శరణు పొందుము నిన్నే పాపములు బాధించకుండునట్లు చేసి, ముక్తి నొసంగుదును. చింతింపకుము'

దీనిని చరమ శ్లోకమందురు ఇది ముముక్షువులకు ముంగొంగు బంగారము ఈ విధముగా గీతా శాస్త్రము ఆది మధ్యాంతము లందంతటను ప్రపత్తి ధర్మమును ప్రదర్శించుచు, ప్రపన్నులకు పరమ ప్రమాణమైనది ప్రపత్తి శాస్త్ర లక్ష్మికి తిలకాయమానమైన ఈ క్రింది గీతా శ్లోకము ముముక్షువులకు నిత్యానుసంధేయము.

"మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే."

'నేను ప్రతిజ్ఞ చేసి చెప్పుచున్నాను పరమాత్మ నగు నా యందే మనసు నిల్పుము. నన్నే భక్తితో భజింపుము నన్నుద్దేశించియే యాగాదులు చేయుము నన్నే నమస్కరింపుము నన్నే పొందుదువు నిక్కము' ఇందు ప్రబోధితమైనదే అనన్య భక్తి అట్టి అనన్య భక్తితో పరమాత్మకు ఆత్మ సమర్పణము చేయుటయే ప్రపత్తి

ప్రపత్తి మూలముననే పరబ్రహ్మ యగు శ్రీమన్నారాయణుఁడు లభ్యుఁడగు ననువిషయమును భగవద్గీతా శాస్త్రము సుస్పష్టముగా ప్రకటించిన దని యామునాచార్యులవారి ట్లాన తిచ్చిరి :-

"స్వ ధర్మ జ్ఞాన వైరాగ్య సాధ్య భక్త్యేక గోచరః
నారాయణః పరం బ్రహ్మ గీతా శాస్త్రే సమీరితః"

"స్వధర్మానుష్ఠానమువలన జ్ఞానము, జ్ఞానము వలన వైరాగ్యము, వైరాగ్యముచే భక్తి, భక్తిచే సాధ్య భక్తి యనఁబడు ప్రపత్తియు కలుగును అట్టి ప్రపత్తిచేతనే పరబ్రహ్మ యగు శ్రీమన్నారాయణుఁడు గోచరించు నని గీతా శాస్త్రము వక్కాణించుచున్నది"

పరమ ప్రపన్న శిఖామణు లగు కొందఱు మహాత్ముల ముఖములనుండి వెలువడిన ప్రపత్తి సూక్తి పరిమళములు కొన్ని ఇవి :

"భవతు శరణ మేకో విష్ణుపోతో నరాణామ్"

— (ముకుంద మాల 12)

ఈ సంసార సాగరమును దాటుటకు శ్రీహరి యను నౌకయే యాతరణము"

— శ్రీ కులశేఖరులు

"అగతిం శరణాగతం హరే!
కృపయా కేవల మాత్మసాత్కురు"

— (స్తోత్ర రత్నము 48)

దిక్కు లేనివాఁడను నిన్నే శరణు పొందినవాఁడను ఓ పురుషోత్తమా! దయచే నన్ను నీ వాఁడను చేసికొనుము"

— శ్రీ యామున మునివర్యులు.

"శ దయం తవ పాద పద్మయో
రహా మద్త్యైవ మయా సమర్పితః"

— (స్తోత్ర రత్నము - 62

'ఓ స్వామీ ! నీవే నా యేడుగడవు కావున, నేడు నన్ను నేనే
పాద పద్మములయందు సమర్పించుకొనుచున్నాను.'

— శ్రీ యామున ముని వర్యుల

"పితరం మాతరం దారాన్ పుత్రాన్ బంధూన్ సఖీన్ గురూన్
రత్నాని ధన ధాన్యాని క్షేత్రాణి చ గృహాణి చ
సర్వ ధర్మాంశ్చ సంత్యజ్య సర్వ కామాంశ్చ సాక్షరాన్
లోక విక్రాంత చరణౌ శరణం తే వ్రజం విభో !"

— (శరణాగతి గద్య

'తలి దండ్రులు, ఆలు బిడ్డలు, చుట్టములు, నెచ్చెలులు, ఒజ్జలు, సి
సంపదలు, పొలములు, ధర్మములు, కామములు - అన్నియు వీ
ఓ శ్రియః పతీ ! ముల్లోకముల నతిక్రమించిన నీ చరణారవిందముల
శరణు జొచ్చినాను'

— శ్రీ భగవ ద్రామానుజ యతి సార్వభౌము

"అగతి శరణో భవాద్ధౌ లుఠన్
వరద ! శరణమి త్యాహ త్వాం వృణే"

— (వరద రాజ స్తవము 82

'ఈ సంసార సముద్రములో పడి కొట్టుకొనుచున్న దిక్కు
వాడను. ఓ వరదరాజా ! నిన్నే శరణు పొందినాను'

— శ్రీ వత్స చిహ్న మిశ్రు

"ఆయుః ప్రజానా మమృతం సురాణాం
రంగేశ్వర ! త్వాం శరణం ప్రపద్యే"

— (శ్రీ రంగ రాజ స్తవము 8

" ఓమి త్యాత్మానం యుంజీత ఏతద్వై మహోపనిషదం దేవానాం గుహ్యం య ఏవం వేద బ్రాహ్మణో మహిమాన మాప్నోతి తస్మా బ్రహ్మణో మహిమానమ్ "

— (తైత్తిరీయోపనిషత్తు 10-72)

'ఓ పురుషోత్తమా ! నీవు తేజోమయుఁడవు, సువర్ణ స్వరూపుఁడవు, సర్వ వ్యాపకుఁడవు, ఈవి లోకములకు శక్తి ననుగ్రహించువాఁడవు, ఈ విశ్వము నెల్ల నీవే ధరించువాఁడవు, అగ్నికి తేజస్సును, చంద్రునకు కాంతిని ప్రసాదించునట్టి వాఁడవు అట్టి నిన్నే ముక్తికై శరణు వేడుచున్నాము '

'ఓం అను ప్రణవార్థమును గుర్తించి, తనను పరమాత్మకు సమర్పింపవలెను ఇదియే సర్వోపనిషత్తుల సారము ఇది దేవతలకు గూడ గుహ్యమైనది. ఈ న్యాస విద్య నెఱిఁగిన సాధకుఁడు ముక్తి నొందును.

ఈ పై వేద వాక్యములలో - పరబ్రహ్మ స్వరూప స్వభావములును తెన్నగా ప్రస్తుతింపఁబడినవి జీవ లక్షణము నిర్దిష్టమైనది జీవునకు కర్తవ్యమైన శరణాగతి యుపదిష్టమైనది తదనుష్ఠాన ప్రక్రియయు ప్రదర్శితమైనది ప్రణవానుసంధానమునచే ముముక్షువు ప్రపత్తి తత్త్వమును గుర్తింపఁగలఁడని సూచింపఁబడినది అయినచో - ప్రణవార్థ మేమి ? ఆచార్యులు ప్రణవార్థము నిట్లు వివరించిరి :

"అకారార్థో విష్ణుః జగ దుదయ రక్షా ప్రలయ కృత్
మకారార్థో జీవః త దుపకరణం వైష్ణవ మిదమ్
ఉకారో ఽనన్యార్హం నియమయతి సంబంధ మనయోః
త్రయీ సార స్త్ర్యాత్మా ప్రణవ ఇమ మర్థం సమదిశత్ "

— (అష్ట శ్లో. 1

అ+ఉ+మ్=ఓమ్ అకారము, ఉకారము, మకారము అను మూ(డు) అక్షరములు చేరి ప్రణవమైనది. ఇందలి అకారము విష్ణు వాచకము ఆ మహా విష్ణువే జగముల సృష్టి స్థితి లయములకు కర్త సర్వేశ్వరుడు అను విషయార్థమును అకారము బోధించుచున్నది. మకారము జీవ వాచకము ఈ జీవ సముదాయము, జగత్తు అంతయు శ్రీమన్నారాయణునకు భోగ్య వస్తువు ఇది యంతయు అతనిదే యను భావమును తెలుపుచున్నది ఉకారము అవధారణార్థకము 'ఈ జీవకోటియు, జగత్తును ఆ పరమాత్మదే ఇతరులదే మాత్రము కాదు' అను తాత్పర్యమును ప్రకటించుచున్నది కాగా - దీని సారాంశము శ్రీమన్నారాయణుడే సర్వ జగత్స్వామి, జీవాత్మ దాసుడు స్వామి యైన యా శ్రీ హరికే అతనిదే యైన ఆత్మను సమర్పించుకొనుట యుక్తము. జీవ స్వరూపమున కనురూపమైన ధర్మము' అని ఫలితార్థము ఇదియే న్యాస విద్య

*ముండకోపనిషత్తు*

సాధకుడు ప్రణవముతో అనుష్ఠింపవలసిన ఈ న్యాస విద్యను ముండకోపనిషత్తులో ధానుష్కుడు లక్ష్య వేధనమునకు గావించు వట్టి శర ప్రయోగముగా రూపించి చిత్రించెను

"ప్రణవో ధనుః శరో హ్యాత్మా, బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే
అప్రమత్తేన వేద్ధవ్యం, శరవ త్తన్మయో భవేత్ "
— (ముండకోపనిషత్తు 2 - 4)

ఓంకారమే విల్లు జీవాత్మయే అమ్ము పరమాత్మయే గురి సాధకుడను విలుకాడు మిక్కిలి మెలకువతో ఆ గురిని కొట్టవలెను అమ్ము వెళ్ళి, గురిలో చొచ్చుకు పోయినట్లు జీవాత్మ పరమాత్మను చేరును' - అని భావము

"ఓమి త్యాత్మానం యుంజీత ఏతద్వై మహోపనిషదం దేవానాం గుహ్యం య ఏవం వేద బ్రాహ్మణో మహిమాన మాప్నోతి తస్మా ద్బ్రహ్మణో మహిమానమ్"

— (తైత్తిరీయోపనిషత్తు 10-72)

'ఓ పురుషోత్తమా ! నీవు తేజోమయుడవు, సువర్ణ స్వరూపుడవు, సర్వ వ్యాపకుడవు, నీవి లోకములకు శక్తి ననుగ్రహించువాడవు, ఈ విశ్వము నెల్ల నీవే ధరించువాడవు, అగ్నికి తేజస్సును, చంద్రునకు కాంతిని ప్రసాదించునట్టి వాడవు అట్టి నిన్నే ముక్తికై శరణు వేడుచున్నాము'

'ఓం అను ప్రణవార్థమును గుర్తించి, తనను పరమాత్మకు సమర్పింపవలెను ఇదియే సర్వోపనిషత్తుల సారము ఇది దేవతలకు గూడ గుహ్యమైనది. ఈ న్యాస విద్య నెఱిగిన సాధకుడు ముక్తి నొందును.

ఈ పై వేద వాక్యములలో - పరబ్రహ్మ స్వరూప స్వభావములును తెన్నగా ప్రస్తుతింపబడినవి జీవ లక్షణము నిర్దిష్టమైనది జీవునకు కర్తవ్యమైన శరణాగతి యుపదిష్టమైనది త దనుష్ఠాన ప్రక్రియయు ప్రవర్తితమైనది ప్రణవానుసంధానమునందే ముముక్షువు ప్రపత్తి తత్త్వమును గుర్తింపగలడని సూచింపబడినది అయినచో - ప్రణవార్థ మేమి ? ఆచార్యులు ప్రణవార్థము నిట్లు వివరించిరి :

"అకారార్థో విష్ణుః జగ దుదయ రక్షా ప్రలయ కృత్
మకారార్థో జీవః త దుపకరణం వైష్ణవ మిదమ్
ఉకారోఽనన్యార్హం నియమయతి సంబంధ మనయోః
త్రయీ సార స్త్ర్యాత్మా ప్రణవ ఇమ మర్థం సమదిశత్"

— (అష్ట శ్లోకి. 1

లక్ష్మీ తంత్రమున కూడ ఈ ప్రపత్తి విద్యా స్వరూపము విపులముగా వర్ణింపబడినది ప్రణవము లో చేయఁదగు న్యాస రూప యజ్ఞము ఈ తంత్రములో ఇట్లు వివరింపబడినది —

"జీవాత్మానం హవిః కృత్వా త చ్ఛరీరం మహాయుషి
బ్రహ్మాగ్నౌ జుహుయా దోమి త్యనే నామ్నాయ రూపిణా
ఇతి ప్రపత్తే రాఖ్యాతః ప్రయోగః ప్రణవాత్మకః
తస్యైవ విదుషో యజ్ఞం శరీరే తత్ర కల్పితః

జీవాత్మ యను హవిస్సును, పరమాత్మ యను అగ్నిలో — ప్రణవ మంత్ర మగు ఓంకారముతో హోమము చేయవలెను ఇదియే ముముక్షు వగు సాధకునకు వేద విహితమైన ప్రణవ యజ్ఞ రూప మైన ప్రపత్తి యోగము'

భగవద్గీత

ప్రపత్తి దర్శనమునకు గీతా శాస్త్రము విజయ ధ్వజము వంటిది భక్త శ్రేష్ఠుఁ డగు అర్జునుని వ్యాజముగా గొని, యోగీశ్వరుఁ డగు శ్రీకృష్ణ భగవానుఁడు ముముక్షువు లెల్ల పరమోపాదేయ మైన ప్రపత్తి ధర్మము నా సవిస్తరముగా గీతలో ఉపదేశించెను

యచ్ఛ్రేయస్స్యా న్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్ "

— (భగవద్గీత 2 - 7)

'నా కేది మేలో తెలియ కున్నది స్వామీ! నిన్నే శరణు పొంది నాను నీ శిష్యుఁడను నాకు మే లేదియో తెలియఁ జెప్పుము' — అనుచు పార్థుఁడు చేసిన ప్రపత్తితో ప్రారంభమైనది గీత నడుమ నడుమ పెక్కు సందర్భములలో ప్రపత్తి ప్రస్తుత మైనది.

"ఓమి త్యాత్మానం యుంజీత ఏతద్వై మహోపనిషదం దేవానాం గుహ్యం య ఏవం వేద బ్రాహ్మణో మహిమాన మాప్నోతి తస్మా ద్బ్రహ్మణో మహిమానమ్

— (తైత్తిరీయోపనిషత్తు 10-72)

'ఓ పురుషోత్తమా ! నీవు తేజోమయుడవు, సువర్ణ స్వరూపుడవు, సర్వ వ్యాపకుడవు, జీవి లోకమునకు శక్తి ననుగ్రహించువాడవు, ఈ విశ్వము నెల్ల నీవే ధరించువాడవు, అగ్నికి తేజస్సును, చంద్రునకు కాంతిని ప్రసాదించునట్టి వాడవు అట్టి నిన్నే ముక్తికై శరణు వేడుచున్నాము'

'ఓం అను ప్రణవార్థమును గుర్తించి, తనను పరమాత్మకు సమర్పింపవలెను ఇదియే సర్వోపనిషత్తుల సారము ఇది దేవతలకు గూడ గుహ్యమైనది. ఈ న్యాస విద్య నెఱిగిన సాధకుడు ముక్తి నొందును.

ఈ పై వేద వాక్యములలో - పరబ్రహ్మ స్వరూప స్వభావములును తెన్నగా ప్రస్తుతింపబడినవి జీవ లక్షణము నిర్దిష్టమైనది జీవునకు కర్తవ్యమైన శరణాగతి యుపదిష్టమైనది తదనుష్ఠాన ప్రక్రియయు ప్రవర్తితమైనది ప్రణవానుసంధానమునచే ముముక్షువు ప్రపత్తి తత్త్వమును గుర్తింపగలడని సూచింపబడినది అయినచో - ప్రణవార్థమేమి ? ఆచార్యులు ప్రణవార్థము నిట్లు వివరించిరి :

"అకారార్థో విష్ణుః జగ దుదయ రక్షా ప్రలయ కృత్
మకారార్థో జీవః త దుపకరణం వైష్ణవ మిదమ్
ఉకారో ఒనన్యార్హం నియమయతి సంబంధ మనయోః
త్రయీ సార స్త్ర్యాత్మా ప్రణవ ఇమ మర్థం సమదిశత్ "

— (అష్ట శ్లోకి . 1

దేశమందైనను, ఏ సమయమందైనను, ఏ స్థితిలో నైనను, ఎవ్వరైనను, ఏ ఫలము కొఱకైనను ఈ ప్రపత్తి దర్శనము నాశ్రయింపవచ్చును. అయినను, నశ్వరము లగు ఫలముల కొఱకు ప్రపత్తి చేయువానికంటె, శాశ్వతఫలము నాకాంక్షించి ప్రపత్తి చేయువాడు వివేకి యగును కదా! అట్లే, అల్పశక్తులగు దేవతాంతరముల నాశ్రయించువానికన్న, సర్వశక్తి సంపన్నుడగు శ్రీమన్నారాయణు నాశ్రయించువాడు మిన్న కదా!

శ్రీమద్రామాయణము, మహాభారతము, భాగవతము అనునవి ప్రపత్తి నిష్ఠకు ప్రధానములైన ఉత్కృష్ట గ్రంథములుగా చెప్పవచ్చును. శ్రీమద్రామాయణమునకు దీర్ఘ శరణాగతి యను ఖ్యాతియే కలదు. అందు శరణాగతి వహించువారి సంఖ్య యెక్కువ యను భావము. శ్రీవచన భూషణము శరణాగతి దర్శనమునకు భాష్య మనదగినది. ప్రపత్తి కెట్టి నియమములు లేవను విషయమునకు ఆ రామాయణ గ్రంథములను, అందు ప్రపత్తి ననుష్ఠించిన వ్యక్తుల స్థితిగతులను పరిశీలించిన స్పష్టమగును.

జటాయువు కాకాసురలు పక్షులు. కాళియ నాగము విష సర్పము, గజేంద్రుడు మత్త జంతువు. ప్రహ్లాద విభీషణులు రాక్షస వంశీయులు, శబరి, గుహుడు నిషాదులు, అయినను ప్రపత్తి కర్తలే యైనారు కావున, జాతి భేదము కాని, పశు పక్షి విచక్షణము కాని ప్రపత్తికి అనర్హతలు కావని తెలియనగు. అట్లే, ద్రౌపది రజస్వలయై యున్న సమయమున ప్రపత్తి చేయవలసివచ్చినది. అట్లయ్యు సర్వేశ్వరుని యనుగ్రహమును బడయగలిగినది. దీనిచే, అంతరంగ శుద్ధియే యిందు ముఖ్యమైనదని తెల్లమైనది. అట్లన్నంత మాత్రమున ప్రపన్నునకు బాహ్య శౌచ మక్కఱలేదని కాదు. అసాధారణ స్థితిలో ఎట్లైనను ప్రపత్తి చేయవచ్చు ననుట యందే తాత్పర్యము

## పత్తి - అర్చావతారము

సర్వేశ్వరుని స్వరూప ప్రకారము లైదు విధములని శాస్త్ర లు తెలుపుచున్నవి అవి - పర స్వరూపము, వ్యూహ స్వరూ ము, విభవ స్వరూపము, అంతర్యామి స్వరూపము, అర్చా స్వరూ ము వీనిలో - ముముక్షువు ప్రపత్తి చేయుటకు ఏది తగినది? న ప్రశ్న వచ్చినప్పుడు - నిజమునకు వీనిలో ఏదైనను ప్రపత్తి యవచ్చు నని తేలికగా సమాధానము చెప్పకొనఁ దగును. కాని, పత్తి నాచరించువాని శక్తి స్వభావాదులనుబట్టి పరికించినచో దును కొంత సౌలభ్య సౌకర్య భేదములు కనఁబడును. సర్వేశ్వ ని యీ పంచ విధములైన స్వరూపములను, అవ్వాని స్వభావ లను పరిశీలించినపుడు, అర్చా స్వరూపమే ముముక్షువునకు క్కిలి సన్నిహిత మైనట్లును, అందు ప్రపత్తిని చేయుటయే సుకర నట్లు తోచకపోదు. క్లుప్తముగా పర వ్యూహాదుల స్వరూప మిది:-

### ర స్వరూపము :-

ఇది సర్వేశ్వరుని శుద్ధ సత్త్వ తత్త్వము జ్ఞాన శక్తి బలైశ్వర్య ర్య తేజోరూప సమగ్ర షడ్గుణ పరిపూర్ణము. పర వాసుదేవాభిదము. పా ద్విభూతికి సంబంధించినది. నిత్య ముక్తానుభావ్యము ఇది మాన్యుల ఊహాకే దుర్లభ మైనది.

### హ స్వరూపము :-

ఇది సంకర్షణుఁడు, ప్రద్యుమ్నుఁడు, అనిరుద్ధుఁడు — అని వహరింపఁబడుచుండు సర్వేశ్వరుని అంశ త్రయాత్మకము పురు త్తముని సమగ్రములైన ఆఱు గుణములు రెండేసి చొప్పున క్తములై యేర్పడినవారు సంకర్షణాదులు ఈ త్రిమూర్తి రూపమే వ్యూహము. ఈ పర వ్యూహ స్వరూపములను పరాశర ట్టాచార్యులవా రిట్లు వివరించిరి :-

షాడ్గుణ్యా ద్వాసుదేవః పర ఇతి స భవాన్ ముక్తభోగ్యో బలాఢ్యాత్
బోధాత్ సంకర్షణ స్త్వం హరసి వితనుషే శాస్త్ర మైశ్వర్య వీర్యాత్
ప్రద్యుమ్నః సర్గ ధర్మౌ నయసి చ భగవన్ శక్తి తేజో నిరుద్ధః
బిభ్రాణః పాసి తత్త్వం గమయసి చ తథా వ్యూహ్య రంగాధిరాజ!

(శ్రీ రంగరాజ స్తవము - ఉత్తర శతకము 39)

రంగాధీశ్వరుఁడవుగా వెలసిన ఓ జగన్నాయకా! సంపూర్ణ షడ్గుణ సంపత్తిచే పరుఁబడుచు నీవు ముక్తులకే గోచరుఁడవు, ఁగవు బల జ్ఞానములచే సంకర్షణాఖ్యఁ వహించి లయ కారి వేదాది శాస్త్ర చతుర్దాతవు నగుదువు ఐశ్వర్య వీర్యము పద్యుమ్నాభిధేయుఁడవై సృష్టి కృత్యమును, ధర్మపాలనమును చుచుందువు శక్తి తేజస్సులచే అనిరుద్ధ నాముఁడవై స్థితి కృత్య సద్గురి ప్రాప కృత్యమును నెరపుచున్నావు -' అని భావము. వలె ఈ విభవ స్వరూపమును సాధకునకు దురావాపము

స్వరూపము -

ధర్మమునకు దెబ్బ తగిలి, అధర్మము పెచ్చు పెరిగి, లోక కాకు నొందు సమయమునం దెల్ల దానిని చక్క దిద్దుటకును, ఁను శిక్షించి, సజ్జనులను రక్షించుటకును సర్వేశ్వరుఁడు తన భూతినుండి ఆ యా యవసరమునుఁ బట్టి, దేవ మనుజ తిర్య ములలో ఏదేని రూపమును గ్రహించి, లీలా విభూతిలోనికి స్నను ఇదియే అవతారము, ఇదియే నిజ స్వరూపము గీతలో -

"యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య త దాత్మానం సృజా మ్యహమ్"
"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే"

— (భగవద్గీత, 4-7,8,)

అను విధముగా భగవంతుడు తా నవతరించు అవసరమును, ప్రయోజనమును ఆన తిచ్చెను. మత్స్య కూర్మాదులు తిర్య క్కులూ పావతారములు కాగా - రామ కృష్ణాదులు మానవ రూపావతార ములు. వీనిలో కొన్ని అంశావతారములు. శ్రీ రామ కృష్ణావతార ములు మాత్రము పూర్ణావతారము లని విజ్ఞులు నిర్ణయించిరి. ఇట్టి యవతారము లందు ప్రపత్తి చేయుట సుకరమే. కాని, భ్రాంతి భూయిష్ఠమై, మనో ధర్మము ఆ యా యవతారముల యందు సమ కాలికులకు సర్వేశ్వరత్వ బుద్ధిని కలుగనీయదు. వేద వేద్యుం డగు పరమ పురుషుండు శ్రీ రామచంద్రుడుగా రఘు వంశమున అవత రించగా, ఆ నాటివారిలో ఎంత మందికి ఆ దాశరథి - సర్వేశ్వరుని అవతార మని తెలిసినది? వసిష్ఠుడు, వాల్మీకి, విశ్వామిత్రుడు, భర ద్వాజుడు మొదలైన మహర్షులను, ఎటి కొందరు భక్తులను మాత్రమే ఆ రఘు వీరుని శ్రియః పతిగా గుర్తింపం గలిగిరి. అట్లే శ్రీ కృష్ణుడై యదు కులమున అవతరించిన సమయమునకు గర్గాది మహాను కొందఱు మాత్రమే అతనిని శ్రీమన్నారాయణునిగా తెలిసికొనం గలిగిరి. తక్కిన వారెల్లరును కృష్ణుని సామాన్యునిగ తల చిరి. ఈ విషయమును లీలా మానుష విగ్రహుం డగు శ్రీ కృష్ణ భగ వానుడు స్వయముగనే యిట్లు వాక్రుచ్చెను -

> "అవజానంతి మాం మూఢాః మానుషీం తను మాశ్రితమ్
> పరం భావ మజానంతో మమ భూత మహేశ్వరమ్ "
>
> — (భగవద్గీత ౯-11)

'అసుర భావముతో నిండిన యవివేకులు స్వేచ్ఛతో లోక శ్రేయస్సు కొఱకు మానవుడనై జన్మించిన నన్ను - సర్వ నియంత యగు పరమాత్మగా గుర్తింపక, రాగ ద్వేషాదులతో మెలంగుచు పరిభవింతురు.'

“గరీయ స్త్వం పరిజానంతి ధీరాః
పరం భావం మనుజత్వాది భూష్ణుమ్
అజానంత స్త్వవజానంతి మూఢాః
జనిష్వంతే వాగవన్ జన్మ కర్మ. ”
— (శ్రీ రంగరాజ స్తవము - ఉత్తర శతకము ౮ )

ఓ పుండరీకాక్షా! నీవు మానవాద్యాకృతులలో అవతరించినను, జ్ఞానులు నీవు పరబ్రహ్మవని గుర్తింతురు మూఢులో జన్మరాహిత్య కారణము లగు నీ అవతారములను, చేష్టలను గ్రహింపలేక అవమానింతురు '- అని విజ్ఞులే భగవదవతార యాథార్థ్యమును తెలిసి కొనఁగల రని భావమును విశదీకరించిరి కావున, పత్తికి విభవ స్వరూపముగూడ సుగ్రాహ్య మన నేరము.

## ంతర్యామి స్వరూపము

జీవరాశి యెల్ల పరమ పురుషునకు శరీరము వంటిది చరారాత్మకమైన జగత్తునం దంతటను వ్యాపించియున్నవాఁ డగుట తనే పరబ్రహ్మ వాసుదేవుఁ డని కీర్తింపఁబడుచున్నాఁడు గీతాచార్యుఁడే -

“ విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్ ”
— ( భ గీ 10 - 42 )

అంతర్యామి రూపములో ఈ జగత్తునం దెల్ల వ్యాపించి యున్నాను’ అనియు -

“ సర్వస్య చాహం హృది సన్నివిష్టః. ”
— ( భ గీ 15 - 1 )

సకల ప్రాణి సమూహము యొక్క హృదయమున నే నున్నాను - అనియు -

" ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వ భూతాని యంత్రారూఢాని మాయయా "

—( భగవద్గీత . 18 61 )

ర్వ భూతముల హృదయమునను నిల్చినవాడను నేనే ఆ భూ
నెల్ల రంగుల రాట్నమువంటి యంత్రము మీద నున్నవారిని
ప్పినట్లు నా మాయచేత త్రిప్పుచున్నాను' - అనియు తన అంత
మి స్వరూపమును స్పష్టపఱచినాడు అంతియే గాక .

" త మేవ శరణం గచ్ఛ సర్వ భావేన భారత !
త త్ర్పసాదాత్ పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ "

— ( భగవద్గీత 18-26 )

త్రి సర్వ ప్రాణి హృదయ పీఠాధిష్ఠితుఁ డగు అంతర్యామి
రూపుఁడైన తదను గ్రహమున సంసారోపద్రవములెల్ల తొలఁగి,
తి నెలకొనును ఆ స్వామిని శరణు పొందుము శాశ్వతమైన
క్ష పదము లభించును -' అని జగదాచార్యుఁడు అంతర్యా
పాసనము నాదేశించెను

సర్వ సాక్షీ భూతుఁడైన ఈ అంతర్యామి - ప్రతి సాధకున
ను హృదయ వాసియే కావున, నిత్య సన్నిహితుఁడై ప్రపత్తి
ష్ఠింప అనువైనవాఁడే కాని, తన హృదయములోనే సర్వేశ్వరుఁ
న్నాఁ డను భావ ముదయించుటయే దర్ఘటము పర వ్యూహ
రూపము వలె ఈ అంతర్యామి స్వరూపమును అవ్యక్త తత్త్వమే
వలసియుండుటచే, సాధకునకు విశేష క్లేశ సాధ్య మగునే కాని,
భము కాదు. కావున, శరణాగతికి అంతర్యామి స్వరూపము
డ సుగమ్యము కాకపోవుచున్నది.

ఆర్చా స్వరూపము –

నిరాకార సాకారోపాసనలు రెండును వైదిక మార్గము లైనను, సాధకునకు సాకారోపాసనమే సుకర మని తద్విదు భావించిరి

" క్లేశో௨ధికతర స్తేషా మవ్యక్తాసక్త చేతసామ్
అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే "
— ( భగవద్గీత 12-5 )

అవ్యక్త తత్త్వము అవాఙ్మానసగోచరము కావున తదుపాసకులగు ముముక్షువులకు క్లేశ మెక్కువ వారికి ముక్తి దొరకదని కాదు దొరకును కాని, అది మిక్కిలి కష్టముమీద గాని లభింపదు అని భావము సాకారమైననూ – అది సాధకుని దేహేంద్రియము బద్ధునకు అందునది కావున, విశేష క్లేశము లేకుండగనే ఫలకారియగు నని యభిప్రాయము

'వ్యాసుడు, పుండరీకాక్షుడు, సహస్రశీర్షుడు, సహస్రాక్షుడు, సహస్రపాత్తు – అను విధముగా పురుషోత్తముని, పద్మహస్త, పద్మాలయ, పద్మపత్రాయతాక్షి – అను రీతిగా శ్రీదే వర్ణించుచు నడచిన వైదిక వాఙ్మయ ధారలు సాకారోపాసన భవనమునకు ప్రాతిపదికలైనవి

పరబ్రహ్మ యగు శ్రీ మహావిష్ణువును దివ్య మంగళ విగ్రహుని గాను, అఖిల హేయ ప్రత్యనీక కల్యాణ గుణ పరిపూర్ణుని గాను తత్త్వ దర్శనలు రూపొందించుకొని 'మంత్రాధీనం దైవతమ్' అను రీతిగా – దారు శిలా లోహాది నిర్మితములైన అర్చామూర్తులందు మంత్రతంత్రానుష్ఠాన ప్రధాన విధానమున ప్రాణ ప్రతిష్ఠలు జరిపి, సర్వేశ్వర సాన్నిధ్యమును సాధించుకొన్నారు.

అర్చావతారములకు సంబంధించిన ఆలయ నిర్మాణము, మూర్తి రూప కల్పనము, ప్రతిష్ఠా విధి, మంత్ర హోమ నిత్యార్చనాదులు - మొదలైన సమస్త విషయములను తెల్లము చేయుచు, సాధకులకు మార్గ దర్శకములుగా పాంచరాత్రాదు లగు ఆగమ శాస్త్రములు వెలువడినవి. ఈ ఆగమములు శ్రుతుల వలె పరమ ప్రామాణికము లైనవియు, ముముక్షువుల ననుగ్రహింప శ్రీమన్నారాయణునిచేతనే యుపదిష్టము లైన వనియు, విజ్ఞాన ధను లగు కేశికులు నిర్ణయించిరి

భగవదనుగ్రహ ప్రాప్తికి గల మార్గములలో - అతి ముఖ్యమైన అర్చా స్వరూపోపాసన మార్గము నుపదేశించునది కావున, ఈ పాంచరాత్రాగము శాస్త్రమునకు ఏకాయన శాస్త్ర మని ప్రసిద్ధి వచ్చినట్లు తెలియుచున్నది.

" శృణుధ్వం మునయ స్సర్వే వేద మేకాయనాభిధమ్
మోక్షాయనాయ వై పంథా ఏత దన్యో న విద్యతే
తస్మా దేకాయనం చేతి ప్రవదంతి మనీషిణః "

మోక్షమునకు ఇంతకంటె మించిన మార్గము లేదు కనుక, ఇది ఏకాయన మన బడుచున్నది ఇది వేదమే
ఛాందోగ్యోపనిషత్తులో

" ఋగ్వేదం భగవోఽధ్యేమి యజుర్వేదం, సామ వేద మథర్వణం వాకో వాక్య, మేకాయనం చేతి "

అని చతుర్వేదములతో బాటు ఈ భగవచ్ఛాస్త్రమైన ఏకాయనము పేర్కొనబడుట చూడ, దీని ప్రాముఖ్యమును, ప్రామాణ్యమును స్పష్టమో తెల్లమగుచున్నవి.

అట్టి శాస్త్రములు ఉపదేశించిన మార్గము ననుసరించి ప్రతి ష్ఠితమైన భగవన్మూర్తులలో - ఆ పరబ్రహ్మ దివ్యశక్తి సంపూర్ణముగా ప్రకాశించి, భక్తుల యభీష్టముల నీడేరు నని

" స ఆకస్య శక్తో యోగాత్ పూజాయా స్తా చ్చాయినాత్
అభిమాన్యాద్ భక్తిమత్వస్య సదా సన్నిహితో భవేత్ ,

సాధకునకు గావించు తన శక్తిమూలనను, ఆతఁ డొనరించు పూజా విశేషము వలనను, మూర్తి సౌందర్యాధిక్యము వలనను స్వామి యా విగ్రహములలో సన్నిహితుఁడై యుండు నని ప్రమాణ వాక్యము.

సగుణోపాసకుఁ డగు భక్తుఁడు గృహార్చా మూర్తిని గాని, ఆలయ ప్రతిష్ఠితమైన మూర్తిని గాని, త్రికరణ శుద్ధితో - అభిగమనము, ఉపాదానము, ఇజ్య, స్వాధ్యాయము లను విధముగా సన్నిధించి, ఫల పుష్పాదులు సమర్పించి, అనన్య భావముతో పూజించి ఆ యా మూర్తుల కనుగుణములుగా నిర్దిష్టము లైన మంత్రముల జపించి, ధ్యానించినచో - ఈశ్వరుని అనుగ్రహమున ఆ భక్తుని అజ్ఞాన ధ్వంసక మగు బోధము పొడమును దివ్య దృష్టి కలుగును. ఆ దివ్య దృష్టిచే ఆ భక్తు డరుసను ఆ విగ్రహమునందే త్రివిక్రమాలి లోనిదియు, దివ్య తేజోమయ మగునదియు నగు పర బ్రహ్మ స్వరూపము గోచరించును విశ్వమైన కృష్ణావతారమున అర్జునునకు వసుదేవ పుత్రుఁడుగా - తన బంధువుగా - నెచ్చెలిగా సాధారణుఁడుగా అంతవఱకు కనుపించుచుండిన శ్రీకృష్ణ పరమాత్మ ఆ యర్జునునకే దివ్య దృష్టి యను దృష్ట యనుగ్రహించిన పిమ్మట

" త త్రైకస్థం జగత్ కృత్స్నం ప్రవిభక్త మనేకధా
అపశ్యద్ దేవ దేవస్య శరీరే పాండవ స్తదా "

( భగవ ద్గీత 11 13

ఇట్లు - విశ్వేశ్వరుడుగా, అనంత వీర్యామిత విక్రముడుగా వర్ణించినాడు గదా! ఈ స్థితి సాధకునకు అర్చా మూర్తి పొందను సంభావ్యమే, సాధ్యమే దృఢతరమైన భక్తితో భగవత్స్వమూర్తి నారాధించు భక్తునకు ఆ స్వామి యనుగ్రహముననే ముక్తి లభించు ననునది సదాచారు లగు భారతీయు లందఱి విశ్వాస మంటయే కాదు — యుగ యుగములుగా కలుగుచు వచ్చిన యనుభవమును, అనుభూతి మగుచున్న సత్యము కూడ

దివ్య క్షేత్రములలోని భగవన్మూర్తులు కొన్ని స్వయంవ్యక్తము లనియు, కొన్ని ఋషి ప్రతిష్ఠితము లనియు, కొన్ని మహాపురుష ప్రతిష్ఠితము లనియు ఆ యా స్థల పురాణాదులు పేర్కొనుచున్నవి స్వాచార్య నియమనముచే గృహములందు నెలకొల్పుకొని యారాధించునవి గృహార్చామూర్తు లనబడును నిత్య యుక్తు లగు భక్తులకు ఇవి యన్నియు ఏక రూపములే 'ప్రతిమాయాం విష్ణుబుద్ధి' - 'సాలగ్రామే హరి భావ దర్శనమ్' - అన్నట్లుగా, వారికి సర్వ అర్చా మూర్తు లన్నిటియందును శ్రీమన్నారాయణోద్ధ్యవసాయమే ఆ దివ్యానుభూతియే

పరిపక్వ జ్ఞాన మూర్తు లనబడిన ఆళ్వారులును, వేదాంగ శాస్త్ర పారంగతులైన ఆచార్య వర్యులును, అవిదళ మతాంతరులైన మహాత్ములును ఎంద రెందఱో శ్రీరంగము, వేంకటాద్రి - మొదలైన దివ్య క్షేత్రములందు వెలసియున్న అర్చా మూర్తులయందే తమ ప్రపత్తి నిష్ఠను నెఱపి తరించి, ముముక్షులకు మార్గదర్శకులైనారు.

పరతత్త్వ నిర్ణయకాగ్రేసరులును, విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవర్తకాచార్యులు నగు శ్రీ భగవద్రామానుజులు - వివిధము

లైన దివ్య క్షేత్రములకు వేంచేసి, అచటి శ్రీమన్నారాయ అర్చా మూర్తుల సేవించి ఆనందించినారని శ్రీ పరాశర భ ట్టార్యులవారిట్లు తెలిపినారు –

" శ్రీరంగం, కరి శైల, మంజన గిరిం, తార్క్ష్యాద్రి సింహాచలౌ
శ్రీకూర్మం, పురుషోత్తమం చ, బదరీ నారాయణం, నైమిశమ్
శ్రీమద్ద్వారవతీ, ప్రయాగ, మధురా యోధ్యా గయా, పుష్క
సాలగ్రామ గిరిం, నిషేవ్య రమతే రామానుజోఽయం మునిః '
— ( శ్రీరంగరాజ స్తవము

కావున, ప్రపత్తి నిష్ఠకు అర్చావతారమూర్తి యనుకూలమైన సారాంశము.

ముముక్షువులకు అమృత ప్రాయమైన యీ ప్రపత్తి నిష్ఠ సాధకుల కెల్ల అందించి, మహోపకారకులైనవారు శ్రీ ఁ రాజులు. వారే –

" యామునార్య సుధాంభోధి మవగాహ్య యథా మతి
ఆదాయ భక్తి యోగాఖ్యం రత్నం సందర్శయా మ్యహమ్."

అన్నారు 'యామున మునుల నుగ్రహించిన వాఙ్మయమునుండి భ యోగమునకు సార భూతమైన యీ ప్రపత్తిని గ్రహించి, ప్రదర్శించితిని' – అనియు,

" శారీరకేఽపి భాష్యే యా గోపితా శరణాగతిః
అత్ర గద్య త్రయే వ్యక్తాం తాం విద్యాం ప్రణతోఽస్మ్యహమ్

'బ్రహ్మ సూత్ర భాష్యములో – శ్రీ భాష్యములో ఈ శరణాగ విశదముగా నిరూపితము కాలేదు కొంత గూఢముగా చెప్పఁ నది. మరి ! ఈ గద్య త్రయములోనో – ఈ ప్రపత్తి విధ

మిక్కిలి స్పష్టముగా నిరూపింపబడినది 'లోక తారకమైన విధ్యకు సమోవాక్యములు' - అనియు ఆదరముతో ఆం తిచ్చినా

అట్టి ప్రపత్తి ననుష్ఠించిన పూర్వులచే గూఢముగా నుం బడిన ఈ దర్శనమును అందఱును తేట తెల్లము చేసి ప్రబోధించి మహనీయులు కావుననే -

' ఏకైక భూయిష్ఠ సురక్షిత వంశ రీత్యా
గుప్తా ప్రపత్తి పదవీ పురుషైః పురాణైః।
రామానుజస్తు పరయా దయయా దయాళుః
సీమా మిమా మతి యయౌ జగతాం హితాయ "

— (ఉపదేశ రత్నమ

పరమ కరుణామూర్తులుగా శ్రీ భగవద్రామానుజులు ప్రపన్నులచే కీర్తింపబడినారు. మోక్ష సాధనములలో ప్రపత్తి దర్శనము సర్వశ్రేష్ఠము.



# పన్నిద్దరాళ్వారులు
# నాలాయిర దివ్య ప్రబంధము

' విద్యా భూషణ - కవితా విశారద '

**శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు**

శ్రీ రామానుజ కీర్తి కౌముది సంపాదకులు

★

## ప్రణామాంజలి

' భూతం సర శ్చ మహ దాహ్వయ భట్టనాథ
శ్రీ భక్తిసార కులశేఖర యోగివాహాన్
భక్తాంఘ్రిరేణు పరకాల యతీంద్ర మిశ్రాన్
శ్రీమ త్పరాంకుశ మునిం ప్రణతోఽస్మి నిత్యమ్ "

★ ★ ★

" నీళా తుంగ స్తనగిరి తటీ సుప్త ముద్బోధ్య కృష్ణమ్
పారార్థ్యం స్వం శ్రుతి శత శిర స్సిద్ధ మధ్యాపయంతీ
స్వోచ్ఛిష్టాయాం స్రజినిగళితం యాబలా త్కృత్య భుంక్తే
గోదా తస్యై నమ ఇద మిదం భూయ ఏవాస్తు భూయః "

★ ★ ★

" అవిదిత విషయాంతర శ్శఠారే
రుపనిషదా ముపగాన మాత్ర భోగః
అపి చ గుణ వశా త్తదేక శేషీ
మధుర కవి ర్హృదయే మమాఽ విరస్తు "

★ ★ ★

## ఆళ్వారులు - పరమార్థము

అఖండ భూమండలములో మన భరత ఖండము ‘ పుణ్య భూమి ’ యను ప్రఖ్యాతి నార్జించినది. అపౌరుషేయములైన వేదములతో - ఆర్షములైన ఉపనిషత్సూత్ర గీతలతో తులదూగుచుండుటయే ఇందులకు హేతువుల మఱియును, మహనీయులైన తపస్సంపన్నులతో పరమ పవిత్రములైన తీర్థరాజములతో - బ్రహ్మానంద సంధాయకములైన పర్వత శ్రేష్ఠములతో - అనర్ఘ రత్న ప్రయుక్తములైన పర్వత శ్రేష్ఠములతో - వివిధ కళలతో - వివిధ సంస్కృతులతో విలసిల్లుచుండుటయే ఇందులకు కారణము అదియునుగాక, మన భరత ఖండము-అధ్యాత్మ విద్యకు ఆలవాలమై, భక్తి వైరాగ్యములకు పట్టుగొమ్మయై, దైవశక్తులకు దివ్య నిలయమై సంశోభించుచు, తన సహజ కాంతులను దిగంతములవఱకు పరివ్యాప్తము గావించి, ఖండాంతర వాసులను సైతము దిగ్భ్రాంతులఁ జేయుచునే యున్నది.

ఈ విధముగా విశ్వ విఖ్యాతమై యొప్పారు మన భరత ఖండమున - ఎందఱో మేధావంతు లుద్భవించి, తత్త్వ శాస్త్రవేత్తలై, సృష్టి రహస్యములను లోకమున విస్పష్టముగా వెల్లడించిరి. ఎందఱో మహానుభావు లవతరించి, సంసార సాగర సముత్తరణార్థమై, సర్వ సంగ పరిత్యాగము గావించి, భక్తి ప్రపత్తులతో సనాతన ధర్మ ప్రతిపాదకుఁడైన వాసుదేవ భగవానుని సమారాధించి, సర్వాంతర్యామి యైన యా భగవానుని సాక్షాత్కార భాగ్యమునుఁ బడసి, సంతుష్టాంతరంగులై, తమ తమ యనుభూతులను లోకమునకు యథాతథముగ వెల్లడించుటయే గాక, వేద విజ్ఞానమును సైతము సర్వ మానవులకు కరతలామలక మొనరించి, చిర స్మరణీయులుగా విలసిల్లిరి. అట్టి మహా భక్తాగ్రగణ్యులే మన ఆళ్వారులు.

## ఆళ్వారుల వైశిష్ట్యము

తమిళ ప్రదేశమున వివిధ ప్రాంతములలో - వివిధ వర్ణముల యందు - వివిధ సమయములలో నవతరించిన ప్రముఖ వైష్ణవ భక్తులు పన్నిద్దఱు మాత్రమే ఆళ్వారులుగా నేడు వ్యవహరింపఁబడుచున్నారు. 'ఆళ్వారు' అను శబ్దమునకు - భగవద్భక్తి పరవశుఁడనియు, భగవద్గుణములలో లోఁతు మునిఁగినవాఁడనియు రెండర్థము లున్నవి[1] ఇందువలన, ఆ మహనీయుల దివ్యహృదయము నకు సరిపోలి యుండుటచేఁ బట్టియే ఆళ్వారులుగా పరిగణింపఁబడుచున్నారని మనము సంభావింప వచ్చును

తమిళ భాషలో 'ఆళ్ దళ్' అను శబ్దమునకు - 'శాసించుట' అని యర్థము కావున, ఈ 'ఆళ్ దళ్' శబ్దము నుండియే 'ఆళ్వార్' అను శబ్దము సముత్పన్నమైన దనియు, భగవత్పరతంత్రులును - భగవద్గుణానుభవశోభితులు నగు ఆ భక్తాగ్రేసరులు భగవంతునిపై భక్తి పూర్వకమైన ఆధిపత్యము చేయఁగలవారగుటచే - 'ఆళ్వారులు' అని వ్యవహరింపఁబడుచుండిరనియు తమిళ భాషాభిజ్ఞులైన వైష్ణవ హృదయుల నిశ్చితాభిప్రాయము. అయినఁగాని, 'ఆళ్వార్' అను శబ్దమునకు 'మగ్న మగుట' అనియును అర్థమున్నందున, భగవద్గుణానుభవములో నిమగ్నులైన ఆ మహనీయులు

1 'సంప్రదాయ అకారాది' అనుపదవిశ ఆంధ్రనిఘంటువు - పుట 118
— శ్రీమాన్ కందాడై శేషాచార్యులు.

లు' అని వ్యవహరింపబడుచున్నా రనియు మఱి కొందఱు
ులు నిర్వచించుచున్నారు [2] ఎవరు ఏ రీతిగా నిర్వచించినను,
గోకమున ధ్రువ తారవలె ప్రకాశించిన పరమ భక్తాగ
కన్నిద్ద్రులు మాత్రమే ఆళ్వారు లనుట నిర్వివాదాంశము.

మహనీయు లంతటి మహా భక్తు లయ్యును - ఈ లీలా
నున్నంత కాలము, ఆళ్వారులుగా వ్యవహరింపబడియుండ
రి యనంతరము కొంత కాలమునకు శ్రీ రామానుజ యుగ
శ 1017 - 1137) 'తిరు క్కురుగై ప్పిరాన్ పిళ్ళాన్'
నే నాలాయిర దివ్య ప్రబంధము పై రచింపబడిన టీకలో -
నేరు నుద్దేశించి 'ఆళ్వారులు' అను శబ్దము తొలిసారిగా
ఎబడినది అందురు, నాటినుండియు ఆ మహనీయులు
ు' అను అన్వర్థ నామముతో వ్యవహరింపబడు చుండి
య్యెను.

లాయిర దివ్య ప్రబంధములో నొక తావున మాత్రమే
అను శబ్దము ప్రయోగింపబడి యున్నది [3] కాని, ఆ
ము వైష్ణవ భక్తుల నుద్దేశించినది కాదు నమ్మాళ్వారుల

word 'Alvar' has peculiar Significance of its own It
s one who has Sunk into the depths of his existence or
who is lost in rapturous devotion to the Lord It is a word
descriptive of All God intoxicatedman "

—'Grains of Gold' R. S. Desikan, p.6.

ాయణన్ ఎన్నైయాళి నరకతుడ్
ల్ కాక్కుమ్ తిరుమాల్ తన్ - పేరాన
ుశాత పిచ్చమయర్ పేశక్కేట్టు
ట్ట ఆళ్వార్ నలర్ "

—నాన్ముగన్ తిరువన్దాది 14

రచనలో నొక చోట - 'అడియార్' అనియు, 'భగవర్' అనియు రెండు శబ్దములు మాత్రము వైష్ణవభక్తుల నుద్దేశించి ప్రయోగింపఁబడి యున్నవి[4] ఇందలి 'అడియార్' శబ్దమునకు – 'దాసభూతులు' అని యర్థము

"దాసభూతా స్స్వతః స్సర్వే ఆత్మానః పరమాత్మనః
నాన్యథా లక్షణం తేషాం బంధే మోక్షే తథైవ చ"

అను ప్రమాణోక్తరీత్యా - చేతను లందఱును పరమాత్మకు దాసభూతులే సంసార బంధమునఁ గాని, మోక్ష మొసఁగు పరమ పదమునందుఁ గాని చేతనులకు స్వాతంత్ర్య మేమాత్రము లేనందున పారతంత్ర్యముతో భగవంతుని యెడ దాస భూతులుగా ప్రవర్తించు వారు - 'అడియార్' అనఁబడుచుందు రనియు, అట్టివారే భగవ త్ప్రపన్నులుగా - భాగవతోత్తములుగా వ్యవహరింపఁబడుచుందు రనియు మనము గ్రహింప నగును

ఇఁక రెండవ ప్రయోగ మగు 'భగవర్' శబ్దమునకు - 'భగవ త్సాక్షాత్కార భాగ్యమునుఁ బడసిన సిద్ధ పురుషులు' అని యర్థము. వీరు కేవలము భగవ త్తుల్యులు కావున - 'భగవత్' అను శబ్దము వీరి యెడ సార్థకమై యొప్పుచున్నది ఇట్టి మహనీయులను మనము - 'జీయరులు' అని వ్యవహరించుచు, భక్తి భావముతో పూజించు

4. " మేవిత్తాణదడమ్మి సీరగళ్ వేదప్పునిద విరుక్కై
నావిల్ కొణ్ణమ్మ తన్నన్మై జ్ఞాన విధిపిత్తయామే
పావిల్ పగ్గియుమ్ పిళక్కుమ్ శానమమ్ నీరుమ్మలిన్దు
మేవిత్తొఱుమ్ **అడియారుమ్ భగవరుమ్** మిక్కదులకే.'

— తిరు వాయి మొళి . 6-2-7

చుండుటచే కనుక, ఆ కాలమున వైష్ణవ భక్తుల నుద్దేశించి - వారిలో గల తర తమ భేదముల ననుసరించి - 'అడియార్' అనియు, 'భగవర్' అనియు రెండు శబ్దములు మాత్రమే తమిళ వాఙ్మయ ప్రపంచమున వ్యవహరింపఁబడుచున్నట్లు విశద మగుచున్నది

ఆళ్వారులకు సంబంధించిన చరిత్రాంశములు దాదాపుగా నన్నియు మన కిపుడు లభ్యము లగుచున్నందున, ఆ మహనీయుల ప్రతిభా విశేషములను సులభముగా గ్రహింపవచ్చును. గురుపరంపరా ప్రభావము, పెరియ తిరుముడి యడైవు, ఉపదేశ రత్నమాల, దివ్య సూరి చరితము, ప్రపన్నామృతము, యతీంద్ర ప్రవణ ప్రభావము, ఆచార్య సూక్తి ముక్తావళి, పరమయోగి విలాసము మొదలగు గ్రంథములలో - ఆళ్వారుల యవతార వైభవాదులు మిగుల మనోజ్ఞముగ అభివర్ణింపఁబడి యున్నవి అదియునుఁ గాక - శిలా శాసనముల వలనను, తామ్ర శాసనముల వలనను గూడ ఆ మహనీయులకు సంబంధించిన మఱికొన్ని చరిత్రాంశములు తెలియవచ్చుచున్నవి. ఇట్టి యాధారములఁబట్టియే ఆ పన్నిద్దరాళ్వారులు - భగవత్స్వతంత్రు లనియు, భగవద్గుణానుభవ తత్పరు లనియు, పరాకాష్ఠనందిన భక్తి ప్రపత్తులే వారి మహా ప్రభావమునకు హేతుభూతము లనియు మనకు స్పష్ట మగుచున్నది.

అట్టి పన్నిద్దరాళ్వారుల భక్తి తత్త్వమును పరిపూర్ణముగా గ్రహింపవలె నన్న వారు రచించిన దివ్య ప్రబంధములను శ్రద్ధాసక్తులతో సావధానముగ పరిశీలింపవలసి యుండును అందువలన, ఆ దివ్య ప్రబంధములలో - భక్తి సౌరభ సంభరితములైన హృత్పద్మములు గల పన్నిద్దరాళ్వారుల స్వరూప రూప విభవములు సు స్పష్టముగా మనకు సాక్షాత్కరింపఁగలవు.

ఏ దివ్య ప్రబంధము నందలి 6 - వ శతకమున 'ఆరావముదే' అను క గల 5 - వ దశకమై యుండెను ఆ పాశురములను నాథమునులు సం ప్రశుతినిం బట్టి, ఆ పాశురములు నమ్మాళ్వారులచే సహస్ర న్యలో రచింపఁబడిన 'తిరు వాయి మొళి' దివ్య ప్రబంధమునందలి గ్రహించినవారై, అంతటితో సంతృప్తి నందక, ఆ తిరు వాయి ఒకి దివ్య ప్రబంధము నందలి వేయి పాశురములను పూర్తిగా వలె ఎని యభిలషించిరి కాని, ఆ భక్తులకు ఆ తిరువాయిమొళిలో ఆ ఒక్క దశకము దక్క, మఱి యే యొక్క దశకముకూడ పికి రా దయె ను అందువలన, నాథమునుల యభిలాష సఫల కుట కు అవకాశము కల్గలేదు కాని, సుహాసియుల స త్సంకల్ప నాశ్శై సను ఫలింపకుండునా ?

ఆశయ సాఫల్యమునకై నాథమునులు దీక్ష వహించి, నమ్మా ్వరుల యవతార స్థల మగు తిరు నగరికి నెంటనే పయనమై కొన్ని ములకా పవిత్ర క్షేత్రము జేరిరి అట నమ్మాళ్వారుల కాశ్రయ మ్చిన శేషాంశ సంభూత మగు తింత్రిణీ వృక్షముకిడ కేఁగి, వ్యొట గల శ్రీ పరాంకుశ దాసుల నాశ్రయించి, వా రుపదేశిం ' కణ్ణినుణ్ శిరుత్తాంబు ' అను నమ్మాళ్వారుల విషయమై, వారి ంతరంగ శిష్యు లగు మధుర కవి యాళ్వారులు స్తోత్ర ప్రాయ గా రచించిన పదునొకండు పాశురములు గల దివ్య ప్రబంధమును డెండు వేల సహస్యాయము లనుసంధించిరి అంతలో నాథమునులు గాఁగ నిద్రా పరవశులు కాఁగా - నమ్మాళ్వారు లపుడు నాథ మునులకు స్వప్నమున సాక్షాత్కరించి, కేవలము తాము స్వయముగా ంచిన పాశురములనే గాక, ఆళ్వారు లందఱిచేతను రచింపఁబడిన

పాశురముల నన్నింటిని పూర్తిగా వినిపించిరి[5] నాథమును లపుడు యోగ నిద్రా పరవశత్వమును వీడి, పరమానందభరితులై, ఆ పాశురముల నన్నింటిని సంకలనము గావించి - 'నాలాయిర దివ్య ప్రబంధము' అను పేర నొక గ్రంథ రూపమున రూపొందించిరి. నాటి నుండియు - నాథ మునులు నమ్మాళ్వారులనే తమ యాచార్య చరణులనుగా సంభావించి, వారి దివ్య సందేశముల నహర్నిశములును మననము గావింప సాగిరి.[6] అయినను - నమ్మాళ్వారులతో తమకు ఆచార్య సంబంధము ప్రత్యక్షముగా నేర్పడియుండనందున, మనంబున నొకింత చింతించి, తాము నమ్మాళ్వారుల శిష్య పరంపరలో నొకరగు పరాంకుశ మునుల పాదారవిందములను సమాశ్రయించి యుండుటను బట్టి, తన్మూలమున నే నమ్మాళ్వారులతో తమకు గురు శిష్య సంబంధ మేర్పడినట్లు సంతృప్తి జెంది, ఆ మహానీయుల సన్నిధానమున ద్రావిడ దివ్య ప్రబంధ ప్రాశస్త్యమును సంపూర్ణముగా గ్రహించి, సంతుష్టాంతరంగులు కాఁగల్గిరి. నాథ మునుల దీక్షా దక్షతల నిందుమూలమున నే మనము సులభముగా గ్రహింపవచ్చును.

నాథ మునులు సంస్కృత తమిళ భాషలలో నుద్దండ పండితులుగా సుప్రసిద్ధులు అయినను - పన్నిద్ద రాళ్వారులచే రచింపఁబడిన పాశురముల నన్నింటిని గాన యోగ్యములుగా రూపొందించు

---

5 History of Sri Vaishnavas

— T A Gopinatha Rao, p 8

మఱియు —

తిరుమల తిరుపతి దేవస్థానముల మాస పత్రిక (Vol IX No 3) లో — 'శ్రీవైష్ణవ దర్శనమున రహస్య సంప్రదాయము' అను శీర్షిక గల వ్యాసము

— వ్యాసకర్త విద్వాన్ శ్రీ సుదర్శనాచార్య శిరోమణి

6 History of Indian Philosophy

— Dr S N. Dasgupta, Vol III, (2nd Edition) p 94

టకై, వారెంతయో పరిశ్రమ చేయవలసి వచ్చెను. ఆ పాశురములను లోకమున ప్రకాశింపజేసి, వానిలోగల భక్తి భావములను ప్రజలందఱి హృదయములందును హత్తుకొనజేయవలె నని వారి సంకల్పము అట్టి మహా సంకల్పముతోడనే వారంతటి పనికి పూనుకొని, తమ పరిశ్రమ సార్థకము కావలె నని దీక్ష వహించి, మొదట - శ్రీరంగ క్షేత్రమున గల శ్రీ రంగనాథాలయములో ద్రావిడ దివ్య ప్రబంధాధ్యయనమునకు ప్రారంభోత్సవము గావించుచు, ఆ దివ్య ప్రబంధాధ్యయనము ప్రతి నిత్యము నిర్ణీత సమయములలో నిర్విఘ్నముగ జరుగుటకు తగిన ఏర్పాటుల గావించిరి ఆ సందర్భమున - పాశురములను శ్రవణానందముగ గానము చేయుటకై, ప్రత్యేకముగ కొందఱు గాయకులను నియమించిరి అట్టి గాయకులే నేడు 'అరయరులు' అని వ్యవహరింపబడుచున్నారు[7]

శ్రీ వైష్ణవ క్షేత్రములలో - 'తిరువరంగమ్' అనబడు శ్రీరంగమే యగ్రగణ్యమైన దనియు, ఆ క్షేత్రమున గల 'పెరియ కోవిల్' అనబడు పెద్ద దేవాలయమే ప్రముఖమైన దనియు ప్రాచీన కాలము నుండియు లోకమున నొక ప్రతీతి యున్నది కావుననే, క్షేత్ర ప్రసిద్ధమైన శ్రీరంగనాథాలయములో ద్రావిడ దివ్య ప్రబంధాధ్యయనము ప్రారంభమైన నాటినుండియు - దేశమున గల వైష్ణవాలయములందును, వైష్ణవ గృహములందును ఆ దివ్య ప్రబంధాధ్యయనము కాల క్రమమున నుపక్రమింపబడసాగెను.

సంస్కృత భాషామయములైన వేద ఋక్కుల వలెనే - ఆళ్వారుల తమిళ పాశురములను సైతము గాన యోగ్యములుగా

7 The Hymns of Alvars

నాథ మునులు సిద్ధ మొనరించి యున్నందున, పాశురములను గానము చేయువారును, శ్రవణము గావించువారును గూడ బ్రహ్మానంద భరితు లగుచు, ఆ పాశుర సముదాయమును ద్రావిడ వేదముగా సంభావింప దొడంగిరి ఆళ్వారులచే ప్రసాదింపబడిన ఆ ద్రావిడ వేదము - 'అరుళిచ్చెయల్' (అనుగ్రహ పూరిత మైన శ్రీ సూక్తి) అను విఖ్యాతి గాంచి యున్నది కావున, అట్టి నాలాయిర దివ్య ప్రబంధమునందలి కవితల నొకింత పరిశీలించి, వానిలోఁ గల స్వారస్యమును గ్రహింతముగాక !

**పొయిగై యాళ్వారుల రచనలు -**

ఆళ్వారుల పరంపరలో మొదటి మువ్వురును - 'ముదలాళ్వారులు' అని వ్యవహరింపఁబడుట పరిపాటి ఈ మువ్వురిలో పొయిగై యాళ్వారులు - ఆది కవిగా విఖ్యాతి గాంచియున్నారు [8] ఈ యాది కవిచే రచింపఁబడిన నూఱు పాశురములు - ముదల్ తిరువన్దాగి' యను పేర, దివ్య ప్రబంధమునందు - 'ఇయుఱ్పా' విభాగమున పొందుపఱుపఁబడియున్నది ఈ పాశురములు - అన్దాది' అను ఛందముతో రచింపఁబడినవి అన్దాది ఛంద మనఁగా, మొగటి పాశురపు చివరి పదమును తరువాతి పాశురపు ఆది పదముగా ప్రయోగించునట్టి ఒకానొక కవితా విశేషము కాఁగా - 'తిరు' అను శబ్దమునకు - లక్ష్మి, కాంతి, సుందరము, సంపద, పూజ్యతి అను అయి దర్థము లున్నవి 'ముదల్' అనఁగా - 'మొదలు' (మొదటిది) అని అర్థము కనుక - 'ముదల్ తిరువన్దాది' యను శీర్షికకు తాత్పర్యము పుడు సుబోధకము

ఈ 'ముదల్ తిరువన్దాది' లో ముఖ్యముగా - భక్తి తత్త్వము, తాత్త్విక రహస్యములు మున్నగునవి విశదీకరింపఁబడి యున్నవి ఈ

8 ఆళ్వార్ కాల నిలై
—ప్రొఫెసర్ . యం రాఘవ అయ్యంగార్, 89 ఎట.

దివ్య ప్రబంధములో - భక్తి మార్గ మొకటియే ముక్తికి సులభమైన మార్గ మని ప్రస్ఫుటీకరింపబడి యున్నది. కృష్ణుని బాల లీలలో ఈ కవి హృదయము లీన మైనట్లు - ఈ ప్రబంధమునం గల కొన్ని పాశురముల మూలమునను తెలియుచున్నది మఱి కొన్ని పాశురములలో - తిరువరంగమ్ ( శ్రీ రంగము ), తిరు వేంగడమ్ ( తిరు మల ) మొదలగు దివ్య క్షేత్రములలో వెలసియున్న విష్ణు సంబంధములైన అర్చామూర్తులు సంస్తుతింపబడినవి

## పూదత్తాళ్వారుల రచనలు -

'తిరువన్దాది' ఛందముతో పూదత్తాళ్వారులచే రచింపబడి నూఱు పాశురములు - 'ఇరణ్డామ్ తిరువన్దాది' యను పేర, దివ్య ప్రబంధములో - 'ఇయఱ్పా' విభాగమున చేర్చబడి యున్నవి ఇంచు ఈ యాళ్వారుల హృదయ కుహరమునుండి వెలువడిన భావనా ఝరులు - అను భూతి మయములుగా మనకు గన్పట్టుచుండును ఈ పాశురములలో ముఖ్యముగా - భగవ ద్వైభవము, భక్తి ప్రభావము, శరణాగతి ప్రాశస్త్యము మున్నగునవి విశదీకరింపబడియున్నవి మఱియు - విష్ణువుకు సంబంధించిన వివిధావతారములును, సుప్రసిద్ధములైన కొన్ని వైష్ణవాలయములును వర్ణింపబడి యున్న ప్రకృతి సౌందర్య మిందును అభివర్ణింపబడినది

## పే యాళ్వారుల రచనలు -

'తిరువన్దాది' వృత్త విశేషముతో పే యాళ్వారులు రచించి నూఱు పాశురములు - 'మూన్ఱామ్ తిరువన్దాది' యను పేర, దివ్య ప్రబంధము లో 'ఇయఱ్పా' విభాగమునందే చేర్చబడి యున్న పాశురములలో - భక్తి పరవశమైన ఈ యాళ్వారుల హృద స్పష్టముగా మనకు గన్పట్టుచుండును పాషాణ సదృశమైన హృ

మును సైతము ద్రవింపఁజేయఁ గల పాశురము లివి. వీనిని రచించిన వే యాళ్వారులు - వేదములను, ఉపనిషత్తులను, గీతలను, ధర్మ శాస్త్రములను ఎన్నింటినో మథించి, పఠించి, వానిలోఁ గల విజ్ఞాన సంపదను సంపూర్ణముగ నముపార్జించిరి. - ఈ పాశురములవలననే మనకు వ్యక్తిము కాఁగలదు ఈ పాశురములలో - తొత్త్వ రహ స్యము లెన్నియో విశదీకరింపఁబడియున్నవి. మఱియు - విష్ణువుకు సంబంధించిన వివిధావతారములు, ప్రకృతి సౌందర్యము మున్నగు నవియును ఈ ప్రబంధమున వర్ణింపఁబడియున్నవి

**తిరుమళిశై యాళ్వారుల రచనలు** -

ఈ మహనీయులు - తమ భావనా ప్రపంచమునుండి కెల వడిన యనుభూతులను పొందుచుఁ బఱచుచు, అనేక గ్రంథములను రచించి యున్నారు కాని, ఒకా నొకప్పుడు ఏ కారణము వలననో - వీరు తమ రచనల నన్నింటిని కావేరిలో పారవైచి రఁట! అప్పుడా నదీ ప్రవాహమున కొన్ని గ్రంథములు కొట్టుకొనిపోగా - రెండు గ్రంథ ములు మాత్రము మిగిలి తీరమునకుఁ బట్టియుండ, వానిని కావేరీ నది కా సమయమున స్నానార్థ మరుదెంచినవారు కొందఱు భక్త కఱ చిరి అట్లు భక్త కఱుకుఁబడిన గ్రంథములే 'నాన్ముగన్ తిరువన్దాది' 'తిరుచ్చన్ద విరుత్తమ్' అనునవి. ఇవి రెండును దివ్య ప్రబంధమున పొందుపఱుపఁబడి యున్నవి

'నాన్ముగన్ తిరువన్దాది' లో - అన్దాది వృత్తముతో రచింపఁ బడిన తొంబదియాఱు పాశురము లున్నవి పరమాత్మయైన విష్ణువుకు - బ్రహ్మ రుద్రేంద్రాదు లందఱును కింకర ప్రాయులే యని, ఈ దివ్య ప్రబంధమున స్పష్టీకరింపఁబడి యున్నది మఱియు - భగవ ద్వైభ వము, భక్తి ప్రభావము మున్నగు నవియును ఇందు వర్ణింపఁబడి యున్నవి సార రహితమైన సంసారము నసత్యముగా - నిర్భముగా

వింపక, భగవత్పాదారవిందముల నాశ్రయించి, ధ్యానించి, శరణాగతి గావించిన ప్రపన్నులకు లభించు ఆనంద మిం దత్యధికముగా వర్ణింపబడి యున్నది అదియునుగాక, ఈ 'నాన్ముగన్ తిరువందాది' యందును - ప్రకృతి సౌందర్యము రమణీయముగ వర్ణింపబడి యున్నది

'తిరుచ్ఛంద విరుత్తమ్' అను ప్రబంధములో - నూట ఇరువది పాశురములు వివిధ రాగ తాళ సహితములై యొప్పారు ఈ ప్రబంధమునందలి పూర్వార్థములో వైష్ణవ ధర్మములు విపులీకరింపబడి యున్నవి ఉత్తరార్థమునందలి కొన్ని పాశురములలో - విరహ వేదనం జెందిన నాయికి, తన ప్రియుని కొఱకు పరితపించు రీతి - తిరుమళిశై యాళ్వారులు తమ ప్రియుండగు భగవంతుని కొఱకు విశేషముగా పరితపించినట్లు వర్ణింపబడి యున్నది.

నాయకీ నాయకుల విరహ వేదనము, భర్తవగు భగవంతునిపై ల యాకాంక్షయు పన్నిద్దరాళ్వారుల రచనలయం దన్నింటియందును సర్వ సాధారణముగా గన్పట్టుచునే యుండును కాని, అట్టి భావ పరంపరలను ప్రకటించు విషయములో - తిరుమళిశై యాళ్వారులే మొదటివా రనియు, ఆ భావ పరంపరలు వారిలో పరిపూర్ణముగ పరాకాష్ఠ నందుకొని యుండె ననియు - 'తిరుచ్ఛంద విరుత్తమ్' అను నీ ప్రబంధము వలననే మనము సులభముగ గ్రహింపవచ్చును

## నమ్మాళ్వారుల రచనలు -

'తిరు విరుత్తమ్', 'తిరు వాశిరియమ్', 'పెరియ తిరువన్దాది', 'తిరు వాయి మొళి' అను పేర్లతో - నమ్మాళ్వారుల నాల్గు రచనలు నాలాయిర దివ్య ప్రబంధమునందు చేర్చబడి యున్నవి ఇవి నాల్గును నాల్గు రత్నము లనియే మనము సంభావింపవచ్చును.

'తిరు విరుత్తమ్' అను ప్రబంధము - ఋగ్వేద సారము
పరిగణింపఁబడి యున్నది. ఇందు నూఱు పాశురము లున్నవి భ
క్తుని భగవంతునిపై నందు భక్తి తాత్పర్యము, తన్మయత్వము
ప్రబంధమున విశేషముగా వర్ణింపఁబడి యున్నది నమ్మాళ్వార
తమ్ము నాయికగాఁ దలంచుకొని, భగవంతుని ప్రియతము నాయకుని
భావించి, తన నాథుని నిమిత్తమై విరహ వేదనతో పరి పరి విధ
ములుగా పరితపించిన సన్నివేశము లిందభివర్ణింపఁబడి యున్నవి నాఁ
తన ప్రియుని యనురాగము నపేక్షించి, ప్రకృతి నంతటిని త
ప్రతికూలముగా దలంచుట, విహ్వలత నందుట, నాయకుని రాక
నిరీక్షించియు ఫలితము గానక, నానాఁటికి కృశించిపోవుట, మేఘము
మూలమునను - పక్షులమూలమునను నాయకునకు తన సందేశమ
నందఁజేయ యత్నించుట, అందువలన ప్రయోజన మేమాత్ర
కలుగనందున - తుదకు తన ప్రాణములను పరిత్యజించుటకు సైత
సాహసించుట ఇత్యాది విషయములతో - ఈ ప్రబంధము మిక్కి
రసవత్తరముగా నొప్పారుచున్నది స్థూల దృష్టితోఁ జూచినచో
ఈ ప్రబంధము లౌకికమైన ప్రేమ తత్త్వమును వర్ణించుచున్నట్టి
ఉత్తమ కావ్యముగాఁ గన్పట్టగలదు కాని సూక్ష్మ దృష్టి
సమాలోకించిన యెడల, నమ్మాళ్వారులు విరహవేదనఁ జెం
నాయిక వలె, భగవంతుని నిమిత్త మెంతెగనో పరితపించి
వ్యక్తము కాఁగలదు కావున, ఈ దివ్య ప్రబంధము మధుర భ
ప్రతిపాదించు గ్రంథములలో ప్రముఖమైనదిగా నాతము సంభావిం
వచ్చును

"తిరు వాశిరియమ్" అను ప్రబంధము లో - ఏడు పాశుర
ములున్నవి ఇది యజుర్వేద సారముగా నెంచఁబడుచున్నది "పె
తిరువన్దాది' లో - ఎనుబది యేడు పాశురము లున్నవి ఈ ప్ర
బంధము అథర్వణ వేదముగా పరిగణింపఁబడుచున్నది ఈ ప్రబం

అథర్వణ వేదముగా పరిగణింపఁబడుచున్నది ఈ ప్రబంధములలో - ఏ కథయును పొంగుపఱుపఁబడి యుండలేదు వీనిలోఁ గల పాశురము లన్నియు భక్తి వైభవమును వేనోళ్ళ చాటునవియై యున్నవి. మఱియు - భగవంతుని భువన మోహన సౌందర్యము, కల్యాణ గుణములు మున్నగునవి మనోహరముగా వీనిలో వర్ణింపఁబడి యున్నవి

'తిరు వాయి మొళి' యను ప్రబంధము - కేవలము నమ్మాళ్వారుల గ్రంథ చతుష్టయమునందే గాక, ఆళ్వారుల ప్రబంధము లన్నింటియందును అగ్రగణ్యమైనది అంతియ కాదు - తమిళ వాఙ్మయ ప్రపంచమునందే గాక, ఏ భారతీయ భాష యందును ఇంతటి యుత్తమ గ్రంథము వెలువడియుండలే దనుట - అతిశయోక్తి కానరదు ఈ మహా గ్రంథము దివ్య ప్రబంధములలో నొక ప్రత్యేక విభాగముగ సంశోభించుచున్నది

'తిరు వాయి మొళి' యనఁగా - 'మహనీయుని వాక్కు నుండి వెలువడిన దివ్య వాణి' అని యర్థము 'వాయి మొళి' అను శబ్దము ప్రాచీనమైన తమిళ వాఙ్మయములో - 'వేదము' అను అర్థము నిచ్చు శబ్దముగా ప్రయోగింపఁబడి యున్నది[9] కావుననే, ఈ 'తిరు వాయి మొళి' - వేద తుల్యముగా గౌరవింపఁబడుచున్నది. సామ వేద సార మంతయు - ఈ ప్రబంధములో నిమిడియున్న దని, సంప్రదాయ వేత్తల నిశ్చితాభిప్రాయము.

ఈ 'తిరు వాయి మొళి' ప్రబంధమునందు 1, 102 పాశురము లున్నవి ఇవి - వివిధ రాగ తాళములతో, గానము చేయుట కనువుగా రూపొందింపఁబడి యున్నవి ఈ ప్రబంధ మంతయు శతకము

9. జ్ఞాన శిఖరమ్

లుగా విభాగింపఁబడి, ఒక్కొక్క శతకము పది దశకములుగా విభాగింపఁబడి యున్నది ప్రతి దశకమునందును చివఱ - పదునొకండవ పాశురములో - 'ఫల శ్రుతి' చెప్పఁబడినది. ఈ ప్రబంధమున - భక్తి ప్రపత్తులు, ఆచార్య ప్రభావము మున్నగు విషయము లనేకములు వర్ణింపఁబడియుండుటే గాక, ధర్మ మర్మము తెల్పెడి నవి విస్తరముగా వివరింపఁబడి యున్నవి ఈ దివ్య ప్రబంధమునందున అనేక దశకములలో - జీవాత్మ పరమాత్మల నడుమగాఁ గల నాయికా నాయకుల సంబంధము మిగుల మనోజ్ఞముగ వర్ణింపఁబడి యున్నది.

తమిళ వాఙ్మయ ప్రపంచమున నమ్మాళ్వారులకు లభించి యున్నంతటి యున్నత స్థానము - మఱి యెవరికిని లభించియుండి లేదు. వీరి దివ్య ప్రబంధములలో ప్రతిపాదింపఁబడిన సిద్ధాంతములే - శ్రీ వైష్ణవ మతమునకు వన్నెను, వాసిని చేకూర్చియున్న వస్తు - నిర్వివాదాంశము. ఏక గ్రీవముగా సర్వులును సమ్మతింపవలసి యంశ మిది కావుననే - వైష్ణవ లోకము నమ్మాళ్వారులను 'శ్రీ వైష్ణవ కుల పతి' యను బిరుదముతో గౌరవించి, వారియందు తనకుఁ గల అచంచలములైన భక్తి ప్రపత్తులను శ్లాఘించి యున్నది. అదియునుఁ గాక, నమ్మాళ్వారులు - 'తమిళ వేద ప్రణేత' లనియు 'తమిళ వేద వ్యాసు' లనియు ప్రశంసింపఁబడుచున్నారు[10]

నమ్మాళ్వారులను ప్రస్తుతించుచు - అనేకు లనేక గ్రంథములను రచించి యున్నారు. అట్టి ప్రశంసా గ్రంథములలో - నమ్మాళ్వారుల శిష్య రత్నముగా విఖ్యాతి గాంచిన మధుర కవి యాళ్వార 'కణ్ణినుణ్ శిరుత్తాంబు' అను దివ్య ప్రబంధము మొట్టమొదట నాట్లుంకిం దగినది. అటుపిమ్మట - ఆచార్య హృదయము, పాదుగా సహస్ర ద్రావిడ ఉపదేశ రత్నావళి, శఠకోపరన్దాది, ఆళ్వార్ అనుభూ

10 జ్ఞాన శిఖరము — పి శ్రీ ఆచార్య, 96 పు

దివ్య సూరి చరితము మున్నగు గ్రంథములు ముఖ్యములుగా పరిగణింపదగి యున్నవి. ఇవియు - బ్రహ్మాండ పురాణము, భవిష్యత్పురాణము, మార్కండేయ పురాణము మున్నగు గ్రంథములందును నమ్మాళ్వారుల యవతార ప్రాశస్త్యమును గురించి విస్తారముగ ప్రస్తావింపబడి యుండుటచేతను - నమ్మాళ్వారుల మహా ప్రభావమును మనము సులభముగా గ్రహింపవచ్చును.

ఏ తింత్రిణీ కోటరమును నివాసస్థానముగా నేర్పఱచుకొని, దివ్యమైన తన జ్ఞాన తేజమును నమ్మాళ్వారులు దిగంతముల వఱకు ప్రసరింపజేసిరో - ఆ తింత్రిణీ మహా వృక్షము నేటికిని 'ఆళ్వార్ తిరునగరి'లో - సురక్షితముగా నుండి, దిదృక్షువులను విస్మయ చకితులగా నొనరించుచునే యున్నది[11]

నమ్మాళ్వారుల దివ్య ప్రబంధములు నాల్గును గలిసి - 'ద్రావిడ వేద సాగరము' అను ప్రఖ్యాతి నార్జించుకొని యున్నవి[12] భగవద్రామానుజులు బ్రహ్మ సూత్రములపై 'శ్రీ భాష్యము'ను రచించునపుడు, నమ్మాళ్వారుల దివ్య ప్రబంధములు చాల వఱకు తోడుపడినట్లు తెలియుచున్నది[13] అదియునుగాక, శ్రీ వేదాంత దేశికులును - నమ్మాళ్వారుల దివ్య ప్రబంధములనుండియే వేద రహస్యములను గ్రహించినట్లు విశదమగుచున్నది

11 జ్ఞాన శిఖామణి — పి. శ్రీ ఆచార్య, 94 పుట

12 జ్ఞాన శిఖరము — పి. శ్రీ ఆచార్య, 100 పుట

3 "It is 'Tiruvaymoli' that has shaped the furniture of 'Sri Ramanuja's Capacious mind and heart"

చార్య (గురు) లక్షణము, భక్తి ప్రపత్తుల ప్రాముఖ్యము మొద
ు విశిష్ట విషయములు గూడ విశదీకరింపఁబడి యున్నవి. ఈ
ణ్ణినుణ్ శిరుత్తాంబ్బ'ను అధ్యయనము గావించిన పిమ్మటనే -
రు వాయి మొళి' దివ్య ప్రబంధ మనుసంధింపఁబడుట పరిపాటిగా
న్నది

కులశేఖరాళ్వారుల రచనలు :-

ఈ మహనీయులు తమిళ భాషలో నొక గ్రంథమును,
ంస్కృత భాషలో నొక గ్రంథమును రచించి యున్నారు ఇందలి
మిళ గ్రంథము - 'పెరుమాళ్ తిరు మొళి' యను పేర, నాలాయిర
వ్య ప్రబంధమున పొందు పఱుపఁబడి యున్నది ఇందు - 105 పాశు
ము లున్నవి ఇవి తమిళ భాషా మయము లగుటచే, నాలాయిర
వ్య ప్రబంధమున ప్రకాశింపఁ జేయఁబడినవి కాని, సంస్కృత
చన మాత్రము ఇందు చేర్చఁబడియుండ లేదు.

'పెరుమాళ్ తిరు మొళి' యందలి పాశురములు - దశకము
లుగా విభాగింపబడియున్నవి శ్రీ రంగమునఁ గల భక్తులతో గలసి,
ృత్య సహితముగా భగవ న్నామ సంకీర్తనము గావింపవలె నన్న
భిలాషయు, రా నున్న జన్మలో శ్రీ వేంకటాచలమున మఱల
రూపమున నైనను జన్మింపవలె నన్న యాకాంక్షయు తమకు గాఢ
ుగ గల దని కులశేఖరాళ్వారు లీ దశకములలో స్పష్టీకరించి
యున్నారు. ఎనిమిదవ దశకములో -తనయుఁ డైన దశరథ రాముఁడు
ి తనమున నుండఁగా - రాముని వన వాస గమన కారణముగా
శరథుఁడు విలపించుట ఇత్యాది ఘట్టములు వర్ణింపఁబడి యున్నవి.
పది దశకములో - రామాయణ గాథ సంగ్రహముగా పొందు
ఱుపఁబడి యున్నది. ఈ ప్రబంధమునఁ పాశురము లన్నియు -

భావ మధురమ్ములై, పాఠకుల హృదయములను ద్రవింపఁజేయ నవిద్యై యున్నవి.

కులశేఖరాళ్వారుల రెండవ రచన - సంస్కృత భాషా మయము లైన నలుపది శ్లోకములతో 'ముకుంద మాల' యను పేర విశ్వ విఖ్యాతి నార్జించి యున్నది. కులశేఖరాళ్వారులకు సహజ సిద్ధముగాఁ గల కవితా సంపదను — ఈ 'ముకుంద మాల' మూలముననే మనము సులభముగాఁ దెలిసికొనవచ్చును. ఇందలి దివ్య సందేశములు భక్తి ప్రబోధ సంభరితములు. భావ పరంపరలు భక్తిలోక శుభంకరములు. శ్లోకములు మధురాతిమధురములు. కనుకనే, ఈ 'ముకుంద మాల'- సంస్కృత వాఙ్మయ ప్రపంచమున మహోన్నత స్థాన మాక్రమించు కొనఁ గల్గినది. భారతీయ భాషలలో దాదాపుగా నన్నింటియందును ఈ 'ముకుంద మాల' అనువదింపఁబడి యుండుటను బట్టి, ఈ గ్రంథ ప్రాశస్త్యము సుస్పష్టము. ఈ ముకుంద మాలపై 17-వ శతాబ్దములో 'రాఘవానంద' అను నొక ప్రముఖ విద్వాంసుఁడు విపులమైన టీకను రచించుచు, అందు - ముకుంద మాల, కేవలము తిరు మంత్ర ముగా ప్రసిద్ధి జెందిన నారాయణాష్టాక్షరీ మహా మంత్ర ప్రభావ మును విస్పష్టముగా చాటుచున్న దని, ఆ విద్వాంసుఁడు వేనోళ్ళ కొనియాడి యున్నాడు[14] 'ముకుంద మాలా తాత్పర్య దీపిక' అను పేరు గల ఈ గ్రంథ రాజము - దేశమందంతటను ప్రశంసల నందు కొని యున్నది.

పెరియాళ్వారుల రచనలు -

'విష్ణు చిత్తులు' అను పేర సుప్రసిద్ధులైన పెరియాళ్వారుల రచనలు - 'తిరు ప్పల్లాణ్డు', 'పెరియాళ్వార్ తిరు మొళి' అను

14 శ్రీ ముకుందమాల (భూమికా భాగము)
శ్రీ కె రామపిశారటీ,
ప్రకాశకులు — ఆన్ధ్ర విశ్వ విద్యాలయము.

పేర్లతో నాలాయిర దివ్య ప్రబంధమునందు మొదటి భాగములో (ముదలాయిరమున) చేర్చబడ యున్నవి

'తిరు ప్పల్లాణ్డు' అను రచనలో - పన్నెండు పాశురము లున్నవి గరుడ గమనుఁడైన భగవానుని గురించి మంగళాశాసనము గావించుచు, పెరియాళ్వారులచే గానము చేయఁబడిన గీతములే యివి అసదృశమైన భగవానుని భువన మోహన సౌందర్యము నిరంతరము నిత్య నూతనమై, ప్రకాశించుచుండవలె నని, పరమ భక్తాగ్రగణ్యులైన పెరియాళ్వారులు - గరుడ వాహనారూఢుఁడై, తమకు దివ్య సందర్శన భాగ్యమును ప్రసాదించిన భగవంతునకు తమ శుభాకాంక్షల దెలుపుటయే యిందలి ప్రధానాంశము ఈ సందర్భమున, భగవంతుని వివిధావతారములు సైతము పెరియాళ్వారులచే ప్రస్తుతింపఁబడినవి భక్తులైనవారు - తమ జీవితమును భగవత్సేవయందే గడుపుట శ్రేయస్కర మని పెరియాళ్వారు లిం దొక దివ్య సందేశము నొసంగి యున్నారు నాలాయిర దివ్య ప్రబంధములో ఈ 'తిరు ప్పల్లాణ్డు' కు మిక్కిలి ప్రాముఖ్య మున్నది నిత్యానుసంధానములో ఈ తిరు ప్పల్లాణ్డు - ప్రముఖ స్థాన మాక్రమించి యున్నది దీనిని శ్రీ వైష్ణవ సంప్రదాయులు ప్రణవ తుల్యముగా సంభావించి, ప్రతి దినమును భక్తి శ్రద్ధలతో ననుసంధించుచుండుట పరిపాటి

'పెరియాళ్వార్ తిరు మొళి'లో - 461 పాశురము లున్నవి. ఈ పాశురములలో - బాల కృష్ణుని మధుర లీలలు మనోహరముగా నభివర్ణింపఁబడి యున్నవి ఈ ప్రబంధములో పెరియాళ్వారులు ప్రదర్శించిన వాత్సల్య భావములు - అత్యద్భుతము లైనవి. పరాకాష్ఠ నందిన ఇట్టి వాత్సల్య భావములు - ఈ ప్రబంధమునఁ దప్ప,

తమిళ వాఙ్మయ ప్రపంచమున మ ఱెచ్చటను కానరా దనుట - అతి శయోక్తి కానేరదు

ఈ ప్రబంధములో - కృష్ణుని జన్మ దినోత్సవము, గోకుల ములో హర్షోల్లాసములు, కృష్ణుని నిద్ర బుచ్చుచు - యశోద జోల పాడుట, కృష్ణుని సముదాయించుచు చంద మామను బిలుచుట, కృష్ణుని కర్ణ వేధ సంస్కారము, కృష్ణునకు దృష్టి దోష పరిహారము, కృష్ణుఁడు వెన్నను తస్కరించుట, కృష్ణుని యాగడములను గోపికలు యశోదతోఁ జెప్పుట, కృష్ణుఁడు ఆవులను మేపుటకై అరణ్యమునకు వెళ్ళిన పిమ్మట - తల్లియైన యశోద విలపించుట, కృష్ణుని భువన మోహన సౌందర్యమునకు ముగ్ధులై, గోపికలు మోహముఁ జెందుట, కృష్ణుని వేణు గాన మాధుర్యము మున్నగు అనేక సన్నివేశములు మిగుల హృదయంగమములుగా వర్ణింపఁబడి యున్నవి అందునను బాల కృష్ణుఁడు మారాము చేయుట, హర్షముఁ జెందుట, విలపిం చుట మున్నగు సన్నివేశములను పెరియాళ్వారులు సహజ సుందర ముగా నిందు చిత్రించి యున్నారు శైశవావస్థలోఁ గల కృష్ణుని వివిధ చేష్టలను బహు రమణీయముగ వర్ణించియున్నారు చిరకాలము నుండియు తల్లులు తమ తమ పిల్లల నాడించునపుడు - పాలు త్రావించు నపుడు-నిద్ర బుచ్చునపుడు - ముద్దులాడునపుడు పాడెడు పాటలకు వాఙ్మయ ప్రపంచమున, పెరియాళ్వారులు ప్రముఖ స్థాన మునుఁ గల్పించి, చిర స్మరణీయులు కాఁగల్గిరి 'పిళ్ళైత్తమిళ్' అని వ్యవహరింపఁబడు ఈ పాటలకు - తగిన బాణులను (Stails) రూపొందించుటలో పెరియాళ్వారులే మొదటివారై, అఖండమైన విఖ్యాతిని పొందఁగల్గిరి పెరియాళ్వారుల యనంతరము కవు లనేకులు విశిష్టమైన ఈ 'పిళ్ళైత్తమిళ్' కావ్య శైలి ననుకరించుచు, గీతముల నెన్నింటినో రచించి యున్నట్లు తెలియు చున్నది.

**ఆండాళ్ రచనలు -**

ఆండాళు - ఒక మహా భక్తురాలే గాక, ఒక మహా కవయిత్రి కూడ గోదా దేవిగా ప్రసిద్ధి గాంచిన ఈ మహా భక్తురాలి రచనలు - కేవలము తమిళ వాఙ్మయమునకే గాక, సకల భారతీయ వాఙ్మయమునకును గౌరవమును చేకూర్చియున్న వనుట సత్య దూరము కాదు ప్రాచ్య పాశ్చాత్య పండితులు, తత్త్వ శాస్త్ర వేత్తలు మున్నగు వారనేకులు - ఆండాళ్ రచించిన కావ్యముల లోని సాధురాతి మధురములైన భావ పరంపరలను పరిశీలించి, ఆశ్చర్య చకితులై, ఆ కావ్య రత్నముల నెంతగనో ప్రస్తుతించి యున్నారు అట్టి కావ్య రత్నములే - 'తిరుప్పావై', 'నాచ్చియార్ తిరు మొళి' యను పేర్లతో - నాలాయిర దివ్య ప్రబంధమున చేర్చ బడి యున్నవి

'తిరుప్పావై'లో ముప్పది పాశురములున్నవి ఇవి - వివిధ రాగ తాళములతో గానము చేయుట కనువుగా నొప్పారుచుండును. మాసములలో శ్రేష్ఠతమమైన మార్గశీర్ష మాసమున నవ యువతులు యోగ్యులైన వరులను బొందుటకై నియమ యుక్తముగా నాచరించు 'మార్గళి నోము'కు సంబంధించిన విశేషము లిందు వర్ణింపబడి యున్నవి ఈ వ్రతము కేవలము స్వయముగా నాచరించినవారికే గాక, దేశమునందు గల ప్రజ లందఱకును మేలు చేకూర్చు ననియు, సకాలమున వర్షములు వర్షించి, సస్యములు సమృద్ధిగా ఫలించి పాడి పంటలతో దేశము సుభిక్షముగా నుండగల దనియు ఇందు స్పష్టీకరింపబడి యున్నది.[15]

---

10 ''ఓఙ్గి యులగళన్ద వుత్తమన్ పేర్ పాడి
నాఙ్గళ్ న మ్పావైక్కు చ్చాత్తి నీరాడినాల్
తీఙ్గిన్ఱి నా డెల్లామ్ తిఙ్గళ్ ముమ్మారి పెయ్దు
ఓఙ్గు పెరుఞ్జెన్నెలూడు కయలుగళ ''

— తిరుప్పావై, 3

దేశ కాల పాత్రతలను పరిగణింపక, ఆండాళు - తాను కగా భావించుకొని, సఖీ జనముతోఁ గూడి, తన యిష్ట దైవ కృష్ణుని సాన్నిధ్యమునకు వ్రత ఫల ప్రాప్తికై బయలు మున్నగు విషయములు - ఈ 'తిరుప్పావై'లో విశదీకరిం యున్నవి. ఆ మహా భక్తురాలు – సహజ సిద్ధమైన తన భక్తి మును విస్పష్టముగా నిండు పొందు కలిచుటయే గాక, త నము లైన గ్రామ జీవన విధానములను సైతము రమణీయ వర్ణించియుండుటను బట్టి, ఆమె దృక్పథము సుస్పష్టము. ఈ ప్పావై' దివ్య ప్రబంధమునఁ గల ముప్పది పాశురములు - వ మాసమున శ్రీ వైష్ణవ గృహములలో శ్రవణానందముగ గ చేయఁబడుచున్నవి. శ్రీ వైష్ణవ సంప్రదాయులగు వివిధ వ వారెల్లరును ఈ దివ్య ప్రబంధమును భక్తి శ్రద్ధలతో అన చుచు, ఆత్మానందము నందుచుందురు. ఈ దివ్య ప్రబంధమ గోదా దేవిచే ప్రతిపాదింపఁబడిన మార్గళి వ్రతము - కేవలము భారతమునందే గాక, సుదూరముగాఁ గల ఉత్తర భారతమున ఆచరింపఁబడుచుండుట - గమనావశ్యకమైన యంశము[16]

'నాచ్చియార్ తిరుమొళి'లో - నూట నలువది ం పాశురములు వివిధ రాగ తాళములతో, గానము చేయుటక నున్నవి. జగన్మోహనుఁడైన కృష్ణునకు తాను ప్రియురా దలంచుకొని, అట్టి ప్రేమాతిశయముతో ఆండాళ్ రచించి రములే యివి. శ్రీకృష్ణుని యందు తనకుఁ గల యనురా మన్మథునకుఁ దెలుపుట, కోకిలలతో - మేఘాదులతో కృష్ణు సందేశములను బంపుట, కృష్ణుని రాకకై పరితపించి ప్రార్థి

16 'Voice and Vision of Andal'

— P. S. Acharya's Souvenir — All India Writers Conferance, 1959.

స్వప్నమున మాధవునితో వివాహ మాడుట, కృష్ణునితో సంయోగ వియోగము లేర్పడుట మొదలగు విషయములు ఈ పాశురములలో వర్ణింపఁబడి యున్నవి ఈ ప్రబంధమునఁ గల 'వారణ మాయిరమ్' అను దశకము - వైష్ణవ గృహములలో, వివాహ మహోత్సవ సందర్భమున గానము చేయుట - పరిపాటిగా నున్నది ఇయ్యది ఒక విశేష విషయముగా గమనింపఁదగినది

**తొండరడిప్పొడి యాళ్వారుల రచనలు :-**

వీరు రచించిన రెండు గ్రంథములు - 'తిరు మాలై' 'తిరుప్పళ్ళి యెళుచ్చి' యను పేర్లతో నాలాయిర దివ్య ప్రబంధమునందు చేర్పబడి యున్నవి

'తిరు మాలై' యనఁగా - 'పవిత్రమైన మాల' అని యర్థము ఇందు - నలువది యైదు పాశురము లున్నవి. ఈ పాశురములలో ననేకములు ఆత్మ నివేదన పరములై యొప్పారు చుండును భగవత్సన్నిధానమున తొండరడిప్పొడి యాళ్వారులు తమ దైన్యమును ప్రకటించుచు, తమను దాసానుదాసునిగా స్వీకరింపవలసిన దని ప్రార్థించిరి ఈ ప్రబంధమున భక్తి వైభవము విశేషముగా వర్ణింపఁబడి యున్నది ఇందలి కవితా శిల్పము అనన్యాదృశమై, మనోహరమై యలరారు చుండుటనుఁబట్టి, ఈ తొండరడిప్పొడి యాళ్వారులకు సహజ సిద్ధముగాఁ గల కవితా నైపుణ్యమును మనము సులభముగా గ్రహింపవచ్చును

తమిళ నాఁడులో - 'తిరు మాలై అఱియాన్' అను నొక లోకోక్తి యున్నది అనఁగా - 'తిరు మాలై' యను పేరు గల దివ్య ప్రబంధ మెఱుఁగనివాఁడు - తిరు మాల(విష్ణువు)ను తెలియఁజాలఁడని యర్థము ఇందువలన - 'తిరు మాలై' ప్రబంధ వైశిష్ట్యము సుస్పష్టము

ప్రసిద్ధమై యున్నది ఇందువలన, ఈ ప్రబంధ ప్రభావము ...భ గ్రాహ్యము

## తిరుమంగై యాళ్వారుల రచనలు :

నాలాయిర దివ్య ప్రబంధమును సావధానముగ పరిశీలించినచో తిరు మంగై యాళ్వారులు రచించిన పాశురములే అధిక సంఖ్యలో నున్నట్లు మనము గ్రహింపగలము ఈ పాశురము లన్నియు వివిధ రాగ తాళములతో సమకూర్పబడి యున్నవి తిరు మంగై యాళ్వారులు రచించిన ఆఱు ప్రబంధములు - పెరియ తిరు మొళి, తిరు కుఱుందాండకమ్, తిరు నెడు న్దాణ్డకమ్, తిరు వెళు కూత్తిరుక్కై, సిఱియ తిరు మడల్, పెరియ తిరు మడల్ అను పేర్లతో నొప్పారుచున్నవి ఇవి యాఱును వేదాంగములుగా సంభావింపబడుచున్నవి పెరియ తిరుమొళిలో 1084 పాశురము లున్నవి తీర్థ యాత్రగా పర్యటించుచు - తా మనేక దివ్య క్షేత్రములలోని యర్చామూర్తులను సందర్శించినపుడు, తిరు మంగై యాళ్వారు లిందలి కొన్ని పాశురములలో సంస్తుతించి యున్నారు తాము యౌవన దశలో గావించిన దుష్కృత్యములకు మిగుల వగచుచు భగవచ్చరణారవిందములయందు ఆత్మ సమర్పణము గావించిన వృత్తాంతమును సైతము - తిరుమంగై యాళ్వారు లీ ప్రబంధమున నంగీకరించి యున్నారు అనేక ఆత్మిక రహస్యములతోఁ గూడిన యీ ప్రబంధము - నిత్యానుసంధాన యోగ్యముగా నొప్పారుచున్నది

'తిరు కుఱుందాండకమ్' అను ప్రబంధములో - ఇరువది పాశురము లున్నవి తిరు నెడు న్దాణ్డకమ్' అను ప్రబంధములో ముప్పది పాశురము లున్నవి సాంసారికమైన మోహ బంధము నుండి విడువడి పరమ కారుణికుఁడైన భగవంతుని శరణు వొందుట వలనఁ గల్గు ప్రయోజనము వీనిలో విశదీకరింపబడి యున్నది



# ఆళ్వారుల భక్తి సిద్ధాంత ప్రాశస్త్యము

ఆంగ్ల మూలము

డాక్టర్ : జి టి గోపాల కృష్ణ నాయుడు

ఆంధ్రానువాదము :

'బాల విద్యా శ్రీ'

శ్రీమాన్ కె.వి.వి.యల్ నరసింహాచార్యులు, ఎం.ఏ., బి.ఇడి



## ఆళ్వారుల భక్తి పరిశీలనము

### ఆరంభ వాక్యము -

భారత దేశమున సామాన్యముగను, దక్షిణ భారతమున విశేషముగను బ్రహ్మ వాదములు కొన్ని శోభిల్లినవి. ఈ బ్రహ్మ వాదములను ఆళ్వారులు తమ దివ్య ప్రబంధములలో ప్రస్తావించినారు. భగవద్గుణానుభవ ప్రేరకములగు స్తోత్రములనేకములు అత్యంత మనోహరమగు శైలిలో గానము చేసిరి

### విశిష్టాద్వైతము -

అనుభవరూపములగు ఆళ్వారుల దివ్య గానములు - విశిష్టాద్వైత సిద్ధాంత పరిపోషకములుగా విరాజిల్లినవి. ఈ విశిష్టాద్వైత సిద్ధాంతము వారి యనంతరము శ్రీ భగవద్రామానుజులచే ప్రతిష్ఠాపిత మై

*దివ్య ప్రబంధ నిర్మాణ ప్రవీణులు -*

పరగు భాగవత శిఖామణు లగు ఆళ్వారుల ప్రభావము మన సాంఘిక వ్యవస్థపై, చెరగని ముద్ర వైచినది. వారి భగవద్గుణానుభవములు, పవిత్ర జీవితములు, భక్తి ప్రపత్తులు మానవాళికి తేజోమయ మార్గ దర్శకములై వెలువారినవి. 'ముదలాళ్వారులు' అను ప్రసిద్ధి గాంచిన పొయిగై - పూదత్తు - పే యాళ్వారులు ముగ్గురును, నాలాయిర దివ్య ప్రబంధ నిర్మాణమునకు శ్రీకారము చుట్టిన మహానీయులు. వారి 'అందాది' దివ్య ప్రబంధ త్రయము సకల లోకమునకు బ్రహ్మానంద సంధాయకము. వారి యనంతరము, భక్తిసారాఖ్యు లగు తిరుమళిశై యాళ్వారులు - తమ పాశురము లందు శ్రీ వేంకటేశ్వర పాద పద్మ సంనిహితుఁ డగు కాకా శకాంసమిచే శాపాద్యంతర సంతమసము నిర్మూలింపఁ బడుట కీర్తించిరి. పరాంకుశ దయా పూర్ణ హృదయులు - కవి పుంగవులు నగు నమ్మాళ్వారులు - సంసారార్ణవ మగ్ను లగు మానవులపై, కరుణామృత వర్షమును కురిపించిన మహనీయులు. మధుర కావ్య రచనా ధురంధరు లగు మధుర కవి యాళ్వారులు - నమ్మాళ్వారులను ఆరాధించి తరించిరి. మఱియు - 'గురుం ప్రకాశయే ద్ధీమాన్' అను ఉక్త్యనుసారము - గురు గుణానుభవము గావించి, శిష్య ధర్మమును నిరూపించిరి. కుల శేఖరాళ్వారులు - సీతాపహరణ దోష దూషితుఁ డగు రావణునితో యుద్ధ మొనరించుటకు సన్నద్ధులైరి. గుణ వృద్ధు లైన పెరియాళ్వారుల శిష్య పుత్రిక యగు గోదా దేవి - శ్రీ రంగ నాథ విరహ వేదనా దోదూయమాన మానసయై, పరమ పద నాథునే పరిణయ మాడెను. భక్తాంఘ్రి రేణులుగ ప్రఖ్యాతిఁ గన్న తొండరడిప్పొడి యాళ్వారులు - శ్రీ రంగ నాథ గుణానుభవము గావించి, సదా పరమ పద సనాథ సాన్నిధ్యమునే యాకాంక్షించిరి. తిరుప్పాణాళ్వారులు

శ్రీరంగ నాథ దివ్య సౌందర్యమును పాదాది కేశాంతము తమ పాశురములలో తనివి దీర అభివర్ణించి, తన్మయులై, ధన్య జీవులై, ఆ పరాత్పరునియందే లీన మైరి తిరుమంగై యాళ్వారులు బహుకాలము భాగవత తదీయారాధనము గావించి, భగవత్కటాక్షమునకు పాత్రులైరి. ఇట్లు చరితార్థులైన పన్నిద్దరాళ్వారులు - తమ దివ్య ప్రబంధములలో - గహన వేదాంత శాస్త్ర రహస్యములను, భగవత్కృపా విశేషములను గాన మొనరించి, చిర యశము గాంచిరి

## శ్రీ వైష్ణవ సిద్ధాంత బీజములు

ఆళ్వారుల దివ్య ప్రబంధములందే, శ్రీ వైష్ణవ సిద్ధాంత బీజములు నిక్షిప్తములై యున్నవి. అర్చా రూపమున వేంచేసి యున్న భగవంతుని వారు తమ పాశురములలో సంస్తుతించిరి. భగవంతుడు ఆ యా యములలో అర్చా రూపముల అంతర్యామి అధివసించియున్నాడని వారి యభిప్రాయము. వారి దృష్టిలో అవి విగ్రహములు కావు సాక్షాత్ పరాత్పరుడే భగవంతుడు ఆలయమందలి అర్చా రూపముల విడనాడి యుండడని వారి అచంచల విశ్వాసము. కనుకనే, దివ్య దేశములను దర్శింప నగునని వారు మానవాళిని ఉద్బోధించిరి. తిరుమంగై యాళ్వారులు ఒక్కరే, తమ దివ్య ప్రబంధ పట్కములో దివ్య దేశముల నెన్నింటినో కీర్తించిరి. పరమాత్ముని పర వ్యూహ విభవ అంతర్యామి అర్చావతారములయందు ఆళ్వారులకు మక్కువ యెక్కువ

## ఆళ్వారుల తత్త్వ సిద్ధాంతము

**పెరియాళ్వారులు** -

'భగవంతుడున్నాడు అతడు పరాత్పరుడు, సర్వాంతర్యామి' యని ఎలు ప్రబోధించుచు, 'భగవన్! నిన్ను నా యం

డుంచుకొంటిని, నేను నిలోచేరితిని' అని, తమ దివ్య ప్రబంధము కీర్తించిరి పరాత్పరుని పుత్ర భావముతో ఆరాధించిరి తమ పాశురము లందలి భావాభరణములచే, దైవమును అలంకరించిరి.

ఆండాళ్ :-

ఆళ్వారులలో కొందరు నాయకీ భావము నాశ్రయించిరి ఆండాళ్ తన ప్రేమానురాగములను శ్రీ వేంకటేశ్వరునకు తెలియబరచెను.

నమ్మాళ్వారులు -

వీరి సిద్ధాంతమున భగవ తత్త్వము - సత్య స్వరూపము, ఆనంద స్వరూపమును అయి యున్నది భగవంతుడు భక్తుల యెడ దయా మయుడు, సర్వ కల్యాణ గుణాకరుడు, ఆర్త త్రాణ పరాయణుడు. చరాచర విశ్వము భగవ చ్ఛరీర భూతము ఈ యనంత విశ్వమునకు భగవంతుడు ఆత్మ భూతుడు పరమాత్మ జీవాత్మల సంబంధము నానా విధము జీవుడు భక్తి ప్రపత్తుల మూలమున మోక్షమును పొందును ఇదియే నమ్మాళ్వారుల తత్త్వ నిర్ణయము స్వ ధర్మాచరణముచే మానవుడు తన్ను తాను అర్థము చేసికొనగల్గును. ఈ యాత్మ జ్ఞానము భగవ ద్త్ప్రాపక మగును

మధుర కవి యాళ్వారులు :-

అమృత రసనులును - వీరియు ప వర్షులు నగు ఈ మధుర కవి యాళ్వారులు — భగవ ద్గుణానుభవముకన్న, గురు గుణ స్తుతియే మిన్న యని భావించిరి ఈ యాశయము మోక్షము గురు ద్వారక మను శ్రీ వైష్ణవ సిద్ధాంతమును స్మరింపజేయును అర్వాచీన విశిష్టాద్వైతమున, నియే భర సమర్పణ రూపమును దాలి

గండి నోఘను మధుర సేవుల గురు స్తోత్ర రూప మగు శంఖ నాదము - పూర్వోక్త శ్రీ వైష్ణవ సిద్ధాంత వైశిష్ట్యమును ప్రతిధ్వనింపఁ జేయుచున్నది.

ంధరధపాది యాఖ్యాదులు -

వీరు - పున ర్జన్మ రాహిత్యము గావింపు మని, శ్రీ రంగనాథు నర్థించిరి ఏల యన, వేదోక్త మగు శత సంవత్సర పరిమితాయుర్దాయము కల్గినను, అందు బాల్య కౌమార యౌవన దశానుగాప ప్రవృత్తులును, సాంసారిక సంకటములును, నిద్రాలస్య జరా ప్రలున, నైరాశ్యాదులును అనుల్లంఘనీయములు గదా' ఈ సత్యమును చిత్తమం దిడు కొనియే కాఁబోలు, భర్తృహరి - 'ఇద మను దమ్మగము శ్చ పుంసాం యదిహ జరా స్వపి మాన్మథా వికారాః' ని యుద్ఘాటించినాఁడు

## ఆళ్వారుల తత్త్వ శాస్త్రము

'భగవంతుఁడు ఒక్కఁడే ఉన్నాఁడు అతఁడు అద్వితీయుఁడు జితరము అశాశ్వతము చిదచిద్వస్తుద్వయము బ్రహ్మ శరీరంతము. తన్నిరూప్యములు తదపృథక్ సిద్ధ విశేషణములు. పంచము, ప్రాపంచిక జీవితము సత్యములే కాని, అవి అశాశ్వతములు భగవద్భక్తి ప్రపత్తులే మోక్షదాయకములు' అని, ఆళ్వారు - సంసారార్ద్రి నుగు మానవాళికి చాటి చెప్పిరి.

శ్రీ వైష్ణవునకు జీవితము సత్యమే విహిత ధర్మమును భగవత్రీతముగ ఆచరించుటయే అతని కర్తవ్యము. నిజమైన వైష్ణవుఁడు మాధవుని దర్శించి, సుజనోద్ధరణమునకై యత్నించును. శ్రీవైష్ణవస్వ శాస్త్ర మస్తా ఫలము లు పన్నద్ద రాళ్వారులచే, భక్తి ప్రబోధములైన తమ దివ్య ప్రబంధములంగు ప్రకటీకరింపఁబడినవి

ఆళ్వారులు వర్ణాశ్రమాతీతులుగఁ గన్పింతురు లింగ భేదము కూడ వారి యెడ వర్తింపదు భగవత్సృష్టిలో అందఱును సమానులే యని వారి అభిప్రాయము

ఆళ్వారుల పాశురములు – వారి అమృత పూర్ణ హృదయ సరోవరములనుండి, సుధా ధారల వలె నిస్సృతములైనవి ఆండాళ్ – నిత్య కల్యాణి, ప్రేమ ప్రపూర్ణ, భక్తి రస భరిత హృదయ ఆమె జీవితము, ప్రబంధము వివాహ సిద్ధమగు నాయకీ భావ భక్తి విశేషమును లోకమునకు అభివ్యక్తము గావించుచున్నవి. నమ్మాళ్వారులు భగవ ద్విరహ బాధానుభవ స్ఫోరకము లగు పాశురములను రచించి ఆనందించిరి వారి రచనలలో – భగవంతుని యెడ వారికి గల ప్రీతి గోచరించును 'మహనీయ విషయే ప్రీతి ర్భక్తిః' అనియే కదా శ్రీ భాష్య సిద్ధాంతము! తద్బీజములను ఇందు గానవచ్చును తత్త్వశాస్త్ర రహస్యము లెన్నియో వీరి ప్రబంధములం దున్నవి. ఆళ్వారులు – పరమైకాంతులు, అనన్య భక్తి సంయుక్తులు, మహాత్ములు ఆత్మార్పణ ధ్యాన భక్త్యాది సాధనములచే వీరు భగవ త్సాక్షాత్కార భాగ్యమును పొందిన మహానుభావులు. ధ్యాన మనగా 'తైల ధారావ దవిచ్ఛిన్న స్మృతిసంతాన రూపా' అని, అభియుక్తోక్తి వీరి బ్రహ్మానందానుభవము భగవ ద్విశ్లేష దుఃఖము మనలను ఆ పరాత్పరుని సన్నిధికి జేర్ప సమర్థములై యున్నవి.

## ఆళ్వారుల శ్రీ సూక్తులు

**ముదలాళ్వారులు ,–**

పన్నిద్దరాళ్వారులకు భక్తులపైఁ గల ప్రభావము, వారి తత్త్వ సిద్ధాంతము, వారి ఐకాంతిక భక్తి మొదలగు విషయములఁ గూర్చి మన మిపుడు పరిశీలింతము జగ న్నాటకమునందు ఈ యంత

ంగ స్థలము - తమిళ నాడు నందలి తిరుక్కోవలూరులోని
మందిరమున ఏర్పరుపఁబడినది.

చండ వర్ష మారుత వైద్యుతాఘాతములచేతను, ధారాపాత
కేగ వశమునను ఇద్ధాత్రీతలం బాహాతం బగుచుండ, అట్టి
స, అపరిచిత మూర్తి త్రయము పూర్వోక్త మందిరమున
కొనుట కేతెంచి, ఆకస్మికముగ ఒకరి నొకరు కలిసికొనిరి
ంతకులు - ఒకరి నొకరు అపరిచితులు వారు మహా
ుహా భక్తులు, కాంచీపుర - మహాబలిపుర మైలాపురము
స వారు పరస్పర సంభాషణా ఫలితముగ, వారు - తా
ురు, భక్తి రూపాపన్న జ్ఞాన సంపన్ను లని తెలిసికొనిరి
వయ కుహారములందు - భక్తి నాడులు స్పందించినవి వారు
యము - అద్వితీయము - అపూర్వము నగు బ్రహ్మాను
లో నైరి వారికి నాలవ వ్యక్తి యొకరు లోపలకు ప్రవే
ంక్షించుచు, తలుపు తట్టి నటుల శబ్దము శ్రవణ గోచర
ఆ మందిరము అల్పావకాశము గల దగుటచే, వా
రు ఒరసికొని యుండిరి. వారు ఈ విచిత్రానుభూతి
ను తమ వేదాంత విజ్ఞానమున నెఱుంగ దలంచిరి

షము లగు ఆళ్వారులు - దశ దిశల నావరించిన గాఢాంధ
పాణద ప్రకాశముగ మారవలె నని కాంక్షించిరి 'తమసో
తి ర్గమయ' అను వేద వాదమును ఈ యాళ్వారుల తలంపు
పథమునకు తెచ్చుచున్నది ఆళ్వారులు అట్లు ఆకాంక్షిం
తడవుగా, వారి ముఖారవిందమునుండి, సరాళంకార
మైన గభీర సరస్వతి - పాశుర రూపమున నిస్స్రుత మైనది
ంత విశ్వము ఒక ప్రదీపము. సప్త సముద్రములు ఘృతము

ఆదిత్య మండలము ఆరని జ్వాలః అని, ఆ పాశురార్థము ఆహా ఏమి పరిణామము ! తత్ క్షణమే గాఢ తమము విరిసెను సర్వము తేజోవంత మయ్యెను ఆ ముగ్గురు యోగులును అన్యోన్య దృగ్గోచరులైరి పరస్పర ప్రజ్ఞా విశేషములను అవగాహనము చేసికొనిరి. కాని, సర్వతః పీడనము మఱల దీర్ఘీకృత మాయెను. మహా బలి ప్రరాగత మహా యోగులు - ఈ యాంతర స్తంభనము చర్మ చక్షు గ్రాహ్యము కాదని గ్రహించిరి మరు క్షణమే వారి ముఖారవిందము నుండి, మృదు మధుర పద గుంభిత మగు ప్రబంధము జాలువారగ, అది వారి యాంతర సంతమసమును పారద్రోలినది వారి యజ్ఞానమునకు భరత వాక్యము పల్కినది ఈ పాశురము - 'అమ్బు' అను పాత్రి యందున్న దివ్య ప్రేమను, భగవద్విరహార్తి యను ఘృతమును నిరంతర విరహానల దహ్యమాన మనో రూప వర్తిని సూచించినది ఈ ద్వితీయ దీప శిఖ వెలుఁగున, జ్ఞానోదయ మైనది జ్ఞాన చూడాగ్ దీపము వెలిగెను ఆంతర సంతమసము తొలఁగెను అద్యతన క్షణమున వారు - ప్రకాశ సౌరభ్యముల వెదజల్లుచున్న పరమాత్మ సాన్నిధ్యము ననుభవించిరి

మైలాపుర మహాయోగులు హర్షోత్కర్షమున నాట్య మాడిరి. తప్త కాంచన వర్ణుఁ డగు నారాయణుఁడు, తద్దివ్య మహిషి యగు లక్ష్మీ దేవియు సాక్షాత్కరించిన దృశ్యమును అభివర్ణించుచు, వారి ముఖారవిందము నుండి మధుర భాషా గీతి వెలువడెను వారు ఉదయ భాను బింబమును దర్శించిరి నారాయణుని దక్షిణ హస్తమున స్ఫురత్సహస్రార సుదర్శనమును, వామ హస్తమున పదత్ పాంచజన్యమును దర్శించిరి భువన సుందరుని దివ్య సౌందర్యమును తెప్ప వాల్పక జూచిరి దివ్య వైభవమును అన్మయులై ఆలోకించిరి దివ్య సౌరభము నాఘ్రాణించిరి వారికి నేత్ర పర్వ మయ్యెను. ఆళ్వారుల వచో రచనను బట్టి, వారట్టి దివ్య మంగళ విగ్రహము నెన్నడును దర్శించి

యుండ లేదని విదిత మగుచున్నది. మైలాపుర యోగి వరుల వాగ్విన్యాసము పరాత్పరునకు స్వాగతము పలికినది.

ఆ మువ్వురు మూర్తులును — ప్రేమ ప్రఫుల్లము, ప్రశంసనీయము, మనోహరము నగు భగవత్స్వరూపము తమ మ్రోల దర్శించు చున్నటులను, భక్తి ప్రేమ తత్త్వములు తమకు కీర్తన జపము చేయు చున్నటులను అపూర్వానుభవము పొందిరి. ఆ పురుష త్రయమున సాక్షాన్నారాయణునిచే నుపదేశింపఁబడిన తత్త్వ రహస్యమే నాలాయిరమునకు నాంది యైనది. ఈ మువ్వురే కాంచీపుర వాసు లగు పొయ్‌గై యాళ్వారులు, మహాబలిపుర వాసు లగు పూదత్తాళ్వారులు, మైలాపుర వాసు లగు పే యాళ్వారులు అయి యున్నారు. వీరు క్రమశః అల్పిశి మాసమున — తిరువోణమ్, అవిట్టమ్, సదయమ్★ అను శుభ నక్షత్రాధిష్ఠిత లగ్న వేళలయందు జన్మించిరి. తిరుకోవలూరు — ఆళ్వారులచే నుపదిష్టమైన భగవత్ప్రేమ తత్త్వమునకు జన్మ స్థాన మని వాసి కెక్కెను.

అల్పిశి మాసమున ఈ మూర్తి త్రయము అవతరించుటలో మఱి యొక ఆంతర్య రహస్యము కలదు. దీపోత్సవ వైభవాన్విత మగు దీపావళి పండుగ — అల్పిశి (ఆశ్వయుజ) మాసమున జరుపుకొందుము. మన ఆత్మ తత్త్వముల ప్రకాశింపఁజేయు నవసరము తెలుపుటకా యనునట్లు, ఈ మహా పురుష త్రయము ఈ మాసమున నవతరించెను. ఈ మువ్వురు వెలిగించిన జ్ఞాన దీప శిఖయే నిజ మైన దీపావళి.

పే యాళ్వారులు తత్త్వమును కరతలామలకము వలె దెల్పి భావి తరముల వారికై, వారు — 'తిరు' 'మే' అను పదముల 'తిరుమే' అని సంధించిరి. ఈ యాళ్వారుల ముఖ నిస్సృత మగు దివ్య ప్రబంధమే శ్రీ వైష్ణవ తత్త్వ రహస్య వేదాంత శాస్త్రమున

★ తిరువోణమ్, అవిట్టమ్, సదయమ్ అను పదములకు క్రమముగా — శ్రవణము, ధనిష్ఠ, శతభిషము అని యర్థములు. — సంపాదకు(డు)

నాంది యైనది తరువాతి ఆళ్వారులు నాలాయిర దివ్య ప్రబంధ నిర్మాణ సమున్నయమునకు కొనసాగించిరి

**తిరుమళిశై యాళ్వారులు –**

వీరు భగవంతుని వశము గావించుకొన్న మహనీయులు 'భక్తిసారులు' అను పేర సుప్రసిద్ధులు 'భగవంతుఁడు భక్త పరాధీనుఁడు' అను సత్యము వీరి యెడ నిరూపిత మైనది మనో వాక్కాయ కర్మలచే వీరు ఐకాంతిక – ఆత్యంతిక భక్తి విశేషమును ప్రదర్శించిరి భగవంతుఁడు అర్చారూపమున వీరి ననుసరించెను ఈ యాళ్వారులొకసారి కుంభకోణమున కేఁగి, 'ఆరా అముదమ్' ఆలయమున, శార్ఙ్గపాణి స్వామిని దర్శించిరి యోగ నిద్రయం దున్న ఆ స్వామి విశ్రాంత భావము నుపలక్షించి, వీరు సూటిగ పరాత్పరునే తదవస్థా కారణము ప్రశ్నించిరి ఈ విశాల విశ్వము నీ పదాంకితము చేయుచు ద్రిమ్మరుటచే, నీకు శ్రమ కల్గుటచే లేదా? రమాదేవి సంరక్షణమునకై నీవు వారాహ రూపమున భూ వివరము సొచ్చి శ్రమించుటచే, శరీరము వివశమయ్యెనా? కావేరీ తీరస్థ మగు 'కుడంతై' యందు నీ వున్న నిద్రా ముద్రిత స్థితికి గత మేమి? భగవత్ క్షేమ విషయకమగు తమ యీ ఆవేదనకు తమ ప్రశ్నమునకు ఉత్తర మొసంగి, ఉపశమింపఁజేయు' మని భక్తిసారులు భగవంతుని వినమ్రులై ప్రార్థించిరి

వాత్సల్య భావ భరిత మగు నీ ప్రశ్నము భగవంతుని యుత్తరమునకు పాత్ర మయ్యెను సుందర కావ్యమున పొదుగఁబడిన ఈ ప్రశ్నమునకు సమాధాన మొసంగుటకై భగవంతుఁడు తల యెత్తి, శేష శయనమునుండి లేచుటకు ఉద్యుక్తుఁ డయ్యెను. భక్తిసారు లీ దృశ్యమును గాంచి, మంత్ర ముగ్ధులైరి భగవంతుని

కృపా విశేషము నుగ్గడించి, నిద్రా భంగము గావించినందులకు మిగుల వగచి, యోగ నిద్ర నుండు మనియు, లేవ వలదనియు ప్రార్థించిరి ఇట్లు ప్రార్థింప, 'అరావముదన్' లేచుట మానెను. పైకెత్తఁబడిన భగవంతుని తల — నేటికిని అచ్చట గాన నగును. 'భగవంతుఁడు భక్తపరాధీనుఁడు' అను సత్యము నిచ్చట ద్యోతక మగుచున్నది భక్తిసారులు మంగళాశాసనము చేసి, భగవత్కటాక్షమును అభ్యర్థించిరి

ఈ భక్తిసారుల విషయక మగు మఱియొక అద్భుత సంఘటనము తంజావూరు మండలములోని 'తిరువయ్యారు' పరిసరమునఁ గల 'పెరుం పొలియూర్' ఆలయమున జరిగెను. వేద విద్వాంసులు వీరికి ఆలయ ప్రవేశమున కనుమతి నొసంగరైరి. కాని, వీరు భగవద్దర్శనోత్సుకులై, యే రంధ్రమునుండియైన భగవద్దివ్య మంగళ విగ్రహము నేత్ర పర్వముగ గన్పట్టునేమో యను తలంపుతో, ఆలయ ప్రదక్షిణము చేసిరి. భగవద్వేరము ప్రదక్షిణము చేయుచున్న భక్తిసారులకు దర్శన మొసంగు సంకల్పముతో, సర్వతోముఖముగ పంచలించుచుండుట చూచి, వేద విద్వాంసులు పరమాశ్చర్య మగ్న మానసులైరి. ఆ వైదికులు క్షమాభిక్ష నర్థించుచు, తిరుమొళిశై యాళ్వారుల పాద పద్మములకు సాష్టాంగ నమస్కృతు లొనర్చిరి

మఱియొక సారి, రాజాజ్ఞానుసారముగ భక్తిసారులు - తమ శిష్యుఁడగు 'కణికణ్ణన్'తో పాటు నగరమును వీడి యేగు నెడ, కాంచీ వరద రాజస్వామియు - ఆలయమునుండి పయనమై, వారి ననుసరించెను. నరపాలుఁ డపుడు తన తప్పును గ్రహించి - క్షమాభిక్ష నర్థింప, భక్త సంకల్పానుగుణముగ భాగవతోత్తములతో భగవంతుఁడు నగరమునకు మఱలెను. పరమ భాగవత శిఖామణులగు ఆళ్వారుల కను సన్నల ననుసరించి, పరమాత్ముఁడు మెలంగెడివాఁ

డని అంతర తత్త్వ రహస్యము అర్చా రూపముల యందలి దివ్యత్వము ఈ యాళ్వారులచే చక్కగా నిరూపింపబడినది

భక్తిసారుల కవిత - గహనమును, పాండిత్య ప్రకాశకమును అయి యున్నది స్వీయ జన్మమునకు పూర్వము పరాత్పరుడు స్థితి త్రయమునం దుండె ననియు, స్వావిర్భావానంతరము ఆ స్థితి త్రయము వీడి, స్వీయ కుహరాంతర్యామిగా నున్నాడనియు భక్తిసారులు వక్కాణించిరి

'విశిష్టాద్వైతము శాస్త్ర సమ్మతము దీనివలన, ప్రతి మానవుడును, ప్రాపంచిక జీవితములో - ఉదాత్త భావములను, భగవద్భక్తిని, ప్రేమ తత్త్వమును పెంపొందింపజేసికొని, ఉత్తమ జ్ఞాన పర్యవసాయి కావలయు నని తెలియ నగును. 'ఆత్మవత్సర్వ భూతాని' యని భావింప నగును సాటి మానవుల యెడ గల ప్రేమయే, కాల క్రమముగ మాధవుని యెడ అనురాగముగ పరిణమించును' ఇదియే తిరుమళిశై యాళ్వారులు గావించిన తత్త్వ బోధ

నమ్మాళ్వారులు :-

ఈ మహనీయులు సంసారార్దిత మానవ కోటి యెడ, మిగుల దయ గలవారు. జన్మతః వీరు పరమ తాత్త్వికులు జన్మించినంతనే వీర అజ్ఞానావృత మగు ఆత్మను అభిభవించిన శఠ వాయువును జయించి, 'శఠ కోపులు' అను అన్వర్థాభిధాను లైరి మర్త్యుల అజ్ఞానము వీరికి బాధా కర మయ్యెను. మిథ్యా ధ్యాన బంధనము నుండియు, హేయ శరీర బంధము నుండియు జనులకు విముక్తి నొసంగు మని, వీరు భగవంతుని ప్రార్థించిరి పరి దృశ్యమాన ప్రపంచమునకు సర్వేశ్వరునకును నడుమ – అవకాశ విషయిక కాలికావరోధములు లేవనియు, సృష్టియందు దైవ స్వరూపముగ నెద్ది యింద్రియ గోచర

మగునో - దాని ననుసరించి మానవులు తమ జీవితములను దీర్చి ది
కొనుట మే లనియు వీరి మతము.

హవ్య వాహనునియందు వీరు హయగ్రీవ దేవుని దర్శిం
గాఢాలింగన మొనర్ప యత్నించిరి ఆ దేవుని - అచ్యుతుఁ
పిలచిరి. వీతిహోత్రుఁడు తమను బాధింపఁ డని భావించిరి. నవ
మును చూచి - కృష్ణ రసనాస్వాద్య మనియు, భోగి భోగాసనాసీ
భోగ్య వస్తు వనియు సంభావించిరి సర్ప దర్శనమున ఆనంద
సంప్లావితు లైరి శేష శయనుని శయన మగు ఆది శేషుఁడే -
దృశ్యమాన సర్ప మని తలంచిరి. వేణు నాద శ్రవణమున - (
రార్పిత వేణు నాద లోలుఁ డగు శ్రీ కృష్ణ పరమాత్ముని ది
మంగళ విగ్రహము - మహనీయు లగు ఈ నమ్మాళ్వారులకు నయ
పథ వర్తియై, నేత్ర పర్వ మయ్యెను వీరి భగవ ద్విషయిక మో
వేశము ఒక విశిష్ట తత్త్వ శాస్త్రము అది - కాల నియంతయ
యోగీశ్వరుఁడు నగు పరాత్పరునే శాసించును

ఈ యాళ్వారుల భక్తి దశ యందు - అవస్థాంతరము కలఁ
అది విరహ వేదనా దోదూయమాన నాయికా భావము నాం
భావ భరిత హృదంతరు లగు నమ్మాళ్వారులు - సర్వేశ్వరు
తాము అత్యంతానురాగ పాత్ర విషయముగ భావించిరి తామే .
న్నియంత యగు జగన్నాథుఁ డని తలంచిరి వామనావతారమ
బలి చక్రవర్తి నుండి పాద త్రయాక్రాంత నిఖిల లోకుఁడై, నాప
దానమును గ్రహించిన అకుంఠ మహిముఁ డగు వైకుంఠ కంఠీరవుఁ
తామే యని భావించిరి శ్రీ దేవి నుద్ధరించుటకై, భూ గర్భ
సొచ్చిన ఆది ఘోణ మూర్తి తామే యని సంభావించిరి. కలా
తమున, ప్రళయావసరమున బ్రహ్మాండ భాండమును గ్రహించి, ప
స్సృష్టి యొనరించిన ఆది దేవుఁడు తామే యని తలపోసిరి.

వీరి భక్తి భావము - తరువాత, శృంగార రస పుష్ట మయ్యెను. మాత మఖమున విరహ తనిజా రీతిలో - భగవ ద్దర్శనము నభిల షించుచు, దాత్మము నెఱపెను దేహ బంధము నుండి ప్రాణ వాయువు విరహ యమునిచే ఆ కృష్టము గాక మున్న, నాయకీ దర్శనము నాకాంక్షించిరి విరహ వేదనా చోదిత మానస యైన ప్రాతాజతీ రీతి, ఈ యాళ్వారులు తమను దర్శన మీయ కున్న పరాత్పర ధూర్త చాతుర్యమున కాగ్రహించిరి భగవంతుని యందు వీరికి గల ప్రేమాతిశయము - భగవ న్మోహావేశముగ మారెను. వీరి ప్రేమ - ఉన్మాదావస్థగ పరిణమించెను ఒక క్షణమున వీరు ... భగవ ద్విరహమున మూలుదురు ఎల్ల యెడలను ఆతుర సూచనలు వీరికి శా వాంబర పీథి దృ గ్గోచర మగుచుండెను. కృష్ణ పక్ష క్షపాకరుడు - ఆను పది ప్రవక్క్రా త్తై, కాంతి వఱిగి, భగవ ద్విరహా నల దందహ్యమానుడై, తమ వలె కృశించుచున్నటుల వీరు భావించిరి సముద్ర తరంగములు అసంభావితయు - అనాస్వాదితయు - అనాలింగితయు - విఫలీకృత ప్రేమయు నగు ప్రేయసి ననుకరించుచు, విరహా ర్తి ఘోషించుచున్నటుల వీరికి తోచెను వీరి విరహ బాధను భగవంతుడు ఉపశమింప జేయలేదు భక్తి వైభవ సమన్విత మగు వీరి ప్రేమ తత్త్వము ఇట్టిది ఏవం విధ భావ గౌరవము జ్ఞానోదయ మునకు పూర్వ భావి ఇట్టి భక్తి రాగముల ఆహ్లాద కర మగు సంయోగము - అస్మాదృశుల కైసందిన స్వప్న లక్ష్యము భగవ ద్భక్త తాత్త్వికైక్యము - శఠకోప శంఖ నాద ముఖ్య స్వరము

***మధుర కవి యాళ్వారులు :-***

శఠకోప మునీంద్రుల ప్రియాంతేవాసులే మధుర కవి యాళ్వా రులు గురు శిష్య భావమే వీరిరువురిని పెన వేసిన తాత్త్విక బంధము. మధుర కవి యాళ్వారులకు గురువే దైవము. 'ఆచార్య దేవో భవ'

యని కదా వేదానుశాసనము! ఉదాత్త మగు గురు శిష్య భావము విశాల దృక్పథము గల శ్రీ వైష్ణవ సిద్ధాంతమునకు మూల స్తంభము. శ్రీ వైష్ణవ మతమున గురువునకు ఉన్నత స్థాన మున్నది మధుర కవి యాళ్వారు ఆచార్యాన్వేషణము - తత్సమాధానముగ మధుర కవి యాళ్వారులకు మార్గదర్శకమై, 'కురుగూరు' పట్టణ - మేరిని నడపించిన గురు ప్రేరిత మగు దివ్య తేజము ఇందుకు తార్కాణము

**కులశేఖరాళ్వారులు -**

వీరు చేర రాజాన్వయ సంభూతులు. భాగవతోపచార మే వీరి పరమ లక్ష్యము భక్త సేవయే భగవత్సేవ యని వీరి మతము అంతఃపుర రాభరణాపహరణ దోషము రాజాస్థానమున గల వైష్ణవ భక్తులపై మోపబడెను అపుడా రాజన్యుడు - వైష్ణవ భక్తుల నిర్దోషిత్వమును నిరూపించుటకై, తత్కాలీన ధర్మ శాస్త్రానుసారముగ, విష సర్పమున్న కుంభమున స్వహస్తము నిడి, అక్షత గాత్రుండై, భాగవతులు నిరపరాధు లని నిరూపించెను ఈ సంఘటనతో - భూపాలుని జీవితము మలుపు తిరిగెను రాగ ద్వేషముల కాలవాలమును, అసూయా పూరితము నగు వాతావరణము నుండి బయట పడు మార్గ మాతనికి గోచర మాయెను

కులశేఖరుల భక్తి తత్త్వము, భాగవతారాధనము మనకు మార్గ దర్శకములు - గుణ పారములునై వెలసినవి ధరణి నేలుచు, దేవుని కొలుచుచు, సిరుల కాన పడక, కులశేఖరాళ్వారులు ధన్య జీవులైరి రాజ భోగములు వీరికి రుచింప వాయెను రాజ మకుటమును ధరించుటకు వీరు ఇచ్ఛయింప రైరి శ్రీ రామ పద కమలములను శిరసా వహించుటకు వీరు సత్వరులైరి హృదయమును స్పందింపజేయు జోల పాటలతో వీరు శ్రీ రామ చంద్రుని సంస్తుతించిరి

కులశేఖరాళ్వారులు దశ శ్లోకాత్మక రామాయణమును రచించిరి శ్రీ రామ జననము, శ్రీరాముఁ డనుభవించిన కష్టములు, పట్టాభిషేకము, పరమ పద గమనము కులశేఖరాళ్వారుల మనస్సుపై, చెరగని ముద్ర వైచినవి. తత్ఫలితమే దశ శ్లోకాత్మక రామాయణము. కులశేఖరాళ్వారుల శ్రీరంగ నాథ గుణానుభవము – రంగ భక్తులకును, రంగ నాథ సాన్నిధ్యానుభవజ్ఞులకును, శేషశాయి దర్శన జనిత మధు రానంద రసజ్ఞులకును అత్యంత పత్యము గు అనుభవమై యున్నది. స్వాత్మ పరమాత్మలను కులశేఖరులు అవినాభావముగ, సంపూర్ణముగ మేళవించిరి అది వీరికి అత్యంత సుఖానుభవము

కులశేఖరాళ్వారులు కేరళ నాథుని ఈ క్రింది విధముగ ప్రార్థించిరి –

'క్రోధ పరవశ యైన తల్లిచే విడువఁబడిన శిశువు వలె, నేను నీ యండ కోరుచున్నాను భర్తృ బాధిత యగు పతివ్రత సతి, నీ యాశ్రయ మర్థించుచున్నాను వర్షాగమనమునకై యెల్లలు చాచు పైరు వలె నీ శరణు జొచ్చితిని నా ప్రార్థన మన్నింపు మన్నను, నేను భవ ద్విరహార్తి క్రుంగుచున్నాను నిన్నే కోరుచున్నాను

నిస్పృహా నిరాశలతో క్రుంగి పోయినను – స్వీయ ధీ విభవము నను, తాత్త్విక భావనా బలమునను అట్టి ప్రార్థన గావించిరి శ్రీ వేంకటే శ్వరుని యెడ కులశేఖరులకు గల భక్తి ప్రపత్తులు – వారి సద్ధాంతమునకు సుకుటాయమానములు భగవద్గుణానుభవ స్ఫోరకము లగు వారి శ్లోకములు – అసాధారణ ప్రబంధములు శ్రీ వేంకటేశ్వర సాన్నిధ్యమున, జడ ప్రాయి మగు అచిత్పదార్థముగ జన్మ గావింపఁ బడినచో – వీరు తమ జ్ఞానమును అనఁగా – చిద్వస్తు రూపమును త్యజింప సిద్ధమైరి. అట్టి దశాంతర పరిణామము వారికి ఉత

వసౌన్యను 'హా జన్మతా సుకీకతాసు మియా న లభ్యమ్'
ప్రాచ్యాచార్య సూక్తి - ఈ సందర్భమున అనుసంధింప
దేవ దేవుని శేష శైలమున ఎట్టి జన్మ గొంగబడినను,
డకుడు నని భావించిరి రాజ మర్యాదలు, ఐశ్వర్యము,
ముదలగు వానిని, పరమ పద సనాథ సాన్నిధ్యానుభవమునకు
రాని వని పరిత్యజించిరి

రియాళ్వారులు -

వీరు జ్ఞాన వృద్ధులు మహా యోగులు వాత్సల్య భావము
గ్రహించి, భగవంతు నారాధించి తరించిన మహానుభావులు
రు తిను ప్రారంభ పాశురమునందు - భగవంతుని అనేక సహస్ర
యునిగ వర్ణించిరి విష్ణు పద కమల రాగము కాల నశమున వస్తు
గ్గలేదని వీరు తలంచిరి జగద్రక్షక రక్షకత్వము వహించిరి భక్తి
పారవశ్యమున పరిపూర్ణ హృదయులైన వీరికి - జగద్రక్షక రక్ష
త్వ భావ ముదయించెను ఈ వాత్సల్య భక్తి విశేషానుభవ లక్షణము
'రక్షకుడు,రక్షితుడు' అను భావనయే పితృ వాత్సల్యముతో
భగవంతునకు మంగళాశాసనము గావించిన మహానీయులు వీరు

ఆండాళ్ :-

సీతా దేవి వలెనే ఈమెయు భూ జాత తండను శ్రీరంగ
నాథునియందు లీన మైన ధన్య చరిత పెరియాళ్వారుల పెంపుడు
బిడ్డ యగు ఈమె - వట పత్ర శాయికి, అలంకరణమునకు యోగ్య
మగునో - కాదో యని, పూ మాలలను ముందుగా తాను పరిశీ
లించుట కలవడి యుండెను. త దౌచిత్య విచారము ఈమెకు వెన్నతోఁ
బెట్టిన విద్య ముందుగా పుష్పమాలను తాను ధరించి, తన యంద
ము ను మెచ్చుకొనెడిది ఈమె - భక్త ముగ్ధ సుమ దామ పరిష్కృత

రంగ రాజ దివ్యావళిక భగవ దర్పణమునకు నిర్మించిన వస్తు యోగ్యతల నిరూపణము సేయుటకై, ఈమె యనుసరించిన పరీక్షా పద్ధతి, తత్త్వము అసాధారణ మైనవి భోగ వస్తు జాతము ఈ పరీక్షా పద్ధతిచే, దివ్య వస్తు జాల మైనది సహృదయు లందఱును గోదా దేవి యొక్క అసాధారణ మధుర సాహసిక పరీక్షా తత్త్వ రహస్యమును కొనియాడ గలరు పరమాత్మతో కలయిక నభిలషించుచున్న జీవాత్మయే గోదా దేవి ఈమె ధన్య చరితము మానవాళికి మార్గదర్శనము శ్రీ రంగ నాథుని దివ్య దేహమును మనోహర మగు పుష్ప మాల చేతను, పరమాత్మను కమనీయ మగు కావ్య మాల చేతను గోదా దేవి బంధించి వైచినది ఈమెచే రచింపబడిన 'తిరుప్పావై' - విశిష్టాద్వైత సిద్ధాంత సార మనియు, ఉత్తమ గోప కావ్య మనియు ప్రసిద్ధి నందినది ఆండాళ్ ప్రబంధమున, దివ్య ప్రేమ ప్రకర్ష గోచర మగును ఈమె - దేవ మానవ సంభావిత. ఈమె తమిళ కవయిత్రి యైనను, సంస్కృత విద్వాంసు లీమెను 'గోదా' అని సంభావించిరి ఉత్తమ వాగ్మి యనియు, ఉత్తమ వచో రచనా ధురీణ యనియు 'గోదా' శబ్దార్థము కృష్ణ ప్రేమను ఈమె కీర్తించినది. మానవుని యందును, సాధువు నందును, దివ్యుల యందును గల కృష్ణ ప్రేమ - ఉదాత్త మని చాటి చెప్పినది. ఆండాళ్ ప్రబంధ పఠనము - హేయ భావ క్షాళన మొనర్చి, బ్రహ్మానందానుభవమునకు దోహద మొసంగును.

తిరుప్పావై ఒక విశిష్ట ప్రబంధము ఇందు ఆండాళ్ - గోపికా భావము నందినది సఖులను తన వలె కృష్ణ విరహార్తి నొందెడి గోప వటీ మణు లని భావించినది నివాస స్థల మగు శ్రీ విల్లిపుత్తూరు గోకుల మని తలంచినది వటపత్రశాయి ఆలయము నంద గోప నిలయ మని తలపోసినది వటపత్ర శాయిని శ్రీ కృష్ణుడని యెంచినది. మనోహరములును విశదావేశ భాసురములు నగు

ముప్పది పాశురములు గల 'తిరు ప్పావై' అనుసంధానమునకు పూర్వ రంగము ఏర్పరుపబడినది. గోపీ జన నాయకి యగు గోదా దేవి — చెన్నెలులతో కూడి, ముక్తకంఠముగ గాన స్వర మేళన మొనర్చి, ప్రతి ధ్వనిత మధుర సంగీత యుక్తము, అగ్రగణ్య పల్లవి పాడినది. ఇరువది తొమ్మిదవ పాశురము అత్యంత మనోహరముగా ప్రబంధ పవిత్రత కీలకము అయి యున్నది. దాని మధుర భావములను, కోరికను భగవదున్ముఖము గావించి, సర్వదా పరమపద నాథ సేవా భాగ్యము కల్పింపు మని గోదా దేవి - శ్రీకృష్ణుని గొప్ప వర మడిగినది. గహన వేదాంత శాస్త్ర రహస్యములు ఈ ప్రబంధమున కరతలామలకముగ జనులకు తెలుపబడినవి.

**తొండరడిప్పొడి యాళ్వారులు :-**

వీరు విప్రనారాయణులుగా సుప్రసిద్ధులు. శ్రీ రంగ నాథ భక్తాంఘ్రి రేణువు లగుటచే, వీరు - తొండరడిప్పొడి యాళ్వారు అను పేర పిలువబడిరి. వీరికి స్వర్గ సుఖమునందు అభిలాష లేదు. భూతల వాసినై, తనివి దీర భగవద్గుణాను భవము గావించుటయే వీరి ఆశయము. వీరి 'తిరు మాలై' ప్రబంధము నలువది మూడు పాశురములు గల్గి, శ్రీ రంగ నాథుని యెడ భక్తి ప్రపత్తులతో నిండి యున్నది. ఈ 'తిరు మాలై' ప్రబంధము భక్త హృదయము స్పందింప జేయును. ప్రప్రథమమున తా నింద్రియ లోలుడ ననియు, ఇప్పుడు మోక్ష కామినై, భగవంతుని శరణు జొచ్చితి ననియు వీరు వక్కాణించిరి. 'కామి గాక మోక్ష కామి గాడు' అను నానుడి - వీరి యెడ సత్యమైనది. వీరి 'తిరు మాలై' గొప్ప కావ్యము భగవద్భక్తి భరిత మైనచో, వీరి 'తిరు ప్పళ్ళి యెళుచ్చి' శేష శాయి యగు భగవంతుని మేల్కొలుపు ప్రబంధ విశేషము. ఈ 'పది పాశురి' యందు — ఉషః కాల వైభవమును దర్శింతును

పక్షి గణ కల కలారావముల నాకర్ణింతుము. కుసుమ సౌరభము నాఘ్రాణింతుము. పర్యవసానమున, జపా పుష్ప పాటల వర్ణ సదృశ దీప్తి నల్లసిల్లి, చిమ్మ చీకటుల శార్వరీ దోలు ఉదయ భాను కిరణాయణ కాంతులను పరిశీలింతుము పితృ వాత్సల్యములో - అరంగ నగర నాథుని, అనంత శయనము నుండి నిద్ర లేవవలసిన దని ప్రబోధించుచు, వీరు - ఈ పాశుర పుష్పములను వికసింపఁ జేసిరి విశ్వామిత్ర మహర్షి శ్రీ రామ చంద్రుని -

"కౌసల్యా సుప్రజా రామ ! పూర్వా సంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠ నర శార్దూల ! కర్తవ్యం దైవ మాహ్నికమ్"

అని, యోగ నిద్రనుండి ప్రబోధించు శ్రీ మద్రామాయణ ఘట్టము ఈ యాళ్వారుల ప్రబంధమునకు 'మాతృక' గా నొప్పును. నిద్రావస్థయం దున్న మన ధీ శక్తిని ప్రబోధించి, వాస్తవిక ప్రపంచమును అర్థము చేసికొని, జగన్నాథునితో విశిష్టాద్వైతము నందుటయే ఈ ప్రబంధమునందు గల తత్త్వ రహస్యము.

## తిరుప్పాణాళ్వారు :-

వీరి జీవితము - సంగీత సమన్విత సవినయ భావము, ప్రార్థనా పూర్వక దైవ సాన్నిధ్య ప్రాప్తి అను విశేష ద్వయ విశిష్టమయి విరాజిల్లినది ఈ రెండును - భావి తరముల వారికి వీ రందించిన గుణ పాఠములు సంగీతము ద్వారా — వీరి ఆత్మ, వీరికి అత్యంతము ప్రియ తముఁ డగు పరమాత్మ యందు లీన మైనది జీవాత్మ భగవ ద్దివ్యోపదేశ ప్రేరితమై, పరమాత్మచే ఆచ్ఛాదిత మగుచున్నది ఈ యాళ్వారులు దివ్య సంగీత రసికు లని ప్రసిద్ధి గాంచిరి దివ్య సంగీత సార్వ భౌము లని వాసి కెక్కిరి ఈ 'పాణాళ్వారుల'ను

'పాణ్ పెరుమాళ్' అని, జనులు సంభావించిరి ఈ యాళ్వారు నెత్తిను వలన, మనము భగవంతుని సభక్తికముగ సంగీత విద్య చేతను చేరవచ్చు నని గ్రహింపఁ గలము

## తిరుమంగై యాళ్వారులు :-

వీరు సర్వతోముఖ ప్రజ్ఞావంతులు అతి సమర్థులు ఆసేతు హిమాచలము అనేక దివ్య దేశములను దర్శించిన ధన్య జీవులు 'నీలన్' అని వీరికి నామాంతరము గలదు వీరొకి జమీందారు ప్రథమమున విప్లవ వాదిగా ప్రవర్తిల్లినను, తరువాత కాలక్రమమున వీరు పరమ భక్తాగ్రగణ్యులుగా - మహా పండితులుగా పరివర్తనముఁ జెందిరి.

వీరి పాశురములు అర్చా రూప మగు భగవదారాధనమునే కేంద్రీకరించిరి వీరు తమ సాహిత్య ప్రజ్ఞను భారత దేశము నందలి అష్టోత్తర శత దివ్య దేశములలోని దాదాపు ఎనబది యారు దివ్య దేశములలో వేంచేసి యున్న భగవంతుని మహిమలను అభివర్ణించుటకు వినియోగించిరి ఆహ్లాద కరమును - హృదయంగమమును అగు కావ్య పద్ధతి ననుసరించి, వీరు తాము దర్శించిన ఆలయము లందలి దైవ మహిమలను అభివర్ణించిరి అనిత్య మగు స్వర్గ సుఖము నభిలషించు వారికి, భూతల వైకుంఠము లగు దేవాలయము లందలి బ్రహ్మానందానుభవము శ్రేష్ఠతర మైన దని వీరు బోధించిరి దేవాలయ దైవ దర్శనము - ఇచ్చట, ఇప్పుడు, బ్రహ్మానంద సంధాయకము గదా! దేవతలు స్వర్గమున అనుభవించు సుఖములు - ఈ భూతలముననే, అర్చా రూప భగవదారాధన ద్వారా సాధ్యము లని వీరు మరల విశదీకరించిరి ఇంద్రియ నిగ్రహము సాధించి

శిక్షను సేయుట యని జనులకు వీరు బోధింపలేదు. కఠోర నియమములతో, పంచాగ్ని మధ్యమున నేక పాదులై, అరణ్యమున ఘోర తప మాచరింపుడని వీరు జనుల నుద్బోధింపలేదు. ఆలయ స్థిత మనోహర సౌమ్య కరుణామయ అర్చా రూపములను ఆరాధించి, దైవ విరహమును శాంతపరచుకొనుడని వీరి యుపదేశము. దైవ దర్శనాకాంక్షులై, దైవానుగ్రహమును కోరి, ఆలయములకు వచ్చు భక్తులతో కలసి మెలగుటయే యని వీరి యుపదేశము. మానవతావాదు లగు ఈ యాళ్వారుల తత్త్వోపదేశము నేటికిని గలదు. సాహిత్య మార్గమున పయనించి, ఎతిముల, దైవమును చేరవలెనని వీరి తత్త్వోపదేశము. తమిళ వాఙ్మయ ప్రపంచమున ఈ మహనీయులు - చతుష్కవి శిఖామణులుగా విఖ్యాతి గాంచిరి వీరి గీతములు, వృత్తములు, గ్రంథములు, పదములు' సుసంగతములును - మధురములు నయి పాఠకులకు ప్రతి ధ్వానిత బ్రహ్మానందానుభవము లగుచున్నవి

పండితులు, పామరులు భువన సుందర మూర్తి విశేషము లగు అర్చా రూపములను ఎన్నటికిని విస్మరింపజాలరు వీరి ప్రబంధ పఠనము హృదయ స్పందనము గహనాటవులలో ఉగ్ర తపము మానవాళికి నిశ్శ్రేయస ప్రదము కాదు దైవ మాహాత్మ్యాభివర్ణనము, నైయుక్తిక - సాహిత్య మార్గ సంపాదిత భగవద్భక్తి ఈ రెండును - ఉన్నత, ఉదాత్త వేదాంత తత్త్వములు కాల గర్భమున నివి లీనము కాలేదు

తిరుమంగై యాళ్వారుల తత్త్వ బోధ - మనకు శిరోధార్యము. మత విషయిక భక్తి తత్త్వ బోధ యందు ఈ యాళ్వారులు అగ్రగణ్యులు వీరు మన ప్రియతమ గురు దేవులు వీరి గురుత్వము మనకు పరమోపాదేయము

## నిగమనము

ఆళ్వారులు భగవత్ప్రేమానుభవ రసజ్ఞులు. వారి మధురకవిత - భగవద్గుణానుభవ పరిపుష్టము. నవవిధ భక్తి విశేష విశిష్టము. వారు భగవద్భక్తి ప్రేరితులు. వారి మత విషయిక కవిత దక్షిణ ప్రాంతము నందలి వివిధ భాషలలోనికి అనువదితమైన నాలాయిర దివ్యప్రబంధము నందు గల తత్త్వశాస్త్ర గంభీరత, మత విషయిక భక్తి తత్త్వము - భగవత్సాన్నిధ్య ప్రాప్తికి నిజమైన మార్గములు. ఆళ్వారుల కవిత యందు భగవద్భక్తి - విశేషముగ గోచరించును నమ్మాళ్వారుల కవితలో. దివ్యప్రేమ, భగవద్భక్తి మహావేశములు మిక్కుటముగా గన్పట్టును. ప్రాపంచిక బాధలను నాస్తి మనియు, పీడిత మానవాళికి జరిగిన అన్యాయమును వారదోలు మనియు నమ్మాళ్వారులు భగవంతుని ప్రార్థించిరి. నమ్మాళ్వారులకు పీడిత జనుల యెడ కరుణ మెండు. భగవంతుడు అంతర్యామియు - నియంతయు - మార్గదర్శకుడు నగు 'శేషి' యని నమ్మాళ్వారులు సమభావమున జనులకు ఉద్బోధించిరి.

ఇదియే ఆళ్వారుల సిద్ధాంతము. వారు అజరామరులు. సంసారులకు మార్గదర్శకులు.



# శ్రీ విష్ణు చిత్తుల కవితా వైశిష్ట్యము

మహా కవి - సరస్వతీ పుత్ర - పద్మ శ్రీ - కళా ప్రపూర్ణ'

డాక్టర్ పుట్టపర్తి నారాయణాచార్యులు

*

గురు ముఖ మనధీత్య ప్రాహ వేదా నశేషాన్
నరపతి పరిక్లప్తం శుల్క మాదాతు కామః
శ్వశుర మమర వంద్యం రంగ నాథస్య సాక్షాత్
ద్విజ కుల తిలకం తం విష్ణు చిత్తం నమామి "

## ప రి చ యు ము

విష్ణు చిత్తులు తెలుఁగు వారికి క్రొత్త కాదు పరమ పావనమై, కలి సంతారణమైన వారి చరిత్రమును శ్రీకృష్ణ దేవరాయలు తనివి దీఱ వర్ణించి, తీర్పరాని యప్పును తెనుఁగువారి తల కెత్తిపోయెను.

విష్ణు చిత్తులకు - 'పెరియాళ్వారులు' అనియును పేరు ఈ 'పెరియ తనము' కాలమును బట్టి వచ్చినది కాదు వీరికి ముందే వైష్ణవమును వెలయించి అందె వేసిన చేతు లున్నారు

## వి ష్ణు చి త్తు ల వై శి ష్ట్య ము

విష్ణు చిత్తులు తమ కవిత్వమునందు గంభీరమైన వాత్సల్య భక్తిని ప్రదర్శించుటచే ఈ బిరుదు వచ్చెనని కొందరందురు ఈ మాట కొంత వఱకు సత్యమే వారి రచనలను జదివినపుడు తక్కిన భక్తి మార్గము లన్నిటి కంటెను, వాత్సల్య భావమును ఎక్కువ యాదరించి రనుట స్పష్టము కాని, నమ్మాళ్వారులు మున్నగు వారు - భక్తి మార్గములలో సర్వోత్కృష్టముగా జెప్పఁబడు నాయకీ భావమునుఁ గూడ ప్రదర్శించిరి మఱి వారి కీ పేరు రాలేదే!

## పెద్ద తనము

కొందఱు భగవంతునిపై అధిక స్వాతంత్ర్యమును వహిం
పరమ పద నాథునకు దృష్టి దోష మంటు నని, విష్ణు చిత్తుల
వంతునకు 'తిరు ప్పల్లాండు'ను జెప్పి రనియు, ఆ స్వాతంత్ర
రులకు లేకపోవుటచే వీరి కీ పెద్ద తన మబ్బె ననియు జెప్పుదురు
వాదమును పై దాని యంత ముఖ్యమే గాని, వేఱు గాడు.
జీవితమం దింకను కొన్ని పెద్ద తనము లున్నవి గురు ముఖ
యేమియు జదువకయే పాండ్యుని యాస్థానమున వైష్ణవమును స్థా
చుట యొకటి. దానికి స్వయముగ భగవంతునిచే నియుక్తు ల
మఱి యొకటి ఆజన్మ బ్రహ్మచారులై, స్వయ ముద్భవ మైన
కూతును భగవానునకే సమర్పించుట మఱి యొకటి ఇట్టి సన్నివేశ
లింకను వారి జీవితమున నెన్ని యుండెనో! కనుక, 'పెరియాళ్వారు
అనెడి మాట - వీని యన్నిటి సమష్టి స్వరూపమే నిజము. సకు
పెద్ద తనము బహు ముఖ మైనది

## అవతారము

వీరు భగవ ద్రథాంశమైన వైనతేయుల యవతార
వైష్ణవుల విశ్వాసము[1] పరమాత్మని చర్మ చక్షువులతో దర్శిం
నారు అవతార స్వరూపులు గాక మ రేమి? అంతే గాక,
శ్శిఖులు? గూడ.[2] ఈ యాచారము 'కేరళము'నందే యుండు
విష్ణు చిత్తులు చేర దేశీయులా?' యని యొక యనుమానము. చా
కముగ నాఁడు 'శ్రీ విల్లి పుత్తూరు' కేరళమునకుఁ జెందియుం
దని కొంద అందురు వీరి తండ్రి ముకుందాచార్యులు తల్లి పద్మ
దేవి. విష్ణు చిత్తుల సమకాలికుఁడైన పాండ్య రాజు వల్లభ దేవుఁ

1 మిథునే స్వాతిజం విష్ణోః రథాంశం ధన్వినః పురే ।

2 విష్ణు చిత్తం పుర శ్శిఖమ్

## కాల నిర్ణయము

తమిళ పండితులు శ్రీ వల్లభు నాధారముగఁ గొని, పెరియాళ్వారుల కాల నిర్ణయమునకుఁ బూనుకొనిరి ఎందుకు శ్రీ వల్లభు లని! వారి ధ్యాన శ్లోకము నందు 'మిథునే స్వాతిజం' అని యున్నది గదా! దీనిఁ బట్టి, యే వేవో యూహాలు ఇది యంతయు పెద్ద గొడవ. కులశేఖరుల విషయమునను కాల నిర్ణయమున నిదియే వాదము కనుక, ఈ నిర్ణయమును చారిత్రకులకే వదలిపెట్టి, మనము తిన్నగా జారుకొనుట మంచిది.

## స్వామి సేవా కైంకర్యము

విష్ణు చిత్తులు వసించినది శ్రీ విల్లి పుత్తూరు[3] నందు వారు గావించు చున్నది - యున్నారు స్వామికి మాలాకార వృత్తి ఈ సేవ వీరే యవలంబించినట్లు గానరాదు సుమా రా రేడు తరములుగా ఈ కుటుంబమునకీ పూర్వ పుణ్య మబ్బినట్లు వారే సెలవిచ్చినారు[4] వీరి పూర్వులు అచ్చము మాలాకార వృత్తి గాకున్నను, యేదియో యొక సేవ యున్నారు స్వామికి చెల్లించి యుండ వలెను. అందుచే, తాము భగవంతునకు ప్రాత దాసుల మనియు, వారు చేసికొన్న (నానం ఉనక్కు పళవడియేన్) మాటి యొక్క విజ్ఞాపనము.

## విశేషణములు - విశేషములు

పెరియాళ్వార్లు తమ రచనలలో నచ్చ టచ్చట తమను కొన్ని విశేషణములు చేసికొన్నారు కాని, అవి యొక్కటియు చారిత్రకముగ నుపయోగపడునవి కావు. భక్త్యుత్సా చాపల్యమే

---

3 విల్లిపుత్తూర్ పట్టర్ పిరాన్, విల్లి పుత్తూర్ విట్టు శిత్తన్

4 ఎన్దై తన్దై తన్దై తమ్మూత్తప్పన్ ఏళ్ పడికాల్ తొడఙ్గి వన్దు వడి వడి యా ట్చెయ్ కిన్ఱోమ్

## శెం దమిళము

వీరు తమ రచన లందు 'శెం దమిళ్' వాడిరి 'చెన్నైన తమిళ మేది?' యనుటలో - యథా ప్రకారము అనే శాభిప్రాయములు. 6నాడు వేంగడమునుండి కన్యాకుమారి వరకు 'శెం దమిళ్ నాడు' అనగా - చేర పాండ్య చోళములయం దున్న ద్రావిడము శుద్ధ మైనది కాని, కాల క్రమమున తక్కిన రెంటికి బో దట్టి, 'పాండ్యము[7] సెం దమిళము నకు నిరుడు గట్టెను' కనుక, విష్ణుచిత్తుల సెం దమిళము నకు ఇది యభిప్రాయ మని చెప్పుట చాల కష్టము అందువలన తెన్గు' వారమైన మనకు 'చెన్నైన తమిళ మిది' 'ఇది కాదు' అని చెప్పుట అధికారము చాలని పని ఇంతకును, వారి కవిత యందు అనేక వ్యావహారికములు చోటు చేసికొన్నవి

## సెల్వ నంబి యభిమానము

పాండ్య రాజు సభలో విష్ణుచిత్తులు జైనాదులను ఖండింపఁ బూని నపుడు 'సెల్వ నంబి' వారికి చాల తోడుపడిన ట్లున్నది ఆ యుప కారమునకు రెండు సార్లు గాభోలు - 'పెరియాళ్వార్లు' తను రచన లందు 'సెల్వ నంబి' పేరు దడవిరి ఇందు తప్పు లేదు విద్యా రణ్యులు విద్యా నగరమునకు త మ్మాహ్వానించినపుడు వేదాంత దేశి

6 వడ వేంగడమ్ తెన్ కుమరియాయిడైత్ తమిళ్ కూరు నల్లుల హత్తు

— (తొల్ కాప్పియమ్)

7 పాండియ విన్నాట్టుడైత్తు నల తమిళ్ (నన్నూల్' వ్యాఖ్య 13 A D

8 అల్వళ క్కొట్టు విల్లా ఆటికొట్టియుర్ కోన్' అభిమాన తుఙ్గన్

శెల్వనై పోల త్తిరు మాలే!

నళిరొన్ద శిలన్ నయాళలన్ అభిమాన తుఙ్గన్ నా డొఱుమ్

శెళిన్ద శెల్వనై ప్పోవ ప్పొట్టు శెఙ్గణ్ మాల్ తిరు క్కోట్టియూర్

కులు రాజులను పొగడుట కిష్టము లేక, 'వైరాగ్య పంచకము' వ్రాసి పంపిరి మఱి వారే, 'జింజి' కోటలో నున్న గోపణార్యు తురకలను దోలి, శ్రీ రంగనాథులను పునః ప్రతిష్ఠించినపుడు - వా సేవను ముక్త కంఠమున పొగడిరి గుణ మున్నపుడు దానిని పొగడ లేకపోవుట నిజమైన పెద్దతనము కాదు గదా! 'సెల్వ నంబుల గుఱించిన మెప్పులో రెండు చోటులను విష్ణు చిత్తులు - 'అభిమా తుంగ' శబ్దమును మఱువ లేదు సెల్వ నంబులు చూపిన యభిమా మెట్టిదో!

## భగవ దనుగ్రహము

పెరియాళ్వార్ల వాస్తవమునకు గొప్ప యదృష్టవంతుల పరమాత్ముడు వారికి దర్శన మిచ్చుటయే గాదు - అసన్య సాధ రణమైన గౌరవము గూడ నొసగెను ఆ శ్రీరంగ నాథుడు చూసిన గౌరవ మిది —

'నెయ్యిడై నల్లదోర్ శోఱుమ్ నియతముం అత్తాణి చ్చేవకముమ్
కైయడై క్కాయుమ్ కరుత్తుక్కు పూణాడు కాదుక్కు క్కుణ్డలముమ్
మెయ్యిడ నల్లదోర్ శాన్దముమ్ తన్దు ఎన్నై వెళ్ళు యిరాక్క వల్ల
పైయుడై నాక ప్పకైక్కొడియానుక్కు ప్పల్లాణ్డు కూఱువనే "

— (తిరు ప్పల్లాణ్డు 8

గరుడ ధ్వజుడైన ఆ రంగ నాథుడు శ్రీ విష్ణు చిత్తులకు - గఱ గమ వలచు నేయి నింపిన ప్రసాదము ననుగ్రహించెను నియత మె య్యాస్థాన సేవకత్వ మొసంగెను కరమున తాంబూలము పెట్టెన కంఠమున పూ మాల వేసెను శరీరము నిండ చందనము నలది, 'నీ

నాకైన వాఁడవని యెంతో బహూకరించినాఁడట ! ఇంకేమి గావలెను ! మఱి - అసదృశమైన యీ గౌరవము వారి కొకనాఁటితో రాలేదు. విష్ణుచిత్తుల వేదనామయ జీవిత మెంతయో యున్నది. రంగనాథుల మాలాకార వృత్తి తమకు ప్రాపించుటకై, వా రొనరించిన తపస్సు[8] సామాన్యమైనది గాదు

## తిరుమంత్ర ద్వయ చరమములు - విష్ణు సహస్ర నామము

శ్రీవైష్ణవులకు ప్రాణాధికములైన పదార్థములు రెండు మొదటిది అష్టాక్షరి రామ కృష్ణాద్యవతారములను వారు భజించినను, జ్ఞానాత్మకమైన నారాయణ స్వరూపమే వారికి ప్రాణము పరమ కారుణికులైన శ్రీమద్రామానుజులు - ప్రపంచోజ్జీవనార్థమై రంగనాథుల గోపుర మెక్కి ఘోషించిన యీ పరమ మంత్రమునే విష్ణుచిత్తులు - తమ జీవితమున సాధించినది - ఈ మహా మంత్రమునే నారాయణము సర్వ వ్యాపకమై, అధికారి భేదమున పరమార్థమును హోమా ద్యనుష్ఠానములచే సర్వ కాలములను వేయి కామధేనువులై పితృకును ఈ విషయమును 'ఆండాళ్' పాపము ! కంఠోక్తిగఁ జెప్పినది.[10]

ద్వయము, శరణాగతి మంత్రమును నారాయణమునకు శంఖ చక్రములవంటివి గదా ! వైష్ణవుల రెండవ ప్రాణము - విష్ణు సహస్ర నామము. అష్టాక్షరీ మంత్రముతో బాటు - 'ఆయిర నామముల' స్మరణము, పెరియాళ్వార్ల రచనలందు అడుగడుగునకు గాన వచ్చును. ఆయన సృజించిన తుమ్మెదలు - పశు పక్ష్యాదులు గూడ 'ఆయిర

8 ఉనక్కు ప్పణిశెయ్య ఇరుక్కుం తవముడైయేన్

10 నారాయణనే నమక్కే పఱై తరువాన్
పారోర్ పుగళ ప్పడిన్దే లో రెమ్బావాయ్

నామములు నేర్చినవే ! ఆ తుమ్మెదలు శ్రీ నాథుని శంఖము వంటి వట ! ఎంత పవిత్ర రమణీయమైన భావము !

## సుగుణములు

విష్ణు చిత్తులలో గనిపించు మరొక గొప్ప సుగుణము 'ఫల శ్రుతుల' నధికముగా చెప్పకుండుట అసలు - వైష్ణవులకు సకామోపాసనయే లేదు గదా ! అందుకే, 'ద్వైతులు' మొదలగువారు రచించిన వ్రతాదులను విశిష్టాద్వైతులు ఉపేక్షించిరి కాని, ఏదైన నొక విషయమును చెప్పినప్పుడు — దానియందు మన కొక యభినివేశ మున్నప్పుడు - అది 'ఇంతటిది, అంతటిది' యనకున్నచో - చెప్పు వారికిని గూడ తృప్తి లేదు ఇది మానవుల యనాదిగానైన చాపల్యము దీనియందు కొంత మేలే యున్నను, ఉన్న కీడు గూడ సామాన్యమైనది గాదు అర్థ వాదములచే ప్రేరేపింపబడిన సాధకుడు - 'గంపె డాశతో' వానియందు ప్రవర్తించుచు వీని కర్మ బలమై, ఆ ఫలము సిద్ధింపనపుడు అపరిణతుండైనవాడు - అనుత్సాహముచే క్రుంగి పోవును మన మడిగిన కోర్కెలన్నింటిని తీర్చుటయే భగవంతుని పని కాదు గదా ! అట్లు తీర్పకున్నపుడు — ఈ లోకము క్షణ కాలమున స్వర్గమో నరకమో యై పోవును ఏ యనుష్ఠానమున కైనను ఫలము పరమ శాంతియే గాని, పాశవిక కామము కాదు, అట్టిచో - సారము లేని యర్థ వాదముల బెంచుట - అవి యెంత యర్థ వాదము లైనను - కొంత మాలిన పని గదా ! విష్ణు చిత్తుల రచనలందు ఈ చిక్కు తక్కువ వారు - 'ఇవి పఠించినచో మన పాపము పోవు' నని పల్కుదురు, 'పరమాత్మకు ప్రియుడ వౌదు' వని యందురు 'మానసిక శాంతి యబ్బు' నని చెప్పగలరు 'ఎప్పుడో వైకుంఠమునందు పరమ భక్తులతో పాటుందు' వని

వా కొందరు ఒక్కొక్క సారి ఇదియును జెప్పరు పాశుర సంఖ్యను మాత్రము పలికి, పైకి పోదురు ఇది సముచిత విధానము.

విష్ణుచిత్తుల శరణాగతి గూడ - ఇతరుల వలె నీరస మైనది గాదు వారి శరణాగతి ధర్మ మిది -

ఉడుత్తు క్కళైన్ద నిన్ పీదకవాడై యుడుత్తు క్కలత్త దుణ్డు
తొడుత్త తుళాయ్ మలర్ శూడి క్కళైన్దన చూడుమి త్తొణ్డర్ కళోమ్ ॥

(తిరుప్పల్లాణ్డు 9)

'మాధవా! నీవు కట్టి విడచిన పీతాంబరమును గట్టి, నీ భుక్త శేషమును భుజించి, నీ నిర్మాల్య తులసీ మాలను ధరించి, సేవ గావింతును.'

ఆహా! ఎంత రమణీయ మైన శరణాగతి !!

## పక్షపాతము

భక్తునకు జ్ఞానాంశ ఎంత ముదిరి యున్నను, తా నుపాసించు మూర్తి పైన పక్షపాత ముండుట సహజము. తులసీ దాసు లొక సారి గోవర్ధన క్షేత్రమునకు వెళ్ళి రట! అట వేంచేసి యున్న దేవుఁడు — మురళీ ధరుఁడు ఆయనను జూచి, తులసి యిట్లను చున్నడు - శ్రియః పతే! నీ రూపము జగన్మోహకమై యున్నది. కాని, నే నేమి చేయుదును! నీవు వేణువును ధరించితివి ధనుర్బాణములు దాల్చని మూర్తికి ఈ నా శిరస్సు వంచి మ్రొక్కఁగను. చూచితిరా యీ భావము!

మహారాష్ట్ర దేశమునకు మిగుల మైన సమర్థ రామ దాసు గూడ పండరికిఁ బోయినపుడు - తులసీ దాసు వలెనే, 'ప్రపంచ మంతయు పాప పంకిలమై నశించుచుండగా - ధను ర్బాణములు

ధరించి రాక, నడుముపై చేతులు పెట్టుకొని కులుకు చున్నావా ? అని కోపగించు కొని రట! అపుడు 'పాండు రంగఁడు' దాశరథియై ధను ర్బాణములతో దర్శన మొసఁగె నట!

## విశిష్ట విశేషము

విష్ణు చిత్తులలో ఈ ప్రవృత్తి కాన రాదు. వీరి యం గాదు - సాధారణముగా వైష్ణవాళ్వారులలోనే ఈ చిత్తవృ లేదు. దీని కొలికి యొక్క దున్నది? విశిష్టాద్వైత సంప్రదాయ మునఁ గలదు. వైష్ణవులకు ఇతరములైన యంశావతారములు సేం ములే యైనను, వా రాదరించిన మూర్తి - నారాయణము - ఁ ముందే విన్నవించితిని అటు తర్వాత వ్యూహములు. పారాయ ములలో - శరణాగతి వ్యాఖ్యానాత్మక మైన రామాయణమే వ కెత్తిన చేయి. 'తిరు ముహాన్' పెరుమాళ్ళ వలె కృష్ణుఁడును వా ప్రీతి పాత్రుఁడే యయ్యును, భాగవతమునకు ద్వైతు లొసంగిన విశిష్టతను విశిష్టాద్వైతు లీయలేదు ఈ విచిత్ర మైన సంప్రదాయ ఆ భక్తులకే సర్వ సమాన మైన దృష్టిని గల్పించి యుండు నని యూహ.

## వాత్సల్య భావములు

విష్ణు చిత్తుల 'యశోద' - తన కొమారుని నూరార్చుట చంద్రుని బిల్చుచు - [12] 'విత్తహన్ వేంగడవానన్' అనుచున్న అళ్లో మహా విష్ణువు యొక్క యవతారములను దడవుచు - 'వాఁడు[13] బాలకుఁ డని పరిభవించెదవు సుమా! వీఁడే కల్పాంతః

12. ధనమున కుబేరుని బోలు వేంకటాచలపతి.

13 పాలక నెత్తు పరి పవము శెయ్యేల్ పట్టొరునాళ్ అలివిలై వళర్న్ద శిఱుక్క నవ విపన్.

రాని యాకుపై పవ్వళించెడు పరమ మూర్తి' యని జాగ్రత్త చెప్పు చున్నది. అప్పటికిని చంద్రుఁడు దిగిరాలే దేమో! 'ఓరీ![14] నా యొల సింగమును నీవు లెక్క పెట్టుట లేదు వీని పరాక్రమమును బలి చక్రవర్తి నడిగి తెలిసికొనుము' అని బెదిరించుచున్నది. ఇట్లే, ఆయన - 'తిరువరంగత్తే కిడందాయ్' అనుచునే, 'అనంత శయనన్ మామణి వణ్ణన్' అని, తిరువనంత పురపు పద్మ నాభులను దడవును. వారి దృష్టిలో - వీరందఱికిని ఏకాకారము - నారాయణ స్వరూపము.

ఒకసారి కృష్ణుఁడు గోవులు గాచుకొని వచ్చుటకై వెళ్ళెను. 'కడియా న్సోడి లణి వేంగడవా' యైన యాతఁడు - గొడుగు' పాద రక్షలు మొదలైన పరికరములు తీసికొనిపోలే దట! ఆ యపాయమును దలఁచుకొని, మాతృ హృదయము పుల కెత్తిన యశోద - ఇట్లు వాపోవుచున్నది ...

" కడియార్ పొడిలణి వేఙ్గడవా! కరుమ్ పోకేఱే! నీ యుకక్కుమ్
కుడైయుమ్ శెరుప్పుమ్ కుడదాడు తరువిక్క క్కాళ్ళాదే పోనాయ్ మాలే
కడియ వెఙ్గానిడై క్కన్నిన్ పిన్ పోన శిఱుక్కుట్ట చ్చెఙ్గ మల
అడియుమ్ వెదుమ్బి ఉన్ కణ్గళ్ శివన్దాయ్ అశైన్దిట్టాయ్ నీ యెమ్బిరాన్ "

— (పెరియాళ్వార్ తిరు మొళి)

'తావి తోటలోఁ గల వేంకటాచలమున వసించు స్వామీ! గొడుగును మఱచితివి పాద రక్షలను గైకొనక పోతివి పిల్లన గ్రోవిని గూడ వదలిపెట్టి పోయితివి బాగుగ నెదిగి నడచుటకే కష్టమైన యడవులలో పశువులను తోలుకొని పోయితివి ఎంతగా నలసితివో నా దేవా!'

14 శిఱియ నెన్ఱెన్నిళఞ్గిఙ్గత్తై యిఱకేల్ కణ్డాయ్
శిరు మైయిన్ వార్తైయై మావలి యిడై చ్చెన్ఱుకేళ్

ఇప్పటి కృష్ణుని వయస్సు - పది పదునాలు గేండ్లు ఆయనను బట్టుకొని ఆమె - 'సీతై మణాళా! 15' అని సంబోధించినపుడును, 'తిరువుత్తైయాన్ మణవాళా' అన్నపుడును మన కెంతయో వింతగా నుండును కాని, వారి దృష్టి యది

అవతారభేదమును - ప్రతీక భేదమును లేనట్లే, పెరియా ళ్వార్ల దృష్టిలో - వయో భేదము కూడ నున్నట్లు తోచదు. యశోద - చిన్న కృష్ణుని తలలో పూలు తురుముటకై పిలుచుచున్నది ఆమె - 'శెంబక ప్పూ చ్చూట్ట వారాయ్' అని యారంభించెను రెండు మూడు చరణములు గడుచు వేళకు యశోద - తనను, తొదరిని మఱచిపోయినది యశోద యనఁగా - విష్ణు చిత్తు లన్నమాట! అట్లు ఒడలు మఱచిన యామె - 'కంచనై క్కాల్ కొండు పాయ్న్దవనే' అనుచు కృష్ణుని ముందు తానే కంసుని జంపివేసినది ఈ నడుమనే - 'నీల్ తిరు వేంగడత్తు యెందాయ్!' అన్న మాట కూడ చోటు జేసికొన్నది అప్పటికే ఆ కృష్ణుడు కామ శాస్త్రమును కొంత భాగము తిరుగవేసిన ట్లున్నది ఆయన చిన్న చిన్న శృంగారములు యశోదమ్మ 'నోటీసు' వఱకు వచ్చినవి 16 ఇట్టి చోటులందు మనకు 'యః కల్ప స్స కల్ప పూర్వః' అను వాక్య మొక్కటియే శరణ్యము ఇట్లు సరిపెట్టుకొనుట - భక్తులైన యందరి రచనలందును గలదు. తులసీ దాసుల కిది మఱింత హెచ్చు

## భాషా సౌందర్యము

విష్ణు చిత్తుల భాష - చాల సుందరమైనది ఆయన పదము నొక్కొక సారి యవిసి పూవుల వలె రాల్చును. చిలుకల గుంపు

16 సీతై మణాళా! సిరు కుట్ట చ్చెంగ మాలే

10 తెరువిన్ కణ్ నిన్ఱు ఇళ వాయ్చ్చి మార్కళై తీమై సెయ్యాదే!

వలె పైకి లేపును ఈ పరిణామము – ఒక పీరియండే గాదు కృష్ణ స్వరూపమును ప్రేమించిన అందఱి భక్తుల యందును, అన్ని భాషల యందును గన్పించును హిందీలో – మీరా, సూర దాసు, రస ఖాను రచనలు శబ్దాలంకార భూయిష్టములు మహారాష్ట్రమునందు – ఏక నాథ, జ్ఞాన దేవాదులలో ఈ గుణ మున్నది. సంస్కృత మున, లీలా శుక – జయదేవాదుల శబ్ద భంగిమలు పండితుల కను భూతము లైనవే. అగ్ని పర్వతమువంటి వ్యాసులు గూడ, ఆ కృష్ణుని వర్ణించు పట్టున దేమో వింత వగలు పోదురు అట్లే, రామోపాస కుల రచనలు తేటనై, గంభీరమై యుండును ఈ విషయ మాలో చించినపుడు – ఆ యుపాసకులకు కాల క్రమమున ఆ యా మూర్తులలోని కొన్ని గుణములు సంక్రమించునా ?' అని నాకు దోచును. ఇది చాల సారులు నే ననుభవించిన భావము

## అలంకారములు

"తిరప్పెడు తఱై మఱై ముహి ల్వణ్ణన్"

కృష్ణుఁడు నల్లనివాఁ డనుటకు – 'ముహి ల్వణ్ణన్' చాలును 'మాఱై ముహిల్వణ్ణన్' అనియుఁ జెప్పవచ్చును. ఇక తక్కిన వన్నియు శబ్ద క్రీడకై యుపయోగించినవే. ఇట్టిదే మఱి యొక పట్టు...

"కుల మలై కోల మలై కుళిర్ మా మలై కొత్త మలై
నిల మలై నీణ్ట మలై తిరుమాలిరుమ్ శోలై యతే"

ఇక్కడ గల చిత్రము 'మలై' శబ్దమును పునః పునరా వర్తించుట దీనితో – అర్థమునకు కొంత మెఱుఁగు తగ్గినది ఈ శైలిలో – సాచన సోముని వచనములందు వలె, వారి యుద్దేశము గానుపింపవచ్చును. కాని, తీవ్ర మైన యుద్దేశము కలిగి ఆవశ్యకమా

యనుటయే యొక ప్రశ్న. ఇట్టి ఘట్టములు వీరిలో అచ్చటచ గన్పట్టును ఈ శబ్ద చిత్రముపై దృష్టి యున్నది గనుకనే ఒక శ శబ్దమునకై యర్థమును క్లిష్ట మొనరించెడు పట్టులును గనుపట్టును

"మూన్ఱెరుత్తవన్ఱై మూన్ఱెరుత్తదనాల్ మూన్ఱెరుత్తాక్కి మూన్ఱెరుత్తై
ఏన్ఱుకొణ్డిరుప్పాలి క్కిరక్కమ్ నన్ కుడైయ వెమ్బెరుమాన్ మణిమార్పై
మూన్ఱడి నిమిర్త్తు మూన్ఱినిల్ తోన్ఱి మూన్ఱినిల్ మూన్ఱురువానన్
శాన్ఱదమ్ పొడిర్ కూర్ కణైయన్ కర్రై మే ల్కుడి మెన్నుమ్ కడినకరే"

పై పాశురములో - 'మూన్రు' శబ్దముపై వారి దృ యంతయు లగ్న మగుటచే, అర్థము సమస్యగా తయారైన శబ్ద చిత్రమునకుఁ జెందిన శ్లేషయు విష్ణు చిత్తులలో అచ్చటచ్చ సాక్షాత్కరించును. శ్రీకృష్ణుఁడు ఒక గోపికను వలయించుకొని పో నట! అది - 'పేతై.' అనఁగా - పదునాల్గేండ్ల సుమారు వయ గలది. ఆ గోపిక తల్లి - ఈ వృత్తాంతమును తెలిసి పసవి ఘట్ట మిది.-

"ఆఢియా నెన్ను మాద మేదై యిన్ పాయ్చ్చియ కప్పరుత్తి
మూడై యుప్పరియా తశెన్న మాతుడైయ మిలశే"

ఇక్కడి 'అడియాన్' అన్న శబ్దము శ్లిష్టము. దానికి - మనియు, సముద్ర మనియు రెండర్థములు. 'చక్రధారి యను యందుఁ జిక్కుకొన్న' దని ఒక యర్థము. 'సముద్రమునదు సుడియం' దని వేఱొక యర్థము

తమిళమునం దిట్టి చిత్రము లెన్నియైనను జేయవచ్చును గుణములలో - సంస్కృతముతో పోటీ చేసికొని నిల్వ గల్గినది ద్రావిడమేనా! అనిపించును.

తెన్నాలి రాముఁడు పాండురంగ మహాత్మ్యమున

“ఏ

కోలంబో ఆవియించు వేడినను వీడ్కొ లాభమో శంభ్రుడు
శ్రీలాగారము వార ఘౌపతము నిప్పి మేలు వాటించునే!

అని ప్రయోగించెను దీనిపై కొందఱాంధ్ర పండితులు — ఇటీవల తెలుఁగు పత్రికలలో తర్జన భర్జనలు చేసి, తొవరికి వారు జాఱుకొన్నారు నను కాలికుఁడైన రాయలు ప్రయోగించిన ‘నీలి కోల’ అను ప్రయోగమైనను వారు చూడరు. కొందఱు తెన్నాలి రాముని పాఠమునే దిద్ది, వ్యాఖ్యానించిరి. ఈ క్రింది ప్రయోగమును చిత్తగింపుఁడు .—

“అలిత్తటి కోట్టల మాణాన్, అడియ పర్కా
చ్చోప్తి త్తిరు త్తుణిల్ కోట్రి నాల్
వేళ తిన్ ముణ్ణిన్రాన్, పేద ముదలే!
యెనవ శైప్ప ఎన్ఱై న్రాన యెన టిక్కరై ”

— (నల చరిత్ర పుకళేంది పులవర్)

ఇట — ‘కోల’ శబ్దమును వరాహ మనియు, వేష మనియు సమర్థముగా కవి చమత్కరించెను. ఇది విషయాంతరము.

శబ్దాలంకార మొ, శ్లేష వైచిత్రియో — అట్లే, రమణీయాలంకారమును కావ్యమున కొక విచ్ఛిత్తి విశేషమే జీవితము మాత్రము కాదు. కావ్య జీవితము — రసమో, వ్యంగ్యమో యగును ఈ దృష్టితో ‘విష్ణు చిత్తుఁడు’ రస వాది. వారి రచనలలో రసము — ‘రూప గోస్వామి’ వంటివా రన్నట్లు, ‘భక్తి’ — లేక ‘శాంతము’

అలంకారము విచ్ఛిత్తి యంటిమి. దాని యందును నూత్న నూత్నములైన యర్థములను దెల్పు టొకి దక్షతయే గదా! నవ ప్రబంధ కవులు పరస్పరము పందెములు వేసికొన్న దింద లోనే పేరి యాశ్చర్య యలంకార మిది,-

'తుడర్ శఙ్గిలికై శలార్ పిలా రెన్న తూఙ్గు పొన్మణి యొలిప్ప
పడు ముమ్మతప్పునల్ శోర వారణమ్ పైయ నిన్రూర్వదు పోల్
ఉడన్ కూడి క్కిణ్గిణి యారవారిప్ప వుడై మణి పఱై కఱఙ్గ
తడదాళిణై కొణ్డు శార్ఙ్గపాణి తళర్ నడై నడవానో!'

బంధించిన సంకెల గల గల మని శబ్దింపగాఁ వంగిన ఘంటల ఘల్లు ఘల్లు మన, దిగాయిన మద జలము కారగా, చిర కలభము నిలచి యూగుట వలె కింకిణు లెలుగింప, మణులు ధ్వనుల్లై ప్రోయు విశాలమ్ములైన చరణములతో శార్ఙ్గపాణి మంద గమనముతో నెప్పుడ నా యెదుట నడచునో!

ఇట్టిదే -

'శక్కరైద్దె సనికొక్కుమ్మిల్ తోన్రుమ్ శిఱుపిఱై ముళై పోల్
నక్క శెన్దువర్ వాయ్ త్తిరై మీదే నళిర్ వెణ్ పల్ ముళై యిలక
అక్కువడ మిడుత్తాత్తు త్తాలి పూణు ననన్త శయనన్
తక్కమా మణి వణ్ణన్ వాసు దేవన్ తళర్ నడై నడ వానో!'

రక్తాకాశము యొక్క అగ్ర భాగమున వెలుగుచున్న బా చంద్ర ముకుళము వలె శ్రీకృష్ణుఁడు నవ్వినపుడు, చెన్నైన యో పెదవులపైని తెల్లని పలు మొగ్గల వరుస ప్రకాశించిన దట! శం మణి హారమును ధరించి కూర్మ్య పద ములతో వెలుగొందు ననంత శ నుఁడు - నా యెదుటి కెప్పుడు వచ్చునో! పై యలంకారములు ప్రయో పూర్వకముగాఁ గల్పించినవి. ఇట్టివే గాక, సహజములై, పరిత

నొప్పింపక, తాము 'నౌవ్వక' యుండు ఉపమ రూపకాదులను వారి యం దడుగడుగునను ప్రత్యక్ష మగును.

"సెంగమల మలర్ కూడ్ వందినం బోల్
దురంటి రుంట కుదల్ తాళ్న్న ముకత్తాన్ "

కమలమును జుట్టు కొన్న భ్రమరముల వలె ముఖముపైఁ బడిన వక్రములైన భ్రమరములు గలవాఁడు "

"వంద మదలై కుడాత్తై వలి సెయ్దు
తంద క్కాళిర్ బోల్ తానే విళైయాడుమ్ "

ఆడుకొన వచ్చిన పిల్లల గుంపు నెల్లను జయించివేసి, మదించిన కలభములవలె తామే వేడ్తై యాడుకొందురు "

కాని, ఈ గుణ మెంత యున్నను, వారి కవితాత్మ మాత్ర మిది కాదు

## భావ స్వాతంత్ర్యము

వీరిలో - భావ స్వాతంత్ర్యమును యెక్కువ. నిజమునకు 'భావ స్వాతంత్ర్యము' నకు పరిధిని నిర్ణయించుట కష్టము ఒకనికి నూత్నముగ నున్న భావము - మఱి యొకనికి ప్రాతది కారణ మేమనఁగా - అందఱు నన్నిటిని జదివి యుండరు గదా! కాని, సంప్రదాయమే నూత్నముగను, ఇప్పుడు మాత్ర మది క్రొత్త భావముగను తోఁచి తీరును

తమిళ సాహిత్యమున 'స్త్రీల జఘనము'ను - నాగము యొక్క పడగను బోల్తురు ఈ భావము 'శిలప్పధికారము'న నున్నది 'సంగ' సాహిత్యమునం దిది సర్వ సామాన్యము కాని, మనకు క్రొత్తది, ఇటే'

సుబ్రహ్మణ్యుని వేలాయుధము కన్నకి రెంగు కన్ను లయో 'శిలప్పధికార' మనును. తమిళములో - మురుకన్' - రూపమున దేవత 'సంధ్య' నొక రాజుగా - 'శిల ప్పధికారము' వర్ణించ ఇవి యన్నియు మనకు నూతన్నములు కారణ మే మనఁగా – సంప్రదాయమే మాఱి పోయినది. మళయాళమున - 'చింతా ష్టయా సీత' అనునది ఒక చక్కని కావ్యము. కుశ లవులు వా వెంట రాముని యజ్ఞమునకు బయలు దేరి వెళ్ళినారు వాల్మీ యాశ్రమమున ఏకాంతమున సీత - గడచిన గాథ నంతయు చున్నది. అపు డామె యెడమ భుజము శుభ సూచకముగా పు తొలచినట్లు కంపించిన దట! నా కీ యుపమానము విచిత్ర సున్నది. మన కిది నీచోపమ. వారికిఁ గాదు. ఉచ్చ నీచవ మనో ధర్మములే గదా! ఈ తర్కమునకు కొంత స్వస్తి రమణీయములైన విష్ణు చిత్తుల భావములను గ్రహింతముగాక!

## శృంగారము

ఒక గోపిక. దానికి సరిగా మాటలుకూడ రా వట! కృష్ణునిపై మరుల్ గొన్నది అపు డా గోపిక తల్లి - తన త దుస్థితిని పలుగురితోఁ జెప్పుకొనుచున్నది -

"పేచవుం తెఱియాత పిళ్ళైయన్ "పెత్తై" యేన్ పెత్తై యివళ్
కూచ మిన్రిని న్రార్కుళ్ తమ్మెడిర్ కోల్కుశింతాన్ మూళ్షైయాల్
కేశవా పెన్రుం కేటలి యెన్రుం కించుకవాయ్ మొడి యాళ్
వానవా ర్కుడల్ మంగై మీర్! ఇవళ్ మాలురు కిన్రాళే"

చక్కని వాసనతోఁ గూడిన కురులు గల పడఁతులారా నా బిడ్డ - కృష్ణునిపై మరులు గొన్నది దానికి సరిగ మాటలు

రావు అమాయకురాలు కాని, నే నేమి సేతును! ఈ కృష్ణుని విషయమున దాని సిగ్గంతయు - కొయ్యగరిటెకు కోల దీసివేసినచో లోన నున్న పదార్థ మంతయు రంధ్రమునుండి జారి పోవునట్లు జారి పోయినది ''

'పెఱుతలై యిరు నాట్కు పోప్పల్ అవన్ పెయ్వన సెయ్తు కొళ్ళ
మైత్తడ ముకిల్వణ్ణన్ పక్కల్ వళర విరు ఒక్కాళే ''

కృష్ణుని విరహమ్ములో ఈ వనిత కళావిహీన యైనది. నాటుకు సిద్ధమై, రెల్లి కాజీన తలలో నున్న మొలక వలె నున్నది దీనిని గైకొని పోయి, కృష్ణుని ప్రక్క నాటినచో - అప్పుడు పసిమికి దిరుగును ''

ఇట్టి భావములు కొనుగువారికి క్రొత్తవైనవి విష్ణుచిత్తులలో కొల్లలు.

## ముక్తకములు

పెరియాళ్వార్ల రచన యొక కావ్యము కాదు పది పదు నైదు వృత్తములు చేరి, ఒక యర్థమును, ఒక ఘట్టమును తెలుపును. వాని యనంతర మొక ఫల శ్రుతి. ఈ రచనల నొక రీతిగా 'ముక్తకము' లన నచ్చును. కొన్ని సంభాషణాత్మకములైన రచనలును అక్కడక్కడ నున్నవి. 'కృష్ణ - యశోదల సంభాషణము', యశోదమ్మకు గోపికలు దూరులు చెప్పుట మొదలైనవి. 'అరాద అంతాది'యు నొకటి వ్రాసిరి. అనగా - తొల్లిటి వృత్తమునందు చివర జెప్పి విడచిన ఒక పదమును ఆదిలో నుంచి - 'మలుపటి' పద్యమును బలుకుట ఇది మన ముక్తపద గ్రస్తమే ఈ సందర్భమున, కేశవాది నామములను జోడించుటయు - వారు చూపిన మనోజ్ఞ మగు మతి యొక్క దక్షత

## వర్ణన విశేషములు

వారు తమ దైవమును చిత్ర విచిత్రముగ బిలతురు. శ్రీ రా-ఘవన్ను లన్నట్లు 'భగవంతుఁ డన్నంతనే శరీరమును పులకించు చి-న్మూర్తి - యగుటచే, వా రూహింపరాయే క్రొత్త విశేషణములు వి-చిత్రులకు దోచును 'ఇరాక్కదవ్ వాళ్ ఇలంగై, పాడాళ్ళా-ప్పడై ప్పోరుదానుక్కు'[17] అని, ఒకపరి గంభీర దీర్ఘముగ నూహి-తురు 'అంటియం పోది లరియురు వాకి యరిన్నె యళిత్తవన్నై'[18] అ-భయంకర రూపమును చిత్రింతురు 'కొత్తుత్త నైవన్ ముడి కె-త్తొత్రనియ అత్తన్'[19] అని, రావణుని పది తలలను రాముని నొకి బా-ణముతోనే కూల వేయింతురు 'తేనె లినియ పిరానే!' అని మ-హారముగాఁ బిలుతురు 'ఎన్నుయిర్ కావలనే మెన్నప్పా!' అ-కన్నిరు వెట్టుకొందురు ఇట్టి వెన్నియో! వారే యన్నట్లు,[20] 'క-తెగ నొట్టుకొని పాఱు సౌందర్య లహరిపై మరల గురియుచున్నట్లు' ను-హార విశేషణములను పై పైని గురియుదురు.

## పుణ్య భూమి

ఆర్యావర్తము పుణ్య భూమియే. దాని నెవరును కా దన-కాని, దక్షిణముగూడ దానికేఁ దీసి పోలేదు. భారతమున పు-ణ్యక్షేత్రము గాని దేది? భారతమే గాదు - ఏ ప్రదేశ మైనను . మనస్సును బట్టి మాఱుచుండును కాని, చాల కాలము నుండి

---

17 రాక్షసులు వసించు లంక పాడగునట్లు సైన్యములు నడపినవానికి.

18 సంధ్య యందు నృసింహావతారమెత్తి శత్రువును జంపినవానికి.

19 తలల గుత్తి గల రావణుని లంకలో నోడించినవాఁడు

20 ఇంబవెళ్ళ త్తిన్ షేల్ పిన్నెయ్యుం పెయ్‌గు పెయ్‌దు.

ఆర్యావర్తమే పుణ్యక్షేత్ర మనియు – ఆర్యులే సర్వోత్కృష్ట లనియు నొక భావము మనలో పాదుకొని పోయినది. ద్రావిడ నాగరిత, సంస్కృతి – ఆర్య సంస్కృతి వలెనే - ప్రాచీనము, ఉదారము అను నూహ ఈ నాటికిని మనకుఁ గలుగలేదు.

కన్నడమున వీర శైవ కాలమందును, మహారాష్ట్రమున వైష్ణవ భక్తుల కాలమునను 'దక్షిణావర్తమును పుణ్య భూమియే' యను వాదము మొలకెత్తినది. తమిళమున నంతకు మున్నే యున్నది. విష్ణు చిత్తులకు ఆర్యావర్తముపై ద్వేషము లేదు.[21] వారి కెవ్వరితో, విరోధము లేదు భక్తిసాధన - రాజకీయముల వంటిది కాదు గదా! అందుకే వారి కృష్ణుఁడు - ఉత్తరము వలెనే దక్షిణమున, తిరుగును 'వేంగడమున[22]' వసించును. కుంభ కోణమున[23] శయనించును శ్రీరంగమున వెలయును కృష్ణుఁడు పుట్టుక జరిగినది తిరు కోట్టి యూరునం దట! విష్ణు చిత్తుల యశోద ఇట్లు పను చున్నది

"కొంగుం కుడందయుమ్ కోట్టి యూరుం పేరుమ్
ఎంగుం తిరిందు విళైయాడుం ఎన్మహన్"

ఇన్ని క్షేత్రములను దడవిన పెరియాళ్వార్లు - నరసింహావతారమును పలు మారులు ప్రశంసించినను, అహోబల క్షేత్రము నెందు వలన స్పృశింపలేదో !

---

21 వట తిశై శాలక్కిరామం వైహుందం తువరై యయోత్తి
ఇట ముడైవ తరియవశై యుడైయ యన్పురు డోత్తమ నిరక్కై

22. కడియూ ర్వాడి అణి వేంగడవా !

23 కుడందై క్కిడందానే

# భక్త్యావేశము

వారి రచనలను జదివినపుడు — విష్ణుచిత్తులు ఎంత యార్ద్ర హృదయులుగా దోతురు ! కాని, వారి యావేశము భగవత్స మగుటచే, ఆత్మికమై, పవిత్రమైపోయినది తిరుక్కోట్టి యూర కృష్ణ జన్మమైన ఏట ! అపు డా సంతోషమున నొడలు మఱచి గోపికలు ఎట్లు ప్రవర్తించుచున్నారో చూడుడు —

"ఓడువార్ విడువార్ ఉహంద లిప్పార్
నాడువార్ నంపిరాన్ ఎంగుత్తా నెన్బార్
పాడువార్గళుం పల్పరై కొట్టు నిన్రు
ఆడువార్గళుం ఆయిత్రు అయ్ప్పాడియే ''

అపుడు గోపకు లందఱు పరుగిడువారు పరుగెత్తుచు - పడె వారు, సంతోషమున వెదకువారు, డోళ్ళు కొట్టి కొట్టి, సంతోషప వర్తించువారు ''

"పేణి చ్చీరుడై ప్పిళ్ళై పిరంతినిల్
కాణత్తాం పుకువార్ పుక్కు ప్పోదువార్
ఆణోవాప్పార్ ఇవన్ నేరిల్లై
గాణ్ తిరువోణత్తాన్ ఉలకాళు మెన్పార్గళే

భాగ్యశాలి యైన కృష్ణుని వలచి, చూచుటకై వచ్చువా చూచి పోవువారు వీని సమాన మెవ్వరును లేరు తిరువోణమ జన్మించిన వాఁడు వీఁడే వీఁడు నిశ్చయముగా భూమి నేలు ననువార

"ఉఱియై ముఱ్ఱత్తు ఉరుట్టి నిన్నాడువార్
నఱునెయ్ పాల్ తయిర్ నన్నాక త్తూవువార్
సెఱిమెన్ కూన్దల్ అవిళ త్తిళైత్తియెంగుం
అఱి వళిన్దనర్ అయ్ పాడి యాయిరే "

ఇండ్ల ముంగిళ్ళలో ఉట్లు దొర్లించి, నిలిచి యాడువారు పాలు, పెరుగు, మజ్జిగ, నేయి మొదలైనవి సంతోషమున దొర్లించువారు నిడుదలైన కురులు ప్రేలాడ, ఒడలు తెలియనివారు ''

ఇంతటి యావేశము - 'వక్తవ్య మేవ వక్తవ్యమ్' అన్న పద్ధతియు నున్నది గనుకనే, ఒకసారి మన మనౌచిత్య మనుకొను[24] పరిధులను గూడ వారు స్పృశింతురు

## దాస్య భక్తి

విష్ణుచిత్తులు వాత్సల్య మధుర భావములను పుష్కలముగఁ జెప్పినను, మూలాధారమైన దాస్యభక్తిని మాత్రము మఱచిపోలేదు ఎవరేమన్నను, సఖ్య వాత్సల్యాది భావములు దాస్యభక్తి యను మహాసముద్రముపైని వచ్చుచు పోవుచుండు అలలు మాత్రమే

వారు స్వభావతః అమాయకులు. ఆ చిత్తవృత్తి - యెవ రేది జెప్పినను నమ్మునది[25] వారికి ప్రాక్తన సంస్కార బలమున, అష్టాక్షరీ మహామంత్రము లభించినది అది సర్వోత్కృష్ట మను విశ్వాసమును వేఱులు పాదుకొన్నది[26] వారి భక్తి సాధన - త్యాగరాజాదుల వలె మానసికమై, ఆత్మార్పణా రూపమైనదే గాని, కాల ద్రవ్యాపేక్ష గల తాంత్రికము కాదు భక్తి[27] యనెడు కోవెల గట్టి, మాధవుఁ డనెడు దైవమును ప్రతిష్ఠించి, ఆశ యను పూలచే పూజించిన మహా

24 తిహాత్తన్న యెంగుం పుదైయర
పెరు సీర్ తిరు యెణ గంగయిలుం పెరియదోర్ తీర్థఫలమ్

25 వన్నై తీమై కణన్ను పరియేన్

26 మూల మాకి యగి యత్తై మున్ను మాత్తిరై ఉన్నై వాంగి
నేలై వణ్ణనై మేవు తిరాకిల్ విణ్ణకత్తు నిల్ మేవలు మామే

27 మార్వ మెన్నకోర్ కోలుల మైత్తు
మాతవ నెన్ను దైవనైత్తై నాట్టి
ఆర్వ మెన్న తోర్ పూలిట వల్లార్కు

యిస్పట్టశాలి యాయన 'కూడ్రై కోరివై వేండుప దిల్లై' య
భగవంతుని కోసమే ప్రేమించిన నిష్కామ భక్తి వారిది. క
ఆశ్చర్యము మైనను, వారి భక్తి - మన మనుకొనునంత సులభము
- భగవంతుడు స్వీకరింపలేదు విష్ణుచిత్తుల భగవ ద్వేదన, సాధ
కొన్న సంవత్సరములపాటైన నుండి యుండును

## ప్రేమ భక్తి

సూక్ష్మముగ గమనించిన చో - విష్ణుచిత్తుల దాస్య భ
కొన్ని పరిణామ భేదములను మనము గమనింప వచ్చును మాలా
వృత్తితో వైభవముగ నారంభమైన వారి సాధన - పోను పోను, ప్ర
భక్తిగ మారిపోయినది కడకు, వా రందుకొన్న స్థితి యిది :-

"వాక్కు తూయ్ మెయిలా మైయినాలే మాధవా ! ఎన్నైవాయ్ కొళ్ళ మా
వాక్కు నిన్నై యల్లాదిలాను, నాన తఘ్భవన్ ఎన్ వళ మ్రను
మూర్ఖ ప్పేచు కిన్రానిన నెన్ను మునివా యేలుం యెన్ నావిను క్కాంద్రేన్
కొత్తై వాయిలుం కట్టురై కొళ్ళర్ కారడా ! కరుళ క్కొడియానే "

దేవా ! నా వాక్కు అశుద్ధ మైనది అందుచే, నీ నామమ
దలచు యోగ్యత నాకు లేదు కాని, నా నాల్క నా వశమున లే
నే నేమి సేతును ! ఈ మూర్ఖుడు నా నామ మెందుకు జపి
చున్నాడని కోపగింతు వేమో ! నా భయ మదే ! నల్ల నైన న
జూచినను, నీ పని భ్రమింతును గరుడ ధ్వజా ! నారాయణా ! !

"పెళ్ళై పెళ్ళత్తిన్ శేలారు పాంబై మెత్తై యాకవిరుత్తు - తన్నైలే
కళ్ళ వితిత్తై రొక్కిన్ర మార్గం కాణ లాకాళ న్రాసైయినాగ్
ఉళ్ళత్తోర తరంతె తిర్విమ్మి ఉరోమ కూపంగళామ్ కణ్ణా రాకా
తుళ్ళం చోరత్తు యిలదై క్కు శ్ళన్ చొల్లాయ్ యాను న్నైత్త తిరుమ

ఇది - భక్తి భావము యొక్క పరాకాష్ఠ. ఈ సందర్భముననే వారిట్లనుచున్నారు

"రంగ నాథా! స్వచ్ఛమైన పాల సముద్రమే పడకగా, కల్ల నిద్దుర గొను నీ పాలకమును జూతమను ఆశచే, నా మనసు కరగును. అదే ధ్యానమై పోవును పులకల పరవుగ లేచును కన్నీటి బొట్లు ధార గట్టును కంటికి తూగు లేదు స్వామీ దయ చేసి, నిను జూచు మార్గ మేమిటో తెల్పుము"

ఈ భావము హృదయ ద్రావకమైనది దాస్య భక్తిని వెల్లవిరించిన ఒక్కొక్క పాశురము — ఒక్కొక్క రత్నము.

మానవునకు వచ్చు మృత్యువు - విష్ణు చిత్తులకు భయంకరముగఁ దోచినది కనుకనే, మృత్యు తాండవమును వారతి బీభత్సముగ వర్ణించిరి.

" కొల్లలాం పోలే ఉన్ నామ మెల్లామ్ శొల్లినేన్ "

" నారాయణా! పలుకఁదగిన నీ నామములన్నియుఁ బల్కితిని. నీవు రాక పోతివి ఇఁక నా కేమి గతి? యమ దూతలు వచ్చి, నన్ను బలియ ద్రొక్కు నపుడు నేను నిన్నెట్లు దలఁతును?"

"అప్పోదైకిప్పోదే శొల్లి వైత్తాన్ "

" అందుకే - ఇప్పుడే చెప్పుకొనుచున్నాను."
ఇట్లు అనేక సారులు - ఆ రంగశాయి కడ మనవి జేసిరి.

" విల్లి మినెన్ను ముపాయ మిల్లై "

" నీవు తప్ప, వే రుపాయము లేదు" అని భయపడిరి.

'ఇని ప్పోగ విడువ దులమే'

"కనుగొన్నానులే! ఇంక నిన్ను విడతునా?" అని, ఒక ధైర్యము దెచ్చుకొనిరి

"వ శైత్తు పైత్తాన్,,

"భక్తి యను నలతో నిన్ను బంధించితిని" అని, సంతసించి

"ఉన్నై కొండెన్నుళ్ళే వైత్తేన్
యున్నైయు మున్ని లిట్టేన్"

"నన్ను శరణాగతుఁడుగ జేసి వైచితిని నీ దివ్య రూపమును నా యందు ప్రతిష్ఠించు కొంటిని"

అనెడు ఆత్మార్పణ రూప మైన శరణాగతి - అనుభవము వచ్చులోపల, విష్ణు చిత్తు లనుభవించిన భావ భేదము లెన్నో ఇన్ని కష్టములు బడి, ఆ భగవ ద్దర్శనము లభించినపుడు - స్వాదు న భుంజీత' అనునట్లు -

"మాణిక్క ప్పట్టార్ కండీర్"

అని, ప్రపంచము నంతయును ఆహ్వానించిరి. అది వా పరమ కారుణ్య భావము.

## యశోదమ్మ భావనలు

"వరుహ! వరుహ! ఇంగే! వామనంబీ!"

ఎవరది! మాతృత్వ మంతయు గూడు గట్టుకొని పిలుచున్నది! ఆమె యశోద. విష్ణు చిత్తులు తమ కవితా లోకము సృష్టించిన యశోదమ్మ ఆహా! పిలుపు ఎంత బాగున్నది! ఆ కృష్ణుఁడు శ్రీ విల్లిపుత్తూరునందు తిరుగుచున్నాఁడు[28] అతఁడు పల కించునది 'తిరుప్పో నగరున'నట![29] కృష్ణుని గన్నందుకు

యశోదమ్మకు జనులు సేయు పొగడ్తలు అంత యింతని గాదు. ఆ పొగడ్తల కామె మురిసిపోవును[30] ఆమెకు కృష్ణునిపై అమితానురాగ ముండదా ? కన్న తల్లుల కుండవలసిన గుణము లన్నియును సార్వాత్మనా ఆమె కున్నవి ఈ కృష్ణుం గూర కుండడు. ఏని దుర్మార్గములు వయసు మించినవి ఇంటి పరువును మించినవి. ఊరు వా రామెతో దూరులు జెప్పెదురు ఆ దూరు లామె నమ్మదు నమ్మినను - ఎవ్వరే గాని వాని నేమియు ననగూడదు తానును ననగూడదు ఇది యీమె ప్రేమ ఊరువా రెంతకని యూరకుందురు? ఇంటి తన మెంత పెద్దదైనను, దుర్మార్గమునకును ఒక హ ద్దున్నది గదా ! వాడు వచ్చి, 'అమ్మా ! [31] ప్రభుత్వ మున్నది - అన్యాయము సేయుటకేనా ?' అని ప్రశ్నింతురు 'బలె[32] మంచి కొడుకును గన్నా వులే ! పట్టి పోకిరి పిల్లవాం' డని, తెగించి యందురు యశోదమ్మకు కోపము వచ్చును. ఆమె[33] తనపైనను, వారిపైనను కోపగించి, దురుసోక్తు లాడును అప్పటికిని ఆమె కీ దుర్మార్గములు కృష్ణుండు చేసినాం డన్న విశ్వాసము లేదు ఎవరో[34] కొంటె పిల్ల లందఱు చేరి, చేసి, వాని నన్నిటిని కృష్ణుని తలపై వేయుచున్నా రని ఆమె యూహ. భాగవతము నందలి యశోదమ్మ ఒకసారి కృష్ణుని కట్టివేసినది ఈమె

28 పిళ్ళి పుత్తూర్ ఇని తమర్గాతు

29 తెళ్ళిరై చ్చూళ్ తిరు ప్పేర్ క్కిడన్ద తిరు నారణా!

30 ఎన్న నోమ్బు నోత్రాళ్గొలో! ఇవనై ప్పెత్రవ యిరుదైయ్యాళ్ ఎన్నుం వార్తై యెదు విత్త యిరుడీకేవా! ముత్తై యణావే.

31 అరుహిరుందారీ తమ్మై అనియాయం సెయ్వదు తాన్ వరక్కో ఆశోదాయ్.

32 పుళ్ళర్ పుళిప్పెయ్ తాలొక్కుం తీమై పురై పురైయాల్ ఇవై సెయ్య వల్ల అణ్ణర్ కణ్ణానోన్ మహనై ప్పెత్ర ఆశోద నంగాయ్! ఉన్మహనై కూవాయ్

33 కొల్లి లర చిప్పడు దినంగాయ్

కా భావన గూడ భయంకరము ఆమెకు కోపము వచ్చినపుడు గట్టిగా నరచును. అంతే ఇఁక నామె తన కుమారుని బిలుచు పిల్పులు! ఒహో! వాని నిండ, నందన మందార మధూక ధార! ఒక్కొక్క విశేషణ మొక్కొక్క భక్తి భావ స్రోతస్విని. వాని నన్నిటిని చదివి యానందింపవలె నంతే! ఈ యశోదమ్మకు[35] శ్రవణ పాండిత్య మొక్కవ

యశోదకు కృష్ణుఁడు పరబ్రహ్మ మని బాగుగాఁ దెలియును ఆయన లీలార్థమై తన యింట నవతరించినవాఁ డనియు, ప్రతి కల్పమునను ఇట్టి లీల సాగుచుండు ననియు యశోదమ్మ యెఱిఁగిన విషయమే అందుకే ఆమె [36]బాణాసురుని కథ తడవును [37]బలిని గట్టిన గాథ పనవును మత్స్య[38] కూర్మా ద్యవతారముల వృత్తాంతములు ప్రస్తావించు ఇంతే[39] గాదు — శ్రీ కృష్ణుఁడు చేయఁబోవు గాథలను గూడ ఆమె ముందే చెప్పివేయును కృష్ణుని లీల వలెనే, యశోదమ్మ లీలయును చిత్రమైనది ఆమె కృష్ణుని తల దువ్వి, జడ వేయుటకై బిలుచును వాని నాడించుటకై చంద్రు నాహ్వానించును.

---

34 పల్లాయిరవర్! ఇ ప్పూరిల్ పిళ్ళైగళ్ తీమైహళ్ సెయ్‌వార్ ఎల్లాం ఉన్మేలన్ఱిప్పోదు మెంబిరానే! నీ యింగే వారాయ్

35 వలసేమవుత్త కిట్టుక్కాళ క్కేట్టేన్

36 మున్నలోర్ వెళ్ళి ప్పెరు మలై కుట్టన్ మొదు మొదు విరం తోడ పిన్నై తొడందదోర్ కరుమలై కుట్టన్ పెయర్త్తు అడియాడు వదు కోల్ బాణాసురుని యుద్ధమున ఈశ్వరుఁడు పరుగెత్తగా - ఆతని దరిమికొనిపోయినట్లు

37 మాపలి యన్దై చ్చెన్ఱు కేళ్

38 పన్నియుం, ఆమైయ్యుం, మీనము మాహియ పార్కడల్ వణ్ణా

39 నాంతక సేంతిరునంబి! శరశెట్టు, తాళ్ళన్ని ధనంజయ ర్కాహిధర్త యిళి చేంత ర్కాశుట్క విజయన్ పత్తిని న్ జేర్, ఊర్త్తువన్ మెన్నై పురం పుళ్ళువాన్ "

శ్రీకృష్ణుఁడు శంఖ చక్రా ద్యంకితములైన పాదములతో భూమిపై వింత చిత్రములు స్ఫురింపఁజేయుచు వచ్చి, వెనుక నుండి త న్నెప్పుడు కౌఁగలించునో యని యుబ్బి పోవును కృష్ణునకు తలంటు పోయుటకై యాహ్వానించును కాని, పెద్ద విచిత్ర మే మన, అన్ని భావము లందును కృష్ణుఁడు శ్రీమ న్నారాయణ మూర్తి యనుట ఆమె మఱు వనే లేదు. రెండు విరుద్ధములైన ఈ మహా భావములను ఆమె ఎట్లు పోషించుకొనుచు వచ్చినదో! అని యొక ప్రశ్న. కృష్ణుని యశోద ఆడించుచున్న ఒక ఘట్టమును చూడుడు –

"పెంగమల క్కుడలిన్ శిట్టిదల్ బోల్ విరళిల్
మిన్నిహాళ్ అడహాటం కింకిణియుం అరెయిల్
తంగియ పొన్వటయుం తాళిన న్మాదులయున్
పూవొడు పొన్మణియుం మోదిరముం కిరయుమి
మంగల ఐంబడియుం తోళ్వళయుం కుళైయుం
మకరముం వాళికళుం చుట్టియుం ఒత్తి లిహ
ఎంగళ్కుడి క్కరుసే! ఆడువా! శంకిరై
ఏడులహుం ఉడయాయ్! ఆడువా! అడుహావే!"

"ఎఱ్ఱ దామరలతో సమానమైన పాదములును, దాని తేకులతో సమానమైన కాలి వ్రేళ్ళును, ఉంగరములు – కింకిణులు – పీతాం బరము – ప్రవాళ మాల – దానిమ్మ పూ మాల – మండలములు – జుంకీలు మొదలైనవి ప్రకాశింప, కృష్ణా! ఒక సారి చేతులుగట్టుము!"

ఇట్టి పరమ లలితమైన పీతాంబరుని శైశవమును దలంచు చునే యామె –

40"కోళరియన్ ఉరువంకొండు అవుణ నుడలం కురుది
కుళంబి యెళ కూర్వుహిరాల్ కుడైవాయ్ !
మీళ అవన్ మహన్నై మేన్మై కొళక్కరిది"

స్వామీ ! నీవు మున్ను ప్రహ్లాదుని రక్షించి, గౌరవము గల్గించుటకై నరసింహ రూప మెత్తి, కఱకు రక్కసుని యెడలు వాడి గోళ్ళచేఁ జీల్చి, గండి వేసితివి అపుడు రక్తము జిల్లుమని పైకెగిరెను''

అనెడు నొక బీభత్స రూపమును గూడ మన యెదుట నిల్పినది. ఇంతకును చెప్పవచ్చిన దేమనఁగా — యశోదమ్మను త్రోసి వచ్చి, పై పాశురములందు నిల్చినది - విష్ణుచిత్తుల చిత్త ప్రవృత్తి యనియే పై దానియం దొక చోటనే గాదు - ప్రతి సందర్భము నందును ఇంతే విష్ణు చిత్తుల కవితలలోని యశోదమ్మ — ఆడు వేషము వేసి కొన్న విష్ణుచిత్తులు 'అయ్యె యురైత్తన్' 'అశోదన్ మహన్ తన్నై కాప్పిట్ట మాట్రం' అనుచు, వారు అంతను లందుఁ జెప్పిన మాటలు ఔపచారికములు మాత్రమే

పెరియాళ్వార్ల 'యశోద' - తాను విష్ణుచిత్తుల నని మఱువని పోవుట పెద్ద ఆశ్చర్యకరము కాదు కాని, పెరియాళ్వార్లు మాత్రము - తాము విష్ణుచిత్తుల మని మఱచినది పెద్ద చిత్రము. వారికి 'వాత్సల్య భక్తి' యెద లోతులు కంటినది. కొన్ని భావములు వారు చెప్పినపుడు 'పురుషుఁ డిట్లు చెప్పఁగలఁడా?' అని సందేహము దోచును. ఈ

---

40 ఆముక్తమాల్యదలో — రాయలు పల్కిన ఈ క్రింది పద్యము - పై భావము యొక్క పెంపకమే.

''అసుధేంద్రాళయ కుంది కాచ్చ రుధిర వ్యాప్తస్వర ధ్వాయఁగా
చి, సముద్యత్త్రపతి సింహ మత్సర ఖిళ చ్ఛేష్టన్ ద దుద్దామ దీ
ర్ఘ నటా ఘూటము చెల్లగించు గతి నాంత్రశ్రేణిఁ గిన్కన్ వెరం
జనిత క్రూర ఖవ స్వభావకులు ప్రోచున్ మర్త్య పంచాననా !''

కింది భావము జూడుడు యశోద - శ్రీ కృష్ణుని చనుగాలు ద్రావు చున్నది పిలచుచున్నది –

' ఎన్నల్లాలేరి

ఒరు ములైయై వాయ్ మడుత్తు ఒరుములైయై నెరుటి క్కొండు
ఇరుములైయుం మురై మురైయా ఏంగి ఏంగి యిరుం తుడాయే "

" కృష్ణా! నా తొడ నెక్కి, ఒక్క కుచమును నోట జేర్చి, మఱి యొక దానిని చేతితో నులుముచు, రెండు స్తనములను మార్చి మార్చి, దూటి దూటి త్రాపుము "

ఒకవైపు ద్రావుచున్నప్పుడు, వేఱొక వైపును చేత నలుపుట శిశువుల స్వభావము. దానిని వీ రెంత బాగుగఁ బసి కట్టిరి! ఎంత బాగుగఁ జెప్పిరి! ఇవి తాను వర్ణించు సన్నివేశమున సంపూర్ణముగ లీన మైననే దప్ప, ఇట్టి యూహాలు తట్టవు 'వాత్సల్య భావ' వర్ణనమున నిట్టి యూహాలు కొల్లకొల్లలుగా నున్నవి. స్థాలీ పులాక న్యాయముగఁ జూపితి నంతే!

## గోపికలు - గోపకులు

యశోదకు తరువాత విష్ణు చిత్తులలో మన భావము నాచికొను వారు గోపికలు. వారిలో గోపాలురు గూడ గలరు. గోపకులు పెద్దవారు గూడ నున్నారు. [41]వారి స్వభావమును ఒక్క చోట మాత్రమే పెరియాళ్వార్లు వర్ణించిరి. ఇఁక చిన్న చిన్న గోపకులు - కృష్ణుని సమ వయస్కులు, చిన్నవారు, పెద్దవారు కొక్కొల్లలు, వారితో కృష్ణుఁ డాడుకొనును. ఈ యాటలలో అనేక విధాల పిల్లాటలు మొదలు కొని, పెద్దాటల వఱకు కృష్ణుఁడు చేసిన చేతులలో - గోపకులకు

41 కొండ తాళుకొంలక్కొడు, తండినర్ పరియాలై శయవత్తన్ వింద ముల్లై యరుం బన్న పల్లినర్, అండర్ మిడింప్పుహుందు నెయ్యాడినార్

భాగము కగ్గు మొదటినుండి కడ వఱకు విష్ణు చిత్తుల కవితలలో ప్రస్ఫుటమై గూడ వీరు పోజరు.

గోపకులలో అనేక చిత్త వృత్తులను పెరియాళ్వార్లు సృష్టించి కొందఱు ప్రౌఢలైనను, నంద నందనుని బాలకములకు మురిసి గోపాలు మురియుచున్నారై తామే ఆశ్చర్యపడువారు కొందఱు బాలికలు చెనను, మనసున కృష్ణునిపై వలపుగొన్నవారు. ఒకతె యశోదమ్మతో 42 అమ్మా! మీ వాడు మా యింటిలో దూరి, దుర్మార్గము చేయుచున్నాడు కొంచెము పిల్చుకోవమ్మా! అనుచున్న ఆమెను మాత్రము నంద రాజుపై ఏ వలపు గిలపు లేదు ఇల్లా ధర్మము లన్నియు గల యొక సామాన్యపు యిల్లాలు శ్రీకృష్ణుడొక గోపిక నెలయించి, లేవ దీసికొని వెళ్ళినాడు ఆమె తల్లి ఈ విషయ మందరితోడను చెప్పుచున్నది ఒకతె తన బిడ్డ కృష్ణుని వలపుగొన్నది ఆ వలపు పోవుట కేది మందని యడుగుచున్న ఇల్లు గోపికలలో అనేక రకములు

వ్రజ కాంతలలో మన మనసు బాగుగ నాకర్షించువారు పెరియాళ్వార్లు సృష్టించిన ప్రేమోన్మాదినులు వీరి చిత్త వృత్తుల విష్ణు చిత్తులు అతి కరుణముగ వర్ణించిరి ఒక గోపిక దాని ఒళ్ళెల్లను ధూళి ధూసరిత మైనది ఆమె యెవరితోడను మాట నేర్వదు చీర గట్టను నేర్వ దట! ఇల్లి దాటి యెఱుగదు పాపము కృష్ణుని శరీర చ్ఛాయ వంటి రంగు గల నల్లని అవిసె పూవును గౌరవించి, అక్కడ ముద్దిడుచున్న దట! వేళ్ళతో తెమంటిలో నెప్పుడును శంఖ చక్రము లాదిగా గల బొమ్మలు చిత్రించుచు, విలపించుచున్న ద

42. మారి కొళ్కాణ్యదే ఇ ప్పైయ్య అలవే

ఒకటి గొనుక గోపిక, కృష్ణునకు తాను తగిన దాన నని భావించుకొనుచు, గాగసుగ నలంకరించుకొన్నది చేతుల వంకి, కరముల కంకణములు పెట్టుకొన్నది అద్దమున తన కులుకు జూచుకొని, చక్కని చీర గట్టి, ంతలో నేమి దోచినదో! వేడిగా నిట్టూర్పు నట! మజల ధైర్యము గాడ దెచ్చి, వాని గుణములు పనవు కొనుచు, ఓదార్చుకొనుచున్నది ఈ రీతిగా అనేక దశా భేదములు

## గోపాల కృష్ణుడు

శ్రీ రాముడు మొదలగు ఇతర అవతారములపై విష్ణుచిత్తునకు ఉస నున్నను, వారికి మిరులు కృష్ణుని పైననే ఆ కృష్ణుడు — వాల దుర్మార్గుడు వాడు తల్లి మాట వినడు. ఊరి స్త్రీతలలో యసు చిన్న దైనను, పెద్ద చేతలు చేయును [43] పక్కింటి – పొరు ంటి పిల్లలను గిచ్చి యేడ్పించును. వారిని కన్నె త్ర జేసి బెదరించును. ఆవు దూడల చెవులలో ఎఱ్ఱ చీమలను బట్టి వేసి యేడ్పించును. యశోదమ్మ – తలకు బోయుటకై యొడలికి నూనె బూయగా — నిపై మన్ను రాచుకొని తిరుగు లాడును కనం బడిన యూడువారికి ఎగలు చేయును అందులో – వయసు తారతమ్యము గూడ లేదు. ఈ చేతలలో – దిన మొకరు యశోదమ్మ యింటి పైకి వత్తురు. మొకు కొడుకుపై అభిమానము గంపె డంత విష్ణుచిత్తుల

43 ఇళం పిళ్ళై కిళ్ళి యెఱప్ప, కణ్ణై ఎురట్టి విళత్తిక్కిళ్ళ కిఱ్ఱుడు సెయ్యుంపిరానే।

44 కన్ను గళో రచ్చ్చి విల్, కట్టెరుంబు పిడిత్తిట్టాల్ తెన్నిక్కిడు మాకిల్, పెత్తెయ్ తిరట్టి విళ కుమా కాల్పన్

46 పెణ్ణై యలైంద కుఱుంగుం, వి శైయాడు పుకుదియుం కొండు

కృష్ణుఁడు – దక్షిణ దేశమున మాత్రమే తిరిగెను బృందావన వైపు అడుగే పెట్టలేదు

## వేణు గానము

కృష్ణునిలో ఎన్ని పిల్లాట లున్నను, వాఁడు 'వాయి ఋ పిల్లన గ్రోవి పలికించెనా! ఆ స్వామియే వేరై పోవును. శ్రీ కృష్ణ ఇన్ని దూరులు జెప్పిన గోపికలు – 46 మొదలు జాఱి, ఒడలు ఋ లోక నీతిని విడచి' చెమటలు గాఱ వచ్చి' వారి యెదుట నిల్తు! వారి కపుడు – 47 కొప్పులు వదలిపోయినదియు తెలియదు మాత్రమే గాదు – ఆకాశమున రంభాదులైన యప్సరలు గూడ నిలత 48 వారు తమ నర్తనము లే మఱచిపోదు రట! 49 నారదుఁడు, తుంబురుఁడును తమ తమ వీణెల కథ మఱచి, నిర్విణ్ణులై నిలచిపోద చెట్లపై నున్న పక్షులు కూఁగు మఱచి, గూళ్ళలోనే యుండి, ని మ్ముగ విను నట! 50 హరిణము లు మేత మఱచి, సగము కొరికిన యట్లే నేలవ్రలం దుండగా – వ్రాయఁబడిన చిత్రముల వలె ని వాని వేణు గాన మాలించు నట! చిత్ర మైన సృష్టి వంటి వేణు గానము – సర్వ సమ్మోహనము

---

46 ఇళన్ కొంగై కుతుక లిప్ప, ఉడలుక విళ్ళ యోగుమ్
కావలుం కడంచు కఖురుమాత్తె యూహా కనిత్ను నిన్గయతే

47 మలర్ కూందల్ అవిళ.

48, అటల్ పాటలై మూరి నణ్తమే

49 తుంబురువోడు నారదనుం తంతమ్ వీణై మఱంతు

50 మాన్కుంగళ్ మేయ్మై మరందు, మేయ్త పుల్లుం కడైవాయ్ వళివోడ ఇ
పాదుం తులుం కొప్పుడై పెయరా, ఎళుదు పిత్తిరంగళ్ పోల నిన్రనవే

## ఉపదేశములు - సందేశములు

అశోక వనమున నున్న సీతను హనుమంతుడు చూచినపుడు, ఆతడు పల్కిన 'అడియాలము' లను కొన్ని వృత్తములలో పలికిరి. కొన్ని ఉపదేశాత్మకములును వారి రచనలో నున్నవి. స్త్రీలకును కొన్ని ఉపదేశములు గలవు మన యిండ్లలో - మన సంతానము లకు భగవన్నామమునే యుంచవలె ననియు — విష్ణు చిత్తుల మఱియొక ప్రబోధము

## వేణు గాన మాధుర్యము - కవితా గాన మాధుర్యము

శ్రీ కృష్ణుని వేణు గానము విన్నపుడు - చేతనములే గాక, అచేతనము లైన [51]వృక్షములు గూడ నిష్కంపములై, మధు ధారలు గార్చుచు పుష్పము లవశములై, జల జల రాలుచు చెట్ల కొమ్మలు కృష్ణుని కున్న వైపునకు వంగి, భావావేశముచే పర్ణములు ముడిచి కొను.

ఈ మాటలు విష్ణు చిత్తు లన్నవే పెరియాళ్వార్ల కవిత్వము గూడ నిట్టిదే వారి హృదయమును కృష్ణ వేణువునుండి బయలుదేరి, కవితా గానము సర్వమును మోహింపజేయునది మాత్రమే గాదు పవిత్రీకరించునది గూడ. దాని సారస్యమును నిజముగా ఆస్వాదించ వారు వీత రాగులు, భగవ దున్మాదను పరులు మనమా వేణు గానము విన లేము ఒక వేళ యేదో పూర్వ పుణ్య వశము

51 మరంగళ్ నిన్రుమదు తారైగళ్ పాయుమ్
మలర్గళ్ వీళుం, వళర్కొంబు తాళుం.
ఇరంకుం, కూంపుం, తిరుమాల్
నిన్ర నిన్ర పక్కం నోక్కి.

# సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 4 | 11 | సండగనుండి | సండగనుండి | 40 | 23 | సేవార్ధర | సేవార్థక |
| 6 | 6 | సోనుకుడ్రు | సోమకుఁడు | 45 | 23 | కృపయొవ | కృపమైన |
| 7 | 18 | జాపురుషా | కాపురుషా | 46 | 5 | సేమ | స్థేమ |
| 8 | 2 | బోగాఢ్య | భోగాఢ్య | 47 | 9 | దర్శనము. | దర్శనము |
| 8 | 16 | ముస్గనేగి | ముస్గనేగి | 57 | 11 | సయం | స్వయం |
| 11 | 23 | కారమ లోన | కారము లోన | 63 | 17 | సాధకున | సాధకు |
| 13 | 19 | నిచ కలిన్ | నీచ కలిన్ | 64 | 15 | ప్యాసుడు | కప్యాసుఁడు |
| 14 | 24 | గాని భక్తి | గాని, భక్తి | 66 | 14 | ప్రూజించి | పూజించి |
| 15 | 8 | వరునం | నరునం | 69 | 13 | దర్శసము | దర్శనము |
| 17 | 9 | భక్తాః, | భక్తాః | 71 | 6 | హేతువులు | హేతువు |
| 22 | 6 | శాస్ద్రవే | శాస్థవే | 73 | 13 | బడు | బడుట |
| 25 | 4 | నిష్ఠులె | నిష్ఠులై | 74 | 19 | వ్వవహా | వ్యవహా |
| 25 | 16 | సిద్దమైనది | సిద్ధమైనది | 75 | 18 | ఎందిన | సందిన |
| 26 | 17 | స్వరణే | స్మరణే | 76 | 18 | వశులె, | వశులై, |
| 28 | 6 | రాతద్వేష | రాగద్వేష | 85 | 5 | కల్యాష | కల్యాణ |
| 29 | 10 | నమంస్యశ్చ | సముస్యంతశ్చ | 86 | 21 | సిద్దాంత | సిద్ధాంత |
| 31 | 15 | సంసిహా | సంస్మర్తా | 88 | 21 | శిరుత్రాము | శిరుత్రామ్చ |
| 31 | 21 | శిమ | శ్రిమ | 88 | 22 | యున్నవి. | యున్నది. |
| 33 | 15 | వయస్న్న | వయస్సు | 93 | 18 | మారళి | మార్గళి |
| 35 | 8 | స్నిద్దిం | స్నిద్ధిం | 93 | 24 | ఓఙ్గ | ఓఙ్గీ |
| 37 | 7 | నిషయు | నిష్ఠయు | 106 | 27 | యర్దములు | యర్థములు |
| 38 | 19 | = కారులు | కాకారులు | 108 | 17 | సర్థించుచు, | సర్థించుచు, |
| 38 | 22 | జాని | జ్ఞాని | 108 | 21 | కణ్ణాన్ | కణ్ణాన్ |
| 39 | 1 | ప్రవృత్తి | ప్రపత్తి | 120 | 7 | గంభీరత. | గంభీరత, |

| పు | పంక్తి | తప్పు | ఒప్పు | పు | పంక్తి | తప్పు | |
|---|---|---|---|---|---|---|---|
| 126 | 12 | రణమెన | రణమైన | 135 | 18 | సమత్థముగా | సమ్మ |
| 126 | 21 | నియతమెన | నియతమైన | 137 | 12 | వెలుగింప | తెల |
| 127 | 3 | అసదృశమెన | అసదృశమైన | 136 | 13 | విశాలము | విశా |
| 129 | 6 | గుణు | దుణ్ణ | 137 | 22 | ఇకో' | ఇక్లే |
| 129 | 21 | భావను | భావము! | 139 | 24 | జోడించు | జోడి |
| 133 | 8 | కృష్ణు | కృష్ణుని | 148 | 26 | యొన్నై | యొన్నై |
| 133 | 9 | రామోపాన | రామోపాస | 151 | 23 | చేత్రాలలో | చేత |



## శ్రీ రామానుజ కీర్తి కౌముది

## మూడవ భాగములో

# రానున్న రచనలు

౧ స్తుతి చందనము

*శ్రీ చింతలపాటి నరసింహ దీక్షిత శర్మ*

౨ ఆళ్వారుల భక్తి తత్త్వము

*శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు*

౩ పాణయోగి ప్రభావము

*శ్రీమాన్ కోమాండూరు గోపాల కృష్ణమాచార్యులు*

౪ దశ విధ వైష్ణవులు

*శ్రీమాన్ లంకా వేంకట నరసయ్యా సూరి*

౫ అంధ్ర వాఙ్మయము - వైష్ణవ మత ప్రభావము

*డాక్టర్ : కె. వి. ఆర్ నరసింహం*



